ఇలినాయిస్‌లో

# ఏబీ లింకన్



రచయిత

రాబర్ట్ ఇ. షెర్‌వుడ్

అనువాదం:

అద్దేపల్లి వివేకానందాదేవి






పబ్లిషర్సు: అద్దేపల్లి అండుకో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# ABE LINCOLN IN ILLINOIS

BY

Robert Emmet Sherwood



Translated by

**A. VIVECANANDA DEVI,** B. A.

First Edition 5,000 Copies-February 1959-Price 2-00





Publishers: ADDEPALLY & CO.

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.)

# విషయసూచిక

## ప్రథమాంకం

1830 లో ఇలినాయిస్ రాష్ట్రంలోని న్యూసేలం, ఆ ప్రాంతాలు.



## ద్వితీయాంకం

1840 లో ఇలినాయిస్ రాష్ట్రంలో స్ప్రింగుఫీల్డు, ఆ ప్రాంతాలు



## తృతీయాంకం

1858-61 స్ప్రింగుఫీల్డులో

# పాత్రలు

మెంటర్ గ్రాహామ్
ఏ బీ లింకన్
ఏన్ రట్లెడ్జి
బెన్ మాట్లింగ్
ఎడ్డీ బౌలింగ్‌గ్రీన్
నినియన్ ఎడ్వర్డ్సు
జోష్ స్పీడ్
ట్రంకాగ్డల్
జాక్ ఆర్మ్‌స్ట్రాంగ్
బాబ్
ఫియార్గస్
జాస్పు
సేత్ గేల్
నాన్సీ గ్రీన్
బిల్లీ హెర్న్డన్
ఎలిజబెత్ ఎడ్వర్డ్సు
మేరీటాడ్
నినియన్ యొక్క పనిపిల్ల
జిమ్మీ గేల్
ఏగీ గేల్
గోబీ
స్టైఫెన్ ఎ డగ్లస్
విల్లీ లింకన్
టాడ్ లింకన్
రాబర్ట్ లింకన్
లింకన్ యొక్క పనిపిల్ల
క్రిమ్మిన్
బారిక్
స్టర్వ్యిసన్
జడ్
కేవనేగ్
మేజర్

# ఏబీ లింకన్

## ప్రథమాంకం

### ఒకటవ రంగం

ఇలినాయిస్ రాష్ట్రంలో న్యూసేలమ్ అనే చిన్న గ్రామంలో మెంటర్ గ్రాహామ్ యిల్లు. రాత్రి బాగాపొద్దుపోయింది. వంకరగా చేసిన మోటుబల్లమీద చిందరవందరగా పుస్తకాలూ, పేపర్లూ పడేసి వుంటాయి. పైవాసాన్నించి దీపం వేలాడుతూంటుంది. ఆగది అంతటికీ యీగుడ్డిదీపం వెలుతురు మాత్రమే వుంది. బడిపంతులు గ్రహామ్ బల్లదగ్గిర కూచుని వుంటాడు.

వాడిపోయిన ముఖం, చినిగిపోయిన గుడ్డలు, వయసు మీరిన వాడిలా చప్పిదవళ్లతో, పనివాడి వేషంలో అబ్రహాం లింకను బల్లకి రెండవ వైపున కూచుని వుంటాడు. గ్రహామ్ బల్లమీదకు ముఖం వాల్చి కూచుని వున్నాడు. లింకను కుర్చీ కోళ్లు యెత్తి వెనక్కి వంగిన మూలంగా ముఖం చీకట్లో వుంటుంది. మెంటరు గ్రహామ్ వ్యాకరణాన్ని తిరగేస్తూ వుంటాడు.

మెంటరు — ఏబీ! ప్రతీ మానవుడికీ కొన్ని భావాలుంటాయి. ముఖ్యంగా నీబోటివాళ్లకు భావాలు మరీ హెచ్చుగా వుంటాయి. నీస్వభావంలోవున్న రకరకాల దృక్కోణాల్ని తెలియజేస్తాయవి. మానవుల్లో డాంబికులూ, గర్వపోతులూ, యధార్థవాదులూ, నానుపుగాళ్లూ వున్నట్టే భాషలోకూడా రకరకాల స్వభావాల్ని తెలిపే వాక్యాలు వుంటాయి. వీటినే "మూడ్సు" అంటారు ఆంగ్లభాషలో. ఏదీ, ఐదు రకాల "మూడ్సూ" చెప్పు ?

ఏ బీ — ఒకటి "ఇండికేటివ్," రెండు "ఇంపరేటివ్," మూడు "పొటెన్షియల్," నాల్గు "సబ్‌జంక్టివ్," ఐదు "ఇన్‌ఫినిటివ్."

మెంట — వీటి ధర్మాలేమిటి ?

ఏ బీ — అన్నిటికన్నా తేలికైనది "ఇండికేటివ్ మూడ్." ఏదైనా వొకదాన్ని సూచిస్తుంది - వుదాహరణకు, "అతన్ని ప్రేమిస్తున్నారు." దీన్నే ప్రశ్నార్థకంగా చెపితే "అతను ప్రేమిస్తున్నాడా?" లేదా, దాన్నే "అతను ప్రేమించబడుతున్నాడా ?" అని అనవచ్చును. ఆజ్ఞావాచకమైన "ఇంపరేటివ్"లో దీన్నే చెపితే, "బయటికి నడువు, పీడవదులుతుంది" అనవచ్చు.

మెంట — (నవ్వుతూ) ఇదేనా నీకు స్ఫురించిన మంచి వుదాహరణ ?

ఏ బీ — బైబిలు గ్రంథంలో చెప్పినట్లు చెప్పాలంటే, "శాంతితో వెళ్లు!" దీన్ని ఇంపరేటివ్ అనవచ్చు.

మెంట — వాక్యాన్ని పలికేప్పుడు యేయేరకం ఆజ్ఞాభావంతో మాట్లాడుతామో దాన్నిబట్టే ఆవాక్యం యొక్క "మూడ్" ఆధారపడి వుంటుంది. దీన్నే వేరే విధంగా వినయపూర్వకంగానూ, ప్రేమ పూర్వకంగానూ చెప్పవచ్చు.

ఏ బీ — "ప్రభూ! మానిత్యాహారాన్ని యీనాడు ప్రసాదించు. మాదోషాలన్నిటినీ మన్నించు" మన్నట్టుగానా ?

మెంట — (బల్లమీదవున్న పేపర్లలోనుంచి వొక పేపరుతీసి) యునైటెడ్‌స్టేట్సు సెనేటులో శ్రీ వెబెస్టర్ యిచ్చిన

వుపన్యాస మిదే. దీన్ని నువ్వు చదవాలి. వుపన్యాస ధోరణిలో "ఇంప్లి కేషన్" ని చక్కగా వుపయోగించిన వుపన్యాసమిది. ఇదిగో — ఇక్కడనుంచీ చదువు దీన్ని. (చదివేదాన్ని వినడానికి కుర్చీకి చేరగిలబడతాడు.)

ఏబీ — (పత్రిక తీసుకొని ముందుకి వంగి వెలుతురులో చదువుతాడు) "అయ్యా," అని తన సహజగంభీర స్వరం కంగున గుడిగంటలా మోగుతూవుంటే మాట్లాడుతూవుంటాడు "అయ్యా! వినండి. మన యూనియన్ మాత్రమే దృష్టిలో పెట్టుకుని ఆలోచించాను. దీని తరువాత యేమి జరుగుతుందో మనకవసరంలేదు. ఈయూనియన్ చక్కగా వర్ధిల్లుతూవున్నంతకాలం ... (భావప్రవర్శనం చూపకుండా నిదరపోతున్న వాడిలా చదువుకుపోతూంటాడు.)

మెంట — (చిరాకుగా) కోమటిపద్దులా యేమిటా చదువు? నువ్వే సెనేటులోవుండి దేశంయొక్క భవిష్యత్తు నీమీందే ఆధారపడివుంటే యెలా మాట్లాడుతావో అల్లామాట్లాడు. నీవుత్సాహాన్నీ శక్తినీ అందులో చూపించు!

ఏబీ — వెబ్‌స్టరులా నేను దీర్ఘమైన పెద్దమాటలు మాట్లాడలేను.

మెంట — అవినేర్చుకోడానికే యిక్కడికి వచ్చింది. ఊఁ... చదువు.

ఏబీ — (నెమ్మదిగా నిరుత్సాహంగా చదువుతాడు)

"మన యూనియన్ వున్నంతకాలం మన, మన పిల్లల భావి సుఖంగా వుటుంది. ఆ తరువాత యేం జరుగుతుందో

ప్రోహించడానికి కూడా నేను ప్రయత్నించేయను. భగవత్కృపవల్ల నాజీవితంలో యేవిధమైన విషాదాంత నాటకం ఆరంభం కాకుండా వుండాలని కోరుతున్నాను.

మెంట — ఇక్కడనుంచీ క్రియల్నె విధంగా ప్రయోగిస్తున్నాడో చూడు!

ఏబీ — "భౌతికమైన యీ నాకళ్ళు యీలోకంలోని వెలుగు చూడ్డం మాని స్వర్గీయ తేజాన్ని చూచేవరకూ, తేజోమయంగా వెల్గుతున్న మనయూనియన్ అల్లర్లూ, అసూయలు విద్వేషాలతో ఛిన్నాభిన్నాలై, విప్లవాలతో రక్తపాతం కాకుండా వుండాలని కోరుతున్నాను. ప్రపంచ విఖ్యాతమైన మనరిపబ్లికులోని నక్షత్రమొకటైనా నేలరాలకుండా యేవిధమైన సమస్యలూ ... (ఏబీవుచ్చారణ తడబడుతుంది.)

మెంట — ఇదే "ఇంటరోగేటరీ."

ఏబీ — (చదువుతూనే వుంటాడు.)

"ఈప్రశ్నలన్నీ దేనికోసం?" "స్వాతంత్ర్యంముందు, దేశంతరువాత" అనే మాటలు ఆత్మ విద్రోహకరమైనవి తెలివితక్కువైనవీకూడాను. ప్రతి అమెరికన్ పౌరుడికీ స్వాతంత్ర్యంతోపాటు, యూనియన్ సంరక్షణకూడా ప్రాణసమానమైనదే ననే విషయం అందరూ ఎరిగిందే."

మెంట — "స్వాతంత్ర్యం '<u>తోపాటు</u>'" అనేది వత్తి చదవాలి!

ఏబీ — "స్వాతంత్ర్యం, దేశం అనే రెండూ విడివడని పరమసత్యాలు". (పత్రికబల్లమీద పడేసి) దీంతో అందరూ

లేచి చప్పట్లు కొడుతూ తమ సంతోషాన్ని వెలిబుచ్చి వుంటారు. అవునా?

మెంట — లేదు. వాళ్ళ వాళ్ళ పార్టీ విభేదాల్ని బట్టి కొందరు తలలూపారు. కొందరు ఛీఛీ అన్నారు.

ఏబీ — ఇంతకీ అతను దేన్ని గురించి మాట్లాడుతున్నట్లు?

మెంట — "అమెరికన్ యూనియన్ నుంచి మిగిలిన రాష్ట్రాలు విడిపోడానికి స్వాతంత్ర్యం వుందా లేదా?" అనే ప్రశ్న పైన చెలరేగిన వాదవివాదాల్ని గురించిన మాటలివి. హైనీ అనే ఆయన "దక్షిణ కేరలీనాకు అమెరికన్ యూనియన్‌నుంచి విడిపోడానికి హక్కు వుంద"ని స్పష్టంగా వాదించాడు. "మనుష్యులకు వ్యక్తిగతస్వేచ్ఛ వున్నట్లే రాష్ట్రాలికికూడా స్వేచ్ఛపొందే అధికారంవుండా" లంటూ వాదించాడు. "హెచ్చుమంది ప్రజలు యూనియన్‌లో వుండడాని కంగీకరించకపోతే వారు వేరే జాతిగా యెందు కేర్పడగూడదు? యూరపుఖండంలో యెన్నో జాతులున్నప్పుడు యిక్కడకూడా వుండవచ్చునుగదా?" అని అన్నాడు. దీనికి వెబ్‌స్టరు ఘాటుగా తగిన సమాధాన మిచ్చాడు "అమెరికన్ యూనియన్ అంటూ లేకపోతే దేశంలో స్వాతంత్ర్య మంటూనే నశించి పోతుంది" అన్నాడు. ఇదే "పొటెన్‌షియల్ మూడ్" చదువు!

ఏబీ — అంటే యేదైనా వొక విషయం యిక ముందు సంభవించవచ్చునని చెపుతుంది—సాధారణంగా బాధాజనకమైన విషయాన్నే సూచిస్తుంది. "నాఅప్పులన్నీ తీరడమంటూ

వుంటే నేను సుఖంగా జీవించగల్గుతాను" లాగా వుంటుంది వుదాహరణ.

మెంట — (నవ్వుతూ) ఏబి! ఇటువంటి వుదాహరణ ఎందుకు చెప్పావ్?

ఏబి — చెప్పడానికేముంది! ఇరవైనాల్గు గంటలూ నన్ను బాధించే ఇది వాక్యమే!

మెంట — నీ కొల్వు మళ్ళీ చిక్కుల్లో పడిందా?

ఏబీ — (నెమ్మదిగా) అమ్మాల్సిన విస్కీ నంతా బైరీ కూచుని తాగేస్తున్నాను. రేపో మాపో కొట్టు మూసేయాల్సి వస్తుంది. ఇంతకీ మానాన్నలాగే నేనూ దురదృష్టవంతుణ్ణి. కమాప్రుల్లోచల్లి కదలకుండావుండే వుద్యోగం ఇయ్యండి, దాన్ని నిలబెట్టుకోడం చేతకాదు.

మెంట — అవేంమాటలు ఏబీ! నువ్వు పని నిలబెట్టుకోలేక పోతున్నావని ఎవరన్నారు? ఊరు ఊరంతా నువ్వంటే ప్రాణం ఇస్తారు. నిన్ను పైకి తీసుకురావాలనీ, నీకు చేయూత ఇవ్వాలనీ ఆరాటపడతారు.

ఏబీ — (బాధగా) అవును మెంటర్! నీలాంటి సహృదయులు అర్ధరాత్రిదాకా మేలుకొని నాకు చదువునేర్పాలనుకున్నట్టేగా? "వారానికి ఒకసారి టపారావడంవల్ల పోస్టు మేష్టరీ చేసే వాడికి ఏమీ పనివుండదు. అందుకని నువ్వా వుద్యోగం చేయకూడదా?" అని జడ్జిగ్రీనూ, జోషెప్పీడూ చెపుతున్నారు. నామంచికోరే స్నేహితులు చాలామందే వున్నా, వాళ్ళు నాఅదృష్టాన్ని మార్చలేరుగా. అసలు నాస్వభావమే అలాటిదేమో!

మెంట — నువ్వు యీ న్యూసేలం వదిలిపెట్టి వెళ్ళితే అన్నీ బాగుపడతాయి. అసలీ మారుమూల పల్లెటూళ్ళో ఎవరూ పైకి రారులే!

ఏబీ — అవును. నేనూ అలానే అనుకొని రోజూ యీవూరు వదిలిపెట్టి పోవాలని అనుకుంటున్నాను. అసలు మా వంశంలో కాలినిలకడ లేదు. మేంకోరేది ఏమిటో, దేని కోసం అన్వేషిస్తున్నామో తెలియక అక్కడికీ ఇక్కడికీ తిరుగుతూ బాధపడతాం. మానాన్న వర్జీనియానించి కెంటకీ వచ్చాడు. నేను పుట్టాక అక్కణ్ణుంచి ఇండియానా మకాం ఎత్తాడు. మళ్ళీ అక్కణ్ణుంచి ఇలినాయిస్ వచ్చాం. నా చిన్నప్పుడు మాట్లాడితే మూటాముల్లె సవరించుకొని 'జై పరమేశ్వరా' అంటూ బయలుదేరడం నాకింకా బాగా జ్ఞాపకంవుంది.

మెంట — అయితే ఇంకేం ఏబీ! వెంటనే బయలుదేరు. నూతన ప్రపంచంలో అడుగుపెట్టి నూతన మార్గాల్ని అన్వేషించు.

ఏబీ — సేత్ గేల్, నేనూ కేన్సాస్ గానీ నెబ్రాస్కా రాష్ట్రంగానీ వెళ్ళాలని చాలారోజులనుంచి అనుకుంటున్నాం. కాని ఏం లాభం? ఎక్కడికి వెళ్ళినా నుదిటిగీత తప్పదు. సంతోషంతోపాటు సరదాలూ, అప్పులూ పెరిగిపోతూ వుంటాయి.

మెంట — ఏపనికీ పనికిరానివాడు బడిపంతులయినా, రాజకీయ వేత్తయినా కావచ్చుననేమాట గుర్తుకు తెచ్చుకో ఏబీ!

ఏబీ — అలా అయితే నేను పంతుల్నీ, నువ్వు రాజకీయవేత్తా అవుదాం.

మెంట — ఇలాంటివి అప్పుడప్పుడు సంభవిస్తూనే వుంటాయి.

ఏబీ — ఎన్నికల్లో నెగ్గితే ఉన్న వూరు విడిచి పట్టణాల్లో పడి వుండాలి. నా కిలాంటివి అసలు కిట్టవు.

మెంట — ఉష్ణం ఉష్ణేన శీతలః.

ఏబీ — నావుద్దేశం అదికాదు.

మెంట — పట్టణాలంటే నీకెందుకింత అసహ్యం? అసలు నువ్వెప్పుడేనా పట్టణం వెళ్ళావా ?

ఏబీ — ఎందుకు వెళ్ళలా ? రెండుసార్లు పడవమీద న్యూఆర్లియన్సు వెళ్ళాను. అక్కడున్న ప్రతీనిముషం భయంతో చచ్చాను.

మెంట — దేన్ని చూసి భయపడ్డావోయ్ ఏబీ !

ఏబీ — చెపితే నవ్వుతావేమో! అక్కడవున్న గుంపుల గుంపుల జనాన్ని చూస్తేనే జడిసిపోయాను.

మెంట — నీ నగానాణ్యాలు ఎత్తుకుపోతారని భయపడ్డావా ?

ఏబీ — (గంభీరంగా) లేదు. చంపుతారనే భయపడ్డాను.

మెంట — (అతడూ గంభీరంగానే) వాళ్ళు నిన్నెందుకు చంపుతారు ?

ఏబీ — ఏమో ? ఎందుకో చెప్పలేను.

మెంట — (ఒక్కనిమిషం ఆగి) నువ్వు తరుచు చావుని గురించి ఎందు కాలోచిస్తావు ?

ఏబీ — అవును; ఆలోచిస్తూనే వుంటాను. నాకు వూహా తెలిసిన దగ్గిర్నించి చావు నన్ను వెంటాడుతున్నదా అని

అనిపిస్తుంది. నేను జానెడు ఎదిగానో లేదో మా అమ్మ కళ్ళుమూసింది. మానాన్న స్వయంగా నే నాడుకొనే చాకుతోనే మా అమ్మని పడుకోబెట్టి పాతిపెట్టే పెట్టెని తయారు చేసాడు. నేనూ దానికి సాయం చేసాను. ఒకే ఆవరణలో అమ్మమ్మపక్కనే అమ్మనీ, ఒక తోటలోనే పాతిపెట్టారు. నేను తరుచు సమాధులువున్న ఆతోటలోకి వెళ్ళేవాడిని. చిన్నచిన్న లేడిపిల్లలు సమాధిమీదనుంచి పరిగెత్తి ఆడుకునేవి. ఆరోజు మొదలు ఈ చేతుల్తో ఎన్నడూ లేడిని చంపలా. ఒకరోజు నాన్న తుపాకీ గురి పెట్టి లేడిని చంపడానికి సిద్ధంగావుంటే నేను దానికి ఎదురుగా పరిగెత్తి అడ్డుపడితే నాన్న చావకొట్టి చెవులు మూసాడు. న్యూఆర్లియన్సులో మనుషుల్ని చూసినప్పుడల్లా ఆ లేడిపిల్లల బెదురుచూపే జ్ఞాపకానికి వస్తుంది.

మెంట — (ఒక నిమిషం ఆగి) నీ వొక విచిత్రమైన వ్యక్తి వోయ్ ఏబీ! నీమనసొక విషమసమస్య.

ఏబీ — అలా అనడంలో నీ వుద్దేశం ఏమిటి, మెంటత్ ?

మెంట — ఎప్పుడూ రగులుతున్న మానవద్వేషం ఒకపక్కా, అపారమైన మానవప్రేమ ఒకపక్కా ఒకే హృదయంలో పెనవేసుకు పోవడం నేను ఎక్కడా చూడలేదు.

ఏబీ — అంటే ?

మెంట — మానవుల్ని ప్రేమించి, మానవసంఘాన్ని ద్వేషించడం అన్నమాట.

ఏబీ — నువ్వు చెప్పేది నిజమే కావచ్చు. వ్యక్తిగతంగా తీసుకుంటే విడిగా అందరూ ప్రేమించదగినవారే. కాని,

వాళ్ళే సమూహంగా గుంపుల్లో, సైన్యాల్లో చూస్తే వింతగా ప్రవర్తిస్తారు. నీమాటలు విందామని నేనొస్తే నువ్వేం నన్ను వాగిస్తున్నావు.

మెంట — ఏబీ! నువ్వు మాట్లాడుతుంటే వినాలని వుంటుంది. మీనాన్న చావగొట్టి చెవులు మూసేడనికదూ అన్నావు. ఎంత చక్కని నానుడి. నువ్వు మాట్లాడుతూ వుండు, ఏమన్నా తప్పులువస్తే దిద్దుతాను.

ఏబీ — (నవ్వి) అవును. మా నాన్ననిగురించి ఏం చెప్పినా ఆయన మాటలే నోటబడతాయి. రేపు నీకు బడివుందనుకుంటాను. పొద్దుపోయింది నేను వెళ్ళివస్తాను. (వెళ్ళడానికి లేస్తాడు.)

మెంట — ఒక్కనిమిషం ఆగు. (బల్లమీదవున్న చెత్తలో పత్రికకోసం వెతుకుతాడు) ఇదిగో! ఇదినీకుచూపించాలని తీసాను. (పత్రికతీసిచూపుతాడు.) ఏబీ! ఇది తప్పకుండా చదువు. (ఏబీ పత్రిక అందుకుంటాడు.)

ఏబీ — (వెలుతురుకోసం బల్లమీద ఆనుకుని పత్రిక చదువుతాడు) మృత్యువు...రచయిత జాన్ కీట్స్...వయస్సు: 19 సంవత్సరాలు.

మృత్యువేనిదురయా। బతుకుశేస్వప్నమా!
ఆనందమేదో। అందాలనీడయా?
మాయగానివియన్ని। మాయమైపోవునా
మరుభూమిగానిపీ। మారియేపోవునా
మృత్యుముఖమూ జూచి। మదిలోన వెతజెంది

(దీపం దగ్గరగా జరుగుతాడు).

భారముగ బతుకునూ బాధలతో నీడ్చుచూ
భావిజీవితమేల । భావించనేలేరు
బతుకంటే చావనే । భావమే లేకనూ
బతుకుతారేలనో । బరువుచేటూ బతుకు॥

(మెంటర్ వంక చూసి) చాలా చక్కని పద్యం మెంటర్! చాలా గొప్పగా వుంది. (నెమ్మదిగా తనలో తను చదువుకుంటూ వుంటాడు)

— తెరపడుతుంది —

మొదటిరంగం సమాప్తం

---

## రెండవ రంగం

(న్యూసేలంలో రట్లెడ్జ్ అనే పానశాల. జూలై నాల్గవతారీకు మధ్యాహ్నపువేళ. గదిగోడలు బల్లకూర్పువి. గది అందంగా వుండాలని కిటికీలకు తెరలు వేస్తారు. గోడలకి బొమ్మలు తగిలించి వున్నాయి. అవన్నీ వాషింగ్టన్ మొదలుకొని జాక్సన్ వరకూ అమెరికన్ యూనియన్ అధ్యక్షులుగా వున్నవారి బొమ్మలు. ఎన్నికలకోసమని హెన్రీక్లే బొమ్మకూడా పైనాటిపక్కనే వుంటుంది.

ఎడంచేతిపై పునున్న తలుపు వంటింట్లోకి మార్గం. కుడిచేతిపై పు గదిలోకి ప్రవేశించేద్వారం. ద్వారంమూసి వుంటుంది. గదిలో బాగా వెలుతురుంటుంది. రెండు బల్లలూ, రెండు బెంచీలూ, కొన్ని కుర్చీలూ, ఎత్తుపీటలూ గదినిండా వుంటాయి.

గది చివరవున్న బెంచీ మీద బెన్ మాట్లింగ్ కూర్చుని వుంటాడు. అమెరికా విప్లవంనాటి యుద్ధవీరు డతను. ఆనాటి వలస

రాజ్యాల సైనిక దుస్తుల్ని ధరించి వుంటాడు. జడ్జిబాలింగుగ్రీనూ, నినియన్ ఎడ్వర్డ్సూ, ఆవెనక జోష్‌స్పీడూ ప్రవేశిస్తారు. బాలింగు వయస్సు ముదిరినా ముఖంలో సౌమ్యత కనిపిస్తుంది. నినియన్ యువకుడు. ఆజాన బాహువు. అందగాడు. ధనికుడు. జోష్ శాంతంగా యోచనాపరుడు. మంచిదుస్తులు ధరించి వుంటాడు.)

బాలింగు — (లోపల అడుగుపెడుతూనే) ఎడ్వర్డ్సుగారూ! ఇదే రట్లెడ్జ్ పానశాల. ఇది అందంగా లేనందుకు క్షమించి ఏమీ అనుకోవద్దు.

నిని — క్షమించడానికి ఇందులో ఏముంది జడ్జీగారూ! చక్కని విస్కీ దొరికితే అన్నీచక్కగానే వుంటాయి. (జోష్ ఎడంచేతివైపు గుమ్మం దగ్గిరికి వెళ్తాడు.)

జోష్ — అమ్మా, రట్లెడ్జి కుమారీ! (ఏన్ గుమ్మంలోకివచ్చి)

ఏన్ — ఏం కావాలండీ?

జోష్ — ఏబీలింకను ఇక్కడికి వచ్చాడా అమ్మా?

ఏన్ — లేదండీ, రాలేదు. బహుశా నడకపందాలు దగ్గిర వుండివుంటాడు. (ఆమె ఇంట్లోకి వెళ్ళిపోతుంది)

(జోష్ బాలింగువైపు తిరిగి)

జోష్ — ఏబీని వెతికి వెంటపెట్టుకుని తీసుకొస్తాను.

నిని — జోష్! పొద్దుకుంకేటప్పటికి మనం స్ప్రింగుఫీల్డులో వుండాలని మరిచిపోకు. (జోష్ బయటికి వెళ్ళిపోతాడు.)

బాలి — (మెట్లింగుతో) బాగున్నావా? మామయ్యా! ఎడ్వర్డ్సుగారూ! ఇలాదయచేయండి. (కుడిచేతివైపునున్న బల్లదగ్గిరికి ఇద్దరూవెళతారు)

బెన్ — జాలింగ్ ! క్షేమంగా వున్నారా? (ఏన్ వంటింట్లోంచి బయటకి వస్తుంది)

ఏన్ — నమస్కారం, జడ్జీగారూ !

జాలి — బాగున్నావా ? మీనాన్న తయారుచేసిన మంచి విస్కీ ఇచ్చావంటే నీకు ఋణపడివుంటాం.

ఏన్ — అలాగే తెస్తానండి. (వెళ్ళడానికి సిద్ధపడుతుంది)

బెన్ — (ఏన్‌ను ఆపుచేసి) చూడమ్మాయి ! నాకు ఒక్క గ్లాసు బార్బడాస్‌రమ్ము తెచ్చిపెట్టు అమ్మా !

ఏన్ — మేట్లింగుగారూ! మీరేమీ అనుకోకపోతే-మీకప్పుడే ఒకగ్లాసు యిచ్చాను. మానాన్న పాతబాకీ వసూలయితేగాని ఏమీఇవ్వద్దన్నాడు.

బెన్ — మీనాన్న చెప్పింది నిజమే కావచ్చునమ్మాయి. కానీ, ఆమెరికా స్వాతంత్ర్య యుద్ధవీరుడికి యీగడ్డమీద ఒక గుక్కెడు రమ్ముకికూడా అప్పుపుట్టలేదంటే దేశంలో కృతజ్ఞతే నశించిపోయిందన్నమాట.

జాలి — ఆడబ్బు నేనిస్తానమ్మాయీ ! అతనికి కావలసిన రమ్ము ఇయ్యి. (ట్రమ్ కాగ్‌డల్ ప్రవేశిస్తాడు. సన్నగా పొడ్డుగా వుంటాడు).

బెన్ — (నానుస్తూ) జడ్జీగారూ ! చాలా కృతజ్ఞుణ్ణి.

ట్రమ్ — ఒకకప్పు సిబాగోటీ తీసుకురా ఏన్ !

ఏన్ — మంచిదండి. (ఎడంవైపు వెళిపోతుంది. ట్రమ్ టేబులు దగ్గిరకూచుంటాడు.)

జాలి — బెన్ ! కృతజ్ఞత చెప్పడానికి ఇందులో ఏముంది?

ట్రమ్ — ఎడ్వర్డ్సుగారూ ! అవకాశాలువుండి దినదినం

పెరుగుతోవున్న మాపట్టణాన్ని గురించి మీఅభిప్రాయం ఏమిటండీ?

ని సి — మంచి భవిష్యత్తువుంది, కాగ్ డల్ గారూ! పచ్చని మైదానం - మధ్యనున్న కొండమీదకట్టిన మీవూరు చూడ్డానికి ముచ్చటగావుండి నాకెంతో నచ్చింది.

ట్రమ్ — రాచబాట మావూరు పడమటిదిక్కుగా పోతుంది. ఇక్కడున్న ముఠాలు, దోపిడీవాళ్ళూ పోతే ఈవూరు తప్పకుండా బాగుపడుతుంది. దానికిసందేహం లేదండీ.

ని సి — (మర్యాదగా) అవును. మీరుచెప్పింది నిజంకావచ్చు.

(విస్కీ, టీ, రమ్మూ తీసుకుని ఏన్ ప్రవేశిస్తుంది.)

జా లి — ఏదమ్మా, ఏన్!

ఏ న్ — మట్టిబళ్ళు తిరిగి వచ్చాయాఅండీ?

ట్రమ్ — నేనూ వాటికోసమే ఎదురుచూస్తున్నాను.

బె న్ — ఏన్! ఏదైనా వుత్తరం వస్తుందని ఎదురుచూస్తున్నావా?

ఏ న్ — ఆష్బే, లేదండీ వూరికే అడిగేను. అయినా నాకు వుత్తరాలు రాసేవా రెవరువుంటారు?

జా లి — జూలై నాలుగో రోజున ఏంజరుగుతుందో ఎవరూ చెప్పలేరు. (అతడూ, నిసియన్ గ్లాసులు పైకెత్తుతారు) మీరంతా సుఖంగా వర్థిల్లాలని కోరుతున్నాను. అమ్మాయీ, ఎడ్వర్డ్సుకి పెళ్ళి అయిపోయింది. అంతంత కన్నులు పెట్టుకొని అతణ్ణిచూస్తే ప్రయోజనం లేదు. ఆకళ్ళని ఇంకొకరికోసం దాచిపెట్టు.

ఏన్ — (నవ్వుతూ) జడ్జీగారూ! మీకంతా వేళాకోళమే.
(వంటింట్లోకి వెళ్ళిపోతుంది)

నిని — చాలా అందమైన పిల్ల.

ట్రమ్ — అందచందాలకు తోడు మంచి సాంప్రదాయం.

నిని — అందమైన ఆడవాళ్ళే కరువైన యీప్రాంతంలో ఈచక్కని చుక్కమీద ఇంకా ఎవరికళ్ళూ పడకపోవటం ఆశ్చర్యంగా వుంది.

బాలి — కళ్ళు పడకపోవడమే? పడ్డాయి. మెక్‌నైల్ అనే కుర్రాడు ఈపిల్లమీద కన్నువేశాడు. ఈవూళ్లో బాగా డబ్బు చేసుకున్నాడు. మళ్ళీవస్తానంటూ చల్లగా వూరుదాటాడు. వాడసలిపేరు మెక్‌నమర్ అట. పిచ్చిది వాడికోసం ఇంకా ఎదురుతెన్నులుచూస్తూ కూచుంది. ఎడ్వర్డ్సుగారూ! మీరు మా న్యాసేలంకు ఎందుకు విచ్చేశారో చెబితే మాకుచేతనైన సాయం చేస్తాము.

నిని — నేనెందుకు వచ్చానో పెద్దలయిన మీఅందరికీ తెలిసే వుంటుంది.

ట్రమ్ — తెలియకేమండీ! మీకు కావలసింది ఓట్లు. నావోటు మీకే. నిరంకుశుడయిన ఆండీజాక్సన్‌ని చిత్తు చేయడానికి ఏమయినా చేయాల్సిందే. (ఆండీ జాక్సను బొమ్మవైపుచూసి వేలితో బెదిరిస్తాడు.)

నిని — గౌరవనీయుడయిన మన అధ్యక్షుడంటే నాకు చాలా గౌరవమని మీకు వేరే చెప్పనక్కరలేదు. కాని మన బ్యాంకు పద్ధతుల్ని నాశనంచేస్తూ, చివరకు మన డబ్బుకు

విలువలేకుండా చేస్తూ రాష్ట్రాలుకూడా విడిపోయేస్థితికి దిగజారిపోతే మనం ఉదాసీనంగా వుండడం భావ్యంకాదు.

జాలి — ముసలాడు మహాబలితికితే ఇంకా రెండేళ్ళు బతుకుతాడు. ఈలోగా అతని పలుకుబడితో మనం కలబడలేం.

నిని — దేనికయినా ఆరంభంఅంటూ చేయాలికదా ? ముందు ఇలినాయిస్ రాష్ట్రంలో అతని అనుయాయుల్ని ఓడిద్దాం. జాక్సన్ రాజ్యం నశించాలని సింహనివాదం చెయ్యాలి మనం. (జాక్ ఆర్మ్‌స్ట్రాంగ్‌తో కూడా ముగ్గురు కుర్రాళ్ళు ప్రవేశిస్తారు. ఒకడు బాబ్, రెండోవాడు ఫియార్గన్, మూడోవాడు జాస్ప. వీళ్లు ముగ్గురూ సహజంగా మంచి వాళ్ళయినా అల్లరీ, రౌడీతనానికి ఊళ్ళో పేరుపడ్డారు. చాలా మొండివాళ్ళు.)

జాక్ — (ఎడంవైపు గుమ్మందగ్గరికి వెళ్ళి) రజ్లిజ్జికుమారీ!

ఏన్ — (గుమ్మంలోకి వచ్చి) ఏంకావాలి, జాక్ ?

జాక్ — శ్రమ అనుకోకపోతే ఒకపీపా సారా యిస్తావా ?

బాబ్ — గొంతుక తడి ఆరిపోయింది. ఎంత త్వరగాఇస్తే అంత సంతోషిస్తాము.

ఏన్ — ముందు ఇక్కణ్ణుంచి అవతలకి వెళ్ళండి. వెళ్ళమంటే మీకు కదూ, నీచులు !

జాక్ — ఏమన్నాననీ, అంతమండిపోతున్నావు. ఒక పీపా అన్నాను. అంతేనా అబ్బాయిలూ నేనన్నది ?

ఫియా — అంతే, అలాగేఅన్నావురా.

జాక్ — త్వరగా తెచ్చిపెట్టు ఏన్ !

ఏన్ — మానాన్నే ఇక్కడవుంటే ప్రయరీమైదానపు తో

బాబ్ — వాడు తడిగుడ్డలతో గొంతుకకోసే దేశద్రోహి. కొరడాతో చర్మంఒలిచినా పాపంలేదు.

ఫియా — (అదేసమయంలో) అతని కడుపులోవున్న టీ నంతా బయటికి కక్కించండి, జాక్ !

జాప్స — (అరుస్తూ) ఓ ! ఏనీ, ఆ విస్కీ తీసుకుని త్వరగా రా.

జాక్ — మంచివాళ్ళని జైలుకు పంపడమే నీపని అనుకుంటాను, ముసలినక్కా; జడ్జిగ్రీన్ ! మన న్యూసేలంకి వచ్చిన యీ షోకేలా పురుషుడెవరూ ? ఎవడో కొత్తవాడులా వున్నాడు.

బాలి — మీకు పుణ్యం వుంటుంది. మాట్లాడకుండా మర్యాదగా కూర్చోలేరూ ? వారు స్ప్రింగు ఫీల్డునించి వచ్చారు పేరు నినియన్ ఎడ్వర్డ్సుగారు.

జాక్ — ఏమిటీ ? నినియన్ ఎడ్వర్డ్సు అంటే గవర్నరు కొడుకు కదూ ? బలే, బలే.

నిని — (శాంతంగా) బాగా కనిపెట్టారు.

జాక్ — అందుకనే కొత్తసూటూ బంగారు పొన్నుకర్రా వున్నాయి. బంగారు గ్రుడ్లుపెట్టే నీబాబు ఉన్నంతకాలం ఏమన్నా కొనుక్కుంటావు. మా అందరిదగ్గిరా వసూలైన పన్నులు మీ నాన్న కొట్టేస్తే ఆడబ్బుతో నీజేబులు నింపుకుంటున్నట్టున్నావు. అవునా ? ఎడ్వర్డ్సు.

బాబ్ — ఒరే, జాక్ ! ఆడబ్బు లాగుదాం పట్టరా.

ఫియా — అరే, జాక్ ! నాలుగు తగలనివ్వరా. అవే రాలిపడతాయి.

జాక్ — (ఇంకా నినియన్ తోనే) ఇంతకీ ఇక్కడి కెందుకొచ్చి

నట్టు. ఏమైనా కుస్తీపట్టే ఓపికవుంటే చూడుమరి. నీకు తగినవాణ్ణి నేనే.

ఏన్ — (వస్తూనే) జాక్ ఆంస్ట్రాంగ్! ఇది తాగు. తాగి, మాట్లాడకండా వెళ్ళు. (ఏన్ నాలుగు చిన్నగ్లాసులు తీసుకు వస్తుంది)

జాస్ఫ — నిన్ను పెద్దగ్లాసుతో తెమ్మని చెప్పాడు.

జాక్ — (చిన్నగ్లాసులవంక చూస్తూ) ఇంత చిన్నగ్లాసు నాగొంతుకుక్కూడా తడవదు. పెద్దపీపా పట్టుకురా ఏన్!

ఫియా — మొయ్యలేదేమోరా. నేవెళ్ళి తెస్తారా జాక్! (వంటింటిలోకి వెళ్తాడు.

ఏన్ — (బాధగా) ఇక్కడ ఇంతమంది మొగాళ్ళు వున్నారు, మాలాటి మర్యాదస్తుల్ని ఈ దుర్మార్గుల బాధనించి కాపాడే వాళ్లేలేరా?

నిని — ఏం చేయమంటే అది సంతోషంగా చేస్తాను...... (లేచి నిలబడతాడు).

బా — (అతన్ని ఆపుచేస్తూ) తొందరపడకు ఎడ్వర్డ్సు!

జాక్ — ఎడ్వర్డ్సుగారూ! మంచిది తొందరపడకండి. ఆ ముసలాయనకి బొజ్జ బేరీలావున్నా, బుర్రలో సత్తావుంది. స్లేరిగ్రో ముఠా సత్తా ఆ ముసలి జడ్జీగారికి బాగా తెలుసు. ఆట్టే మాట్టాడావంటే ఆ బెత్తంతో దేహశుద్ధి అవుతుంది. అరే, బాబ్! హాంక్స్పియర్, గష్‌హార్టిమర్లకుపట్టిన గతే ఈయనకూ పడుతుందని చెప్పరా! ఏం జరిగిందో చెపుదూ!

బాబ్ — వాళ్ళిద్దర్నీ పీపాలో కూరి సేలంకొండ మీంచి

కిందికి దొర్లిస్తే, దొర్లుకుంటూ, దొర్లుకుంటూ వెళ్ళి నదిలో పడ్డారు. పీపా విప్పి చూద్దుంకదా వాళ్లు కాలూ చెయ్యీ కదిపే స్థితిలో వుంటేనా!

జాక్ — నిన్నూ నీ స్నేహితుడు ముసలిజడ్జీని కప్పెట్టడానికి ఇంకా పెద్దపీపాయే కావాలనుకొంటా. తప్పకుండా ఆ పని చేసితీరుతాను. మా పెద్దా, నాయకుడూ, నేస్తంఅయిన ఆ వృద్ధ హికరీకి ద్రోహం తలపెట్టి ఎవడైనా నాటకం ఆడాలనుకున్నా, మాలో కలహంపెట్టాలనుకున్నా వాళ్ళ అంతు తేలుస్తాం. ( ఫియార్ గస్సు పెద్ద బ్రాందీపీపాతో ప్రవేశిస్తాడు. )

బెన్ — చావగొట్టండిరా వాణ్ణి. నిజమైన అమెరికన్లు మీరే మిగిలారు.

నిని — (నిలబడుతూ) మీరు సరదా పడుతున్నకుస్తీకి నేనూ సిద్ధంగానే వున్నాను. రండి బయటికి.

ట్రం — ఎడ్వర్డ్సు! చేతులారా చావు తెచ్చుకుంటున్నావు.

జాక్ — అబ్బెబ్బే! మేము ఖూనీకోర్లం కాము. కొద్దిగా దేహశుద్ధి చేస్తాం, అంతే. కొన్నినెలల్లోమళ్లీ కొత్తమనిషి అవ్వచ్చు, అంతే. ఆపీపా ఇల్లాతీసుకురారా ఫియార్ గస్! ( వాళ్లుబయటికివెళ్లడానికి సిద్ధంగా వుంటారు. ఇంతలో ఏబీ గుమ్మంలోకి వస్తాడు: ఇందాకటి కన్నా కొంచెం శుభ్రమైన బట్టలువేసుకొని వుంటాడు. పంట్లాము వేసుకున్నాడు. చేతిలో తపాలాసంచీ వుంటుంది. అతని వెనుక జోష్పీడు వస్తూంటాడు. )

ఏబీ — మట్టిబండి వచ్చింది. జాక్! నువ్వా? ఏమిటోయ్,

మీ రింకా తాగడం పూర్తికాలా? కుమారి ఏన్ ! మీకు వుత్తరం వచ్చింది. (ఏన్‌ను చూసి, సిగ్గుపడుతుంటాడు.)

ఏన్ — ఏది ఏబీ! (వుత్తరం తీసుకొని లోపలికి పరుగెత్తుకుని వెళ్తుంది.)

బెన్ — ఏబీ! చిన్న యుద్ధం జరగబోతోందోయ్.

నిని — (జాక్‌తో) రావాలని వుంటే యుద్ధానికి రా!

జాక్ — అల్లాగే. రండోయ్ !

ఏబీ — యుద్ధమా? ఎవరు? ఎందుకు?

జాక్ — ఏబీ! ఇతను నినియన్ ఎడ్వర్డ్సు కొడుకు. స్ప్రింగు ఫీల్డునించి పొడిచేద్దామని వస్తున్నాడట. అందుకని పాఠం చెబుదా మనుకుంటున్నాను. (ఏబీ నినియన్ వంక చూస్తాడు)

బౌ — ఏబీ! ఇది గాని నువ్వు ఆపుచెయ్యకపోతే హత్య జరిగి తీరుతుంది.

జాక్ — నువ్వు నోరుముయ్యి, ముసిలినక్కా! ఏండీ జాక్సన్ శత్రువుని చంపినా అది తక్కువశిక్షే అవుతుంది. రండోయ్! రండి!

ఏబీ — ఒక్కనిముషం ఆగండబ్బాయిలూ! ఈవేళ ఏం రోజో మర్చిపోయారా?

జాక్ — మర్చిపోలేదు. రాజకీయవేత్త చెవడా లెక్క తీయ డానికి నాలుగో తారీకే కాదు. ఏరోజైనా పరవాలేదు.

ఏబీ — (శాంతంగా) చూడు, జాక్! నీకు యుద్ధంచెయ్యాలని వుంటే చెయ్యొచ్చుకాని పరాయివాళ్ళమీద కయ్యానికి కాలుదువ్వకూడదు. ఈవూరి పోస్టు మాస్టరిని నేను.

అందుకని, నన్ను రాజకీయవేత్తగా ఒప్పుకుని ముందు నాతో యుద్ధంచెయ్యి. (జాక్‌ని ఒకతోపు తోస్తాడు. నినియన్ వైపు తిరిగి) మీా రెవరో నాకు తెలియదు. కాని మీాలాంటి ధైర్యవంతుల్ని చూస్తే చాలా సంతోషంగా వుంది. నాపేరు లింకను.

నిని — (ఏబీతో కరస్పర్శచేసి) లింకన్! నిన్ను కలుసుకున్నందుకు చాలా సంతోషంగా వుంది.

ఏబీ — అవునండి; వాళ్ళు మీాకు అవమానం చెయ్యడమే కాకుండా అపకారంకూడ చేసివుండేవాళ్లు. జాలింగ్! నీకు రెండుత్తరాలు వచ్చాయి. ట్రం! ఇదిగో నీ సిన్సినాతీ పత్రిక.

జాక్ — ఇల్లాచూడు ఏబీ! నువ్వు అనవసరంగా ఇతరుల విషయాల్లో జోక్యం కలగజేసుకుంటున్నావు. ఇది కేవలం దేశగౌరవానికి సంబంధించిన స్వవిషయం.

ఏబీ — జాక్! ఈ వూరికి సంబంధించిన వన్నీ నా స్వవిషయాలే. పైగా నేచేసేపని యిదొక్కటే. హేనా కనిపించి మిమ్మల్ని తోటలోకి త్వరగా రమ్మంది. మీారుగాని ఇప్పుడే వెళ్ళకపోతే మీావాటా కాస్తా స్త్రేడర్ పిల్లలికి పెట్టేస్తుంది. మీారు ఆకలితోవుండక తప్పదు. త్వరగా వెళ్లండి.

ఫియా — (జాక్‌తో) ఏబీకబుర్లలోపడి చల్లారిపోతావేమిటిరా!

ఏబీ — అవును. తప్పకుండా. (ట్రంవైపు తిరిగి) చూడు, ట్రం! నీకు పత్రిక అక్కరలేకపోతే నేను చదివాక ఇస్తాను.

ట్రం — అల్లాగే ఏబీ! ఇదిగో తీసికో. (పేపరు ఏబీవైపు విసురుతాడు)

ఏబీ — మంచిది. (జాక్ వైపు తిరిగి) జాక్, త్వరగా వెళ్ళకపోతే హేనాతో తన్నులు తప్పవు. (పైన కప్పుకున్న కోటుతీసి ఎడమచేతివైపు నున్న కుర్చీదగ్గిరికి వెళ్తాడు. జాక్ ఏబీ వైపు ఒక్క-క్షణం చూసి నవ్వుతాడు.)

జాక్ — (నినియన్స్‌తో) మంచిది, ఏబీ లింకనొచ్చి నిన్ను బ్రతికించాడు. నాన్నే హితుడొచ్చి చెప్పాడు కనక నీతో యుద్ధం విరమించుకున్నాను.

ఏబీ — (కూర్చుంటూ) నేను దగ్గిరిగా వున్నాను కనక మీ పప్పులు వుడక లేదన్న మాట.

జాక్ — ఇదిగో, చెపుతున్నాను. విను, ఎడ్వర్డ్సు నినియన్స్ కొడుకా! ఈసారి యీప్రాంతానికి వచ్చావో ...

ఏబీ — జాక్! హేనా నీకోసం ఎదురు చూస్తూంది.

జాక్ — (ఏబీ దగ్గిరకొచ్చి) వెళ్తున్నానోయ్. ఇదిగో చెపుతున్నా నబ్బాయి విను. జాగ్రత్త! రాత్రీపగలూ చదువు-ఏమిటా చదువు? ఈ చదువుగాని మానకపోతే ఎందుకూ పనికి రాకుండా చవటలా తయారవుతావు. తరవాత ఎవ్వరితో తన్నులు తిన్నా, నన్ను కూడా కలుపుకునే అనుకో- నాగుండె బద్దలయిపోతుంది. (నవ్వుతూ ఏబీ భుజం తట్టివెళ్తూ) ఎడ్వర్డ్సు! మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా సంతోషంగా వుంది. (బాబ్ జాన్స్ వెంటరాగా బయటికి వెళ్ళిపోతాడు. ఫియార్గసు సారాపీపాతో వెంటవెళ్తాడు.)

నిని — (జాక్‌తో) చాలా సంతోషం.

ఏబీ — ఆ పీపా ఎక్కడిది ఫియార్గస్?

ఫియా — ( భయపడుతూ ) జాక్ తియ్యమంటే-మరి-రట్ లెడ్జి వంటింటిలోంచి తీసేను... నాకేమీ...

ఏబీ — సరే మంచిది. అది ముందు కిందపెట్టు. నీగ్గాని సేత్ గేల్ కనిపిస్తే అతనికి వుత్తరం వచ్చిందని చెప్పు.

ఫియా — అలాగే చెప్తాను ఏబీ! ( ఫియాయార్గస్ పీపా పెట్టేసి వెళ్ళిపోతాడు. జోష్‌స్పీడ్ నవ్వి, టేబులుదగ్గిరికి వస్తాడు. )

జోష్ — నినియన్! చాలా సంతోషంగావుంది. ఆ కుర్రాళ్లు గాని నీవంటిమీద చెయ్యేసివుంటే నిన్ను మీ ఇంటికి తీసుకువెళ్ళి మీ అమ్మకి అప్పచెప్పడానికి తలకొట్టు కున్నంతపని అయ్యేది.

నిని — ( నవ్వుతూ ) జోష్! ఇలాంటి పనులికి పూనుకున్న ప్పుడు కొన్నిఫలితాలు తప్పనిసరిగా అనుభవించాలని నాకు తెలుసు. ( ఏబీ వంక తిరిగి ) లింకన్! మీ కెంతో ఋణపడివున్నాను.

ఏబీ — ఇందులో ఏముందండి ఎడ్వర్డ్సుగారూ! జాక్ నోటి కొచ్చినట్టు వాగుతాడుగాని మనసులో కల్మషంలేదు.

నిని — మాతోకలిసి కొద్దిగా విస్కీ తీసుకోండి.

ఏబీ — అక్కర్లేదు వద్దండి. ( పేపరు చదువుతూవుంటాడు. బౌలింగు గ్లాసులు నింపుతాడు. )

జౌలి — మీతో చెప్పినా ఫరవాలేదుగాని, నా గుండెదడ ఇంకా తగ్గలేదంటే నమ్మండి. అందుకని ఇంకో గ్లాసుకూడా తాగుతాను. ( నినియనుకు ఒకగ్లాసు అందించితానూ తాగుతాడు. )

ట్రం — చూడండి ఎడ్వర్డ్సు! ఇటువంటి అరాచకత్వంవల్లే మావూరు అన్నిటిలోనూ వెనకబడివుంది.

నిని — మీవూరే అన్నమాటేమిటి మనరాష్ట్రంలో వున్న అన్నిపట్టణాల్లోనూ యీ రకం రౌడీ ముఠా వున్నారు. (కూర్చుని తాగుతూవుంటాడు.)

ఏబీ — జాలింగ్! ఫ్రాంన్సులో వున్న లాయిన్సులో పెద్ద దొమ్మీ జరిగిందిట (చదువుతాడు) "బట్టల మిల్లులో కొంతమంది పనివాళ్ళని పనిలోంచి తీసివేసి కుట్టు మిషన్లు పెట్టారనే కారణంవల్ల, పారిశ్రామిక ప్రాముఖ్యత చెందిన కొన్ని ప్రాంతాల్లో కొందరు దుండగీండ్లు అరాచకత్వాన్ని వ్యాపింపచేస్తూ రక్తాన్ని ప్రవహింపచేస్తున్నారు. ఫ్రెంచి ప్రభుత్వ సైన్యంవచ్చి యీ దొమ్మీలను అణిచివేస్తేగాని యీ అల్లరులు నశించలేదు. దొమ్మీదార్లు 'పనేనా ఇవ్వండి, లేదా యుద్ధం చేస్తూనే చస్తా' మని జండాలు పట్టుకుని తిరుగుతున్నారు" (ఏబీ కుడివైపు ఉన్నవారివంక చూస్తాడు) విప్లవం అంటే ఇదే.

జాలి — అవునుగాని, మన న్యూసేలంకు ఇది చాలా దూరంగా వుంది.

జోష్ — పేపరు కిందపెట్టు ఏబీ! నీతో కొంచెం మాట్లాడాలి.

ఏబీ — నాతోనా? దేన్నిగురించి? (ఆశ్చర్యంగా జోష్, జాలింగ్, నినియన్లవంక చూస్తాడు.)

జోష్ — నిన్ను చూపించాలనే ఎడ్వర్డ్సుగారి ఆజ్ఞతీసుకుని వారబ్బాయిని ఇంతదూరం తీసుకొచ్చాను. వచ్చినపని చెప్తాను విను.

ని ని — జోష్! అసలువిషయం చెప్పు. (అందరూ ఏబీవంక కుతూహలంగా చూస్తూవుంటారు.)

జోష్ — ఏబీ! నువ్వు మా రాష్ట్ర ఎసెంబ్లీకి అభ్యర్థిగా ఎన్నికల్లో నిలబడతావా?

ఏ బీ — ఎప్పుడు?

జోష్ — ఇప్పుడే. వచ్చే ఎలక్షనులలోనే.

ఏ బీ — ఎందుకు?

ని ని — లింకన్! మీతో పరిచయం అయి కొద్ది క్షణాలే అయినా, మీ స్వభావాన్ని బాగా అర్థంచేసుకున్నాను. ఈ పనికి మీరే తగినవారని జోష్‌తోపాటు నేను నమ్ముతున్నాను. 'విగ్' పార్టీవారమంతా నీకు సాయపడతాం.

ఏ బీ — జోష్! ఇదంతా నీ ఆలోచనా?

జోష్ — (నవ్వుతూ) అబ్బే, లేదు. ఏబీ! ఇది ప్రజలకోర్కె.

ట్రం — బౌలింగ్! దీన్నిగురించి నీ అభిప్రాయ మేమిటి?

బౌ లి — (మనస్ఫూర్తిగా) ఇంతకన్నా మంచివిషయం ఏమి వుంటుంది? ఏబీ! అన్నివిషయాలను గురించి నువ్వు ధారాళంగా మాట్లాడగలవు. టెక్సాసుమీదా, జాతీయబాంకు దివాలా విషయం, బానిసత్వం విషయం అన్నీ నీకు మంచినీళ్ళప్రాయం. ఇంకేం, ఇక మాకు కావలసినంత హుషారూ, కాలక్షేపం అన్నమాట.

ఏ బీ — (నిలబడుతూ) నా అభిప్రాయం ఏమిటో ఎవరూ మాట వరసకైనా తెలుసుకోదలుచుకోలేదా?

జోష్ — (నవ్వుతూ) సరే. అలాగయితే నేను అడుగుతున్నాను. సమాధానం చెప్పు ఏబీ!

ని ని — జోష్ ! అసలువిషయం చెప్పు. ( అందరూ ఏబీవంక కుతూహలంగా చూస్తూవుంటారు. )

జోష్ — ఏబీ! నువ్వు మా రాష్ట్ర ఎసెంబ్లీకి అభ్యర్థిగా ఎన్నికల్లో నిలబడతావా?

ఏ బీ — ఎప్పుడు?

జోష్ — ఇప్పుడే. వచ్చే ఎలక్షనులలోనే.

ఏ బీ — ఎందుకు?

ని ని — లింకన్ ! మీతో పరిచయం అయి కొద్ది క్షణాలే అయినా, మీ స్వభావాన్ని బాగా అర్థంచేసుకున్నాను. ఈ పనికి మీరే తగినవారని జోష్‌తోపాటు నేను నమ్ముతున్నాను. 'విగ్' పార్టీవారమంతా నీకు సాయపడతాం.

ఏ బీ — జోష్ ! ఇదంతా నీ ఆలోచనా ?

జోష్ — ( నవ్వుతూ ) అబ్బే, లేదు. ఏబీ! ఇదిప్రజలకోర్కె.

ట్రం — బౌలింగ్ ! దీన్నిగురించి నీ అభిప్రాయ మేమిటి?

బౌ లి — ( మనస్ఫూర్తిగా ) ఇంతకన్నా మంచివిషయం ఏమివుంటుంది? ఏబీ! అన్నివిషయాలను గురించి నువ్వుధారాళంగా మాట్లాడగలవు. టెక్సాసుమీదా, జాతీయబాంకు దివాలా విషయం, బానిసత్వం విషయం అన్నీ నీకు మంచినీళ్ళప్రాయం. ఇంకేం, ఇక మాకు కావలసినంత హుషారూ, కాలక్షేపం అన్నమాట.

ఏ బీ — (నిలబడుతూ) నా అభిప్రాయం ఏమిటో ఎవరూ మాటవరసకైనా తెలుసుకోదలుచుకోలేదా ?

జోష్ — (నవ్వుతూ) సరే. అలాగయితే నేను అడుగుతున్నాను. సమాధానం చెప్పు ఏబీ !

ఏబీ — (ఒకక్షణం ఆగి) ఇంతకన్నా నవ్వులాట ఇంకోటేమీ వుండదు. సరే. అయిందేదో అయింది. నించున్న పళంగా అడిగితే నేను దీనికి సమాధానం చెప్పలేను. కాని నాప్రస్తుతాభిప్రాయం మాత్రం చెప్పమంటే ఇదేమీ నాకు నచ్చలేదని మాత్రం చెప్పగలను.

జాలి — నువ్వేగాని ఎన్నికల్లో నెగ్గితే రోజుకు మూడు డాలర్లు వస్తాయని మరిచిపోకు.

ఏబీ — అది చాలా పెద్దమొత్తమే, దానికేమీ సందేహం లేదు. జాలింగు, నీఅభిప్రాయంకూడా నాకర్థమయింది. నేను ఇరవై యేళ్ళపాటు లెజిస్లేటివ్ యెసంబ్లీలో వుంటే రోజుకు రెండున్నర డాలర్ల చొప్పున నీ అప్పు చాలా వరకూ తీర్చవచ్చు. అయితే యెంత అవుతుందో లెక్క వేస్తాను. (వేళ్ళమీద లెక్కపెడతాడు)

జాలి — ఏబీ! నేను అప్పులవిషయం ఆలోచించలేదు.

ఏబీ — జాలింగు! నువ్వు అప్పులవిషయం ఆలోచించక పోయినా నేను వాటిని యేమరడానికి వీల్లేదుగా! ఎడ్వర్డ్సుగారూ, మీరుకూడా యీ విషయమై ఆలోచించాల్సింటే! భగవంతుని దయవల్ల 'విగ్ పార్టీ' కి ధనాఢ్యత వుంది. 'జాతీయ బేంక్' సదా వర్ధిల్లాలి.

నిని — అవునవును...మిగిలిన విషయాలతోపాటు......

ఏబీ — చిల్లికానీ సంపాదనలేదు, పైగా పదిహేనువందల డాలర్ల అప్పుతో వున్నవాణ్ణి తీసుకువెళ్లి ఎలక్షనుల్లో నిలబెడితే యేమాతుందో ఆలోచించారా?

జా — (నినియన్‌తో) ఏబీ అప్పుల గురించి చెప్పవలిసినవాణ్ణి

నేను. ఏబీ, బెట్టీఅనే దురదృష్టవంతుడితో కలిసి దుకాణం వొకటి పెట్టాడు. ఈ కొట్లో సామానుతోపాటు సారా పీపాలుకూడా అమ్మేవారు. బెట్టీ చల్లగా పీపాలన్నీ కాళీ చేసేశాడు. దాంతో దుకాణం దివాలా తీసింది. పెట్టుబడి దార్ల అప్పులన్నీ తీర్చే బాధ్యత యేబీ తననెత్తిమీద వేసుకున్నాడు. ఎడ్వర్డుగారూ! దీంతో యీచుట్టుపక్కల వాళ్లందరికీ ఇతనంటే చక్కని గౌరవం యేర్పడింది.

నిని - మీ అభిప్రాయంతో నేనూ యేకీభవిస్తున్నాను.

ఏబీ — మీ అందరికీ నామీదవున్న సదభిప్రాయానికీ, దయకీ కృతజ్ఞుణ్ణి. మీరిలా నన్ను పొగడడం మొదలుపెడితే యిప్పుడిచ్చే మూడు డాలర్లుకూడా సరిపోనంత ఖర్చు పెరిగి తీరుతుంది.

జోష్ — ఏబీ! నీకు బాగాచదువుకుని పైకిరావాలనే కోర్కె వుందిగదా. ఈ అవకాశాన్ని వుపయోగించుకున్నావంటే రాష్ట్రంలోవున్న పెద్దపెద్ద లాయర్లతో పరిచయం యేర్పడుతుంది. పెద్దపెద్ద గ్రంథాలయాల్లో వాళ్ల పరిచయం వల్ల ప్రవేశం కలుగుతుంది.

ఏబీ — నాదగ్గిర ధర్మకర్త "బ్లేక్ స్టోను" రాసిన న్యాయశాస్త్రంవుంది. పాతగ్రంథాల కొట్లోవున్న పనికిరాని చెత్తలోంచి యేరుకున్నాను. ఇక న్యాయవాదులతో సాంగత్యమంటారా వాళ్లు నాస్నేహాన్ని వాంఛిస్తారన్న మాటేముంది ?

నిని — నీకావిషయంలో ఆలోచనేలక్కరలేదు. నువ్వు ఆరాడీ

మూకకెలా బుద్ధిచెప్పావో చూశాను. ఎవరితో ఎలామెల గాలో నీకు బాగా తెలుసు.

ఏబీ — "క్లేరీ గ్రోవ్" ముఠాలోని రౌడీలతో ఢీకొన్నా నంటే వాళ్లకన్నా బలంగా వున్నాను కాబట్టి అలాచేశాను. కాని "సేంగ్ మెన్" జిల్లాలోవున్న ఓటర్లను జయించే శక్తి నాలోలేదు.

జా — (నవ్వుతూ) ఏబీని గురించి నేను పందెం ఒడ్డుతాను.

ఏబీ — (నినియన్‌తో) మీ రాజకీయాభిప్రాయాలతో నే నేకీ భవిస్తానని మీకు నమ్మకమేమిటి? నేను తప్పుగా మాట్లాడ నని మీరెలా చెప్పగలరు?

నిని — లింకను! అసలు నీరాజకీయపు టభిప్రాయాలేమిటి?

ఏబీ — ఎవరిజోలికీ పోకుండా వుండడమే నావుద్దేశ్యం... మీవుద్దేశ్యం యెలావుండాలని?

నిని — 'ఏంద్రూ జాక్‌సన్' వుచ్ఛస్థితిలో వున్నాడు. అతని అనుయాయుల్లా విప్లవాత్మకమైన వుద్దేశ్యాలు లేకుండా, శాంతికాముకులై దూరదర్శిత్వమున్న యువకులు నేడు మనదేశానికి అవసరం. ఏమూల సూత్రాలపైన మన పెద్దలు దేశనిర్మాణ సౌధాన్ని నిర్మించారో ఆ మూల సూత్రాలవైపే మనంకూడా పురోగమించాలి.

ఏబీ — మంచిది! నేనుపూర్వాచారపరాయణుణ్ణి నిజమే! నేను లెజిస్లేటివ్ యెసంబ్లీలోకి వెళ్ళగానే నూతనపంథాలు తొక్కననీ, అభ్యుదయవాదాలు చేయననీ మీకు నమ్మక మేమిటి? తీరా అక్కడికి వెళ్లాక నోరు పెగలదనేభయం కూడా వుంది.

జోష్ — (నవ్వుతూ) నినియన్! నేను నీకు ముందే చెప్పాను. యితనికన్నా మంచివాళ్ళూ, తగినవాళ్ళూ యీ పనికి యింకోరులేరు.

(నినియన్ కూడా నవ్వుతూ నిలబడతాడు)

నిని — (ఏబీ వైపు వెళ్ళి) నిజం చెప్పాలంటే మాది కేవలం ధనికవర్గానికి చెందిన పార్టీయనే అపవాదునుంచి తప్పించుకోవాలనే, నీలాటి సామాన్యుణ్ణి వెతుకుతున్నాం ఏబీ! నువ్వు పోస్టుమాస్టరువు కావడంచేత ప్రజలతో నీకు చాలా సంబంధం వుంటుంది. ఉత్తరాలు అందిస్తూనే యెన్నికల వుపన్యాసాలు యిస్తూ, మేం రాజధాని నుంచి పంపే యెలక్షను కాగితాల్ని కూడా పంచిపెట్టవచ్చు.

ఏబీ — మీరు వీటితోపాటు నాకు వొక జత మంచిరకం బట్టలు కూడా యిచ్చుకుంటారా? ఎలక్షన్లలో నిలబడే వాడు బొత్తిగా సామాన్యంగా కనబడగూడదు.

నిని — (చిరునవ్వుతో) జడ్జీగారూ! యిది చెయ్యడం యేమంత భాగ్యం!

బౌ — అవునవును, నేనూ అదే అనుకుంటున్నాను.

నిని — (సగర్వంగా) చూడు, లింకన్! బాగా ఆలోచించుకో, యిటువంటి అవకాశాన్ని వుపయోగించుకుంటే చక్కని భవిష్యత్తు వుంటుంది. దక్షిణానికి యింకాయింకా పెరిగి పోతున్న 'టెక్సాస్' మైదానం, యిటు పడమట పసిఫిక్ మహాసముద్రం సరిహద్దుగావున్న 'కాలిఫోర్నియా రాష్ట్రం' అంతా కలిస్తే వొక మహాజాతిగా వర్ధిల్లబోతుంది. ఈ పరిస్థితుల్లో యీచిన్న అవకాశం విజయా

నికి మొదటి సోపానం. లింకన్! మన దేశం వొక మహా ఖండంగా వర్ధిల్లాలి. మనకి కావలసింది మానవశక్తి. (గడియారం చూచుకుని) ఈవేళ సాయంత్రం 'స్ప్రింగు ఫీల్డు' లో జరుగుతున్న వూరేగింపుకు నేను హాజరు కావాలి. నన్ను క్షమిస్తే నేను వెళ్ళివస్తాను. వెళతాను లింకన్. నిన్ను కలుసుకున్నందుకు నాకు చాలాఆనందంగా వుంది.

ఏబీ — (కరస్పర్శచేస్తూ) శెలవుతీసుకుంటున్నాను. వుంటానండీ యెడ్వర్డ్సుగారూ. మీ వూరేగింపు జయప్రదం కావాలని ఆశిస్తున్నాను.

నిని — నువ్వూ విజయం సాధించాలని కోరుతున్నాను. (బెన్ మేట్లింగు తప్ప అందరూ వెళ్ళిపోడానికి సంసిద్ధులౌతారు. అతనింకా అలానే తాగుతూంటాడు.)

ఏబీ — ట్రం! ఇదిగో నీ పత్రిక.

ట్రం — దాన్ని యిప్పుడు చదివే తీరికలేదు. నువ్వు చదివి యిస్తే అప్పుడు చూస్తానులే.

ఏబీ — చదివిం తరువాత మీయింటికి తెచ్చి యిస్తాను అలా అయితే!

(ట్రం, నినియన్ వెళ్ళిపోతారు.)

బౌలి — ఏబీ! మళ్ళీ తరువాత కలుసుకుందాం. నేను తిరిగి వచ్చాక డబ్బిస్తానని యేన్‌తో చెప్పు.

ఏబీ — అలాగే బౌలింగు.

(బౌలింగు వెళ్ళిపోతాడు. జోష్ ఒకక్షణం యేబీవంకే చూసి అతనివైపు తిరుగుతాడు)

ఏబీ — జోష్! నువ్వు నామిత్రుడవనుకున్నాను. కాని నీప్రవర్తన ఆశ్చర్యంగా వుంది.

జోష్ — ఏబే! నాకన్నీ తెలుసు. నినియన్ యెడ్వర్డ్సు నన్ను పిలిచి మీ కుగ్రామం న్యూసేలంలో యెవరైనా యెలక్షనులో నిలబెడితే నెగ్గేవారున్నారా అని అడిగితే నీపేరు నాకు వెంటనేతట్టింది. దీనివల్ల నీకు చిరాకూ సిగ్గూకూడా కలిగాయని తెలుసు. నీకిష్టమున్నా లేకపోయినా నువ్వు గొప్పవాడివి కాక తప్పదు. నువ్వు పైకి రావడాని కిది సదవకాశం.

ఏబీ — గొప్పదనాన్ని కాంక్షించే వాణ్ణా నేను?

జోష్ — ఏబీ, దీనికి నువ్వు వొప్పుకోకపోవచ్చు. కాని నీకు పైకి రావాలనే ఆవేదన మనసులోవుంది. దీనికి అవలంబనం లేకపోతే నశించిపోతుంది. అందుకని నువ్వు దీని కంగీకరిస్తే భవిష్యత్తులో నువ్వు విచారించవు సరిగదా, నీస్నేహాన్ని నేను దుర్వినియోగం చేయలేదని అంగీకరించి తీరుతావు.

ఏబీ — (నవ్వి) జోష్! నీమీద నాకేమీ కోపంలేదు, (నడిచి వెళ్ళి గుమ్మంబయటికిచూస్తాడు.) కాని నినియన్ యెడ్వర్డ్సు ధనవంతుడు. ఉన్నతవిద్యాధికుడు, కీర్తిశాలి. అతనికి రాజకీయజీవితం వొక విలాసకేళి. అతనిలావుంటే నాకూ ఆ జీవితం విలాసప్రాయం అయ్యేదేమో! (జోష్ వేపు తిరిగి) 'జేక్ స్టన్ న్యాయశాస్త్రం' చదువుతూవుంటేనూ, బైబిల్ చదువుతూంటేనూ, చట్టాలనిర్మాణం, 'రాజ్యపాలనా చాలా బాధ్యతాయుతమైన ధర్మకార్యాలనిపిస్తాయి. కాని

రాజ్యాన్ని పాలించాలనుకోవడం కేవలం విగ్ పార్టీ ఆధి పత్యాన్ని పునర్నిర్మించడానికి మాత్రం కాదని తోస్తుంది.

(సెత్ గేల్ ప్రవేశిస్తాడు. యువకుడు. నాగరికతయెరగని పడమటి దేశపు దుస్తుల్లో వుంటాడు)

సెత్ — ఏబీ! నాకుత్తరం వచ్చిందని ఫియార్ గస్ చెప్పాడు.

ఏబీ — (వుత్తరాలసంచి వెతికి చూసి) అవును, సేత్ !

సేత్ — స్పీడుగారూ బాగున్నారా ?

జోష్ — గేల్ నువ్వూ కులాసాయేగదా ?

ఏబీ — నీవుత్తర మిదుగో సేత్. (ఉత్తరం చేతికిఅందిస్తాడు. సేత్ వుత్తరం తీసుకుని చదువుతూ కూచుంటాడు)

జోష్ — ఏబీ! నేను స్ప్రింగు ఫీల్డు వెళ్ళాలి. మళ్ళీ రెండు మూడు వారాల్లో తిరిగి వస్తాను.

ఏబీ — నేనిక్కడే వుంటానండీ.

(జోష్ వెళ్ళిపోతాడు. ఏబీ కుడివైపు కూచుని పేపరు తీస్తాడు. కాని చదవడు. బెన్ లేచి తూలుతూ వస్తాడు.)

బెన్ — ( కోపంగా ) ఏబీ ! నువ్వు నిజంగా నిలబడతావా ? నిన్ను వాళ్ళు అభ్యర్థిగా నిలబెట్టడానికి నువ్వు అవకాశ మిస్తావా ?

ఏబీ — దాన్ని గురించి ఆలోచించడానికీ, నిర్ణయించడానికీ సైము రాలేదు.

బెన్ — మంచిది. చేతులు దాటిపోకుండానే ముందే బాగా ఆలోచించి యిందులో దిగకుండావుండడం మంచిది. వాళ్ళకుదొరకబోకు. ఈదిక్కుమాలిన దేశంలో హాస్యాస్పద మైన సూట్లు వాళ్ళు నీచేత తొడిగించకుండా జాగ్రత్తపడు.

ఏబీ లింకన్ ! మంచివాడివి. వృథాగాఅప్పులుచేస్తూ పూరి కినేతిరిగే పోరంబోకువైనా మంచి నమ్మదగినవాడివి. ఋజువాదివి. దోపిడీగాళ్లతోనిండిన ప్రభుత్వంలో నీకు తావులేదు. ఐక్యరాజ్యాలన్నీ లంచగొండిగా తయారైనట్టు నువ్వూ లంచగొండిగా తయారౌతావు. వాషింగ్టన్, జఫర్సన్, జాన్ ఎడ్మండ్లవంకచూడు (వాళ్ల బొమ్మలవంకచూపిస్తాడు.) వాళ్ళు యిప్పుడున్నారా ? ఏనాడో కళ్ళుమూసేరు. దేనికోసమైవాళ్లు యుద్ధంచేసి నెగ్గారో, దేనికి చిహ్నాలుగా నిలిచారో అదే యీ నాడు నాశనమైపోయింది. (ఎడంవైపునున్న బల్లమీద గ్లాసుతీసుకువెళ్లడానికి యేన్ వస్తుంది. ఏబీ ఆమె వంకే చూస్తూంటాడు.) ఇంతకన్నా మనమంతా నల్లనీగ్రోబానిసలమైపోయినా మనజీవితాలు బాగుండేవి. వాళ్లకింతకడుపు నిండా కూడు దొరుకుతుంది. జబ్బుపడ్డా, ముసలితనం ముంచుకువచ్చినా కనిపెట్టిచూడ్డానికి నా అనేవాళ్ళుంటారు (ఏన్ వెళ్ళిపోతుంది.) మీకు నా మాటలంటే విలువ లేదు. నేను అంటే లక్ష్యంలేదు. అంతేగాదు ......

(నెమ్మదిగా లేచి గుమ్మంఅవతలికి వెళ్లిపోతాడు.)

ఏబీ — నీమాటలన్నీ వింటూనేవున్నానయ్యా బెన్.

బెన్ — లేదు. నువ్వు వినడంలేదు. నాకు తెలుసు నువ్వు యెసంబ్లీకివెళ్లి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనే శవాన్ని పీక్కుతినే తోడేళ్ళతోజారబోతున్నావు. (బయటికి వెళ్ళిపోతాడు.)

ఏబీ — నువ్వేమీ బెంగపెట్టుకోవద్దు. నేను వెళ్లడంలేదు.

(ఏన్ వస్తుంది. కుడివైపు గ్లాసులు తీస్తుంది. చాలామందమతిలా నెమ్మదిగా వుంటుంది. ఏబీ సాకూతంగా ఆమెవంక చూస్తాడు.)

ఏబీ — బౌలింగు మళ్ళీ తిరిగివచ్చి మీకీయవల్సిన డబ్బు యిస్తానని చెప్పివెళ్ళాడు.

ఏన్ — (నిరుత్సాహంగా) సరే మంచిదే! (ట్రేలో గ్లాసులూ, కాళీసీసాపెట్టి తీసుకువెళ్ళబోతుంది. ఏబీ గబుక్కున లేచి నిలబడతాడు.)

ఏబీ — చూడు ఏన్! ఏదీ అవి యిలాయియ్యి. నేను తీసుకు వెళతాను.

ఏన్ — (చిరాగ్గా) వద్దు — అలాగే వుంచండి! నేనే తీసుకు వెళతాను (ఎడంపక్కగా వెళుతుంది.)

ఏబీ — పొరపాటయింది. క్షమించు ఏన్ ......

ఏన్ — (ఆగి) సరే.

ఏబీ — నీతో మాట్లాడాలి. ఆపని అయింతరువాత మళ్ళీ వస్తావుగదూ!

(సేత్ వుత్తరం చదవడం ముగుస్తుంది దానిలో విషయాలవల్ల అతను విచారంగా వుంటాడు.)

ఏన్ — సరే, నువ్వు రమ్మంటే వస్తాను. (ఆమె వెళ్ళి పోతుంది. వంటింటివైపే చూస్తూన్న ఏబీ దగ్గిరికి సేత్ వస్తాడు.)

సేత్ — మేరీలాండులోవున్న మావాళ్ళ దగ్గిరనుంచి వుత్తరం వచ్చింది, ఏబీ. నెబ్రాస్కా రాష్ట్రానికి వలసపోదామని కలిసి కలలుకన్నాం. అదంతా కల్ల అయిపోయింది.

ఏబీ — ఏంజరిగిందసలు, సేత్?

సేత్ — (విచారంగా) చెప్పడానికేముంది. మానాన్నకు చాలా జబ్బుగా వుందట. చాలా ప్రమాదంగా వుందట.

ఏబీ — అయ్యో పాపం!

సేత్ — ఇంటికివచ్చి పొలంపన్లు చూడమని కబురుపెట్టారు. ముప్ఫైఆరు యెకరాల పర్రనేల అది. హాయిగా పడమటికి వెళదామనుకున్నాను. అనుకోకుండా యీ అవస్థ వచ్చిపడింది. నా ఆశలెలావున్నా నాతోపాటు సీకలలు కూడా నాశనమైపోయినందుకు నాకు చాలా బాధగా వుంది, ఏబీ.

ఏబీ — (వంటింటివైపు చూస్తూ) పోనీలే సేత్! దీన్ని గురించి నీవేమీ బెంగపెట్టుకోబోకు. నేనూ కొన్నాళ్ళవరకు యీవూరు వదలదల్చుకోలేదు. మీనాన్న బాగుంటే మళ్ళీ నువ్వు యిక్కడికి రావచ్చు.

సేత్ — ఈ వయసులో యింక బాగయ్యేదేమిటి? మా నాయన జీవితం కూడా అక్కడే అడుగంటిపోతుంది. మరేటియూ నన్ను పిల్చి పిప్పిచేసేవరకూ నా జీవితం అక్కడే తెల్లవారుతుంది. ఊ... సరే ఏడ్చి యేం ప్రయోజనం? వెళ్ళడం తప్పనప్పుడు వెళ్ళితీరాల్సిందే! (ఏన్ తిరిగి వస్తుంది) ఏబీ! వెళ్ళిపోయేముందు మళ్ళీనిన్ను కల్సుకుని వెళతాను. (అతను వెళ్ళిపోతాడు. ఏబీ యిటుతిరిగి ఏన్ వంక చూస్తాడు. ఆమెకూడా అతన్ని చూస్తుంది.)

ఏన్ — ఏబీ! ఏమిటది?

ఏబీ — (నిలబడుతూ) ఏమీలేదు—నువ్వు నాతో యేదో మాట్లాడాలని అనుకున్నావని తోచింది.

ఏన్ — (కోపంగా) దేన్ని గురించి ?

ఏ బీ — న్యూయార్కునుంచి వచ్చిన వుత్తరం సంగతి.

ఏ న్ — నీకా వుత్తరం సంగతి యెలా తెలిసింది ?

ఏ బీ — నేను చేసేది పోష్టుమాస్టరీ, ప్రజల స్వవిషయాల్ని గురించి నాకు తెలియగూడనంత తెలుసు. ఆ దస్తూరీ చూసి అది మేక్ నైల్ వుత్తరమని గ్రహించాను. విచారంగా వున్న నీముఖం చూడగానే నువ్వు వస్తుందనుకున్న చెడువార్త యేదో అందులో రానేవచ్చిందని వూహించాను. (ఏన్ సాశ్చర్యంగా చూస్తుంది. ఆమె అనుకున్న దానికన్న అతనికి సూక్ష్మగ్రాహిత్వం హెచ్చుగావుందని తెలుసుకుంటుంది.)

ఏ న్ — ఏబీ ! వుత్తరంలో యేమున్నా నీకది అనవసరం.

ఏబీ — ఏన్ ! నాకావిషయం తెలుసు. నువ్వు బాధపడి ఏడుస్తున్నందుకు నాహృదయం తరుక్కుపోతూంది. ఈవూళ్లో అడుగు పెట్టినదగ్గిరనుంచీ నిన్ను గురించే యెప్పుడూ ఆలోచిస్తూన్నాను. ఈవిషయం నీకిప్పుడు చెప్పివుండకపోదును కాని విచారంగా వున్నప్పుడు మనసాద యెవరిముందైనా వెళ్ళబోసుకోవాలని వుంటుంది. దైవసాక్షిగా చెప్తున్నాను. నీబాధ అంతా కాకపోయినా కొంతైనా పంచుకుని అనుభవించాలని వుంది. (ఆమె ముఖం కొంచెం వికసిస్తుంది. పెదాలమీదికి చిరునవ్వు వస్తుంది.)

ఏ న్ — ఏబీలింకను, నీది వుదారహృదయం. (కూచుంటుంది)

ఏ బీ — కాదు. నేను సామాన్యుల్లో సామాన్యుణ్ణి. కాలు వొకచోటకూడా నిలవదు. స్థిరత్వం తక్కువ.

ఏన్ — (నవ్వుతూ) కాలు అదే నిలుస్తుంది. రా. యిలా వచ్చి కూచో.

ఏబీ — ఆనందంగా వచ్చి కూచుంటాను. (ఆమెవైపు నడిచి వెళ్ళి కూచుంటాడు.)

ఏన్ — ఏదో వొక కబురు చెప్పి యెప్పుడూ నవ్విస్తుంటావు గదూ?

ఏబీ — నాఅవతారం చూస్తేనే నవ్వువస్తుంటే యింక వాగడ మెందుకు?

ఏన్ — ఏబీ! నువ్వు వూహించిన విషయంనిజం.

కుటుంబ పరిస్థితులవల్ల యింతవరకూ యిక్కడకు రాలేక పోయాడట. మళ్లీ యెప్పుడు వచ్చేదీకూడా చెప్పలేదట. ఇన్ని నెల్లకీ విషయం చెప్పడానికి వుత్తరం రాశాడు. దీన్ని బట్టి మళ్లాముఖం చూపించననేగదూ?

ఏబీ — ఏన్, అలాఅనను నేనైతే!

ఏన్ — నేనలానే అంటాను (అతనివంక చూస్తుంది.) మేక్ నెయిల్ వంటి పనికిమాలిన వాడికి మనసులో చోటిచ్చానని, అమాయకు రాలిననీ మనసులో అనుకుంటున్నావు కదూ?

ఏబీ — నేనలా యేమీ వూహించుకోవడం లేదు. అతను పేరెందుకు మార్చుకున్నా అవిమంచి కారణాలే అయి వుంటాయని అనుకుంటున్నాను. అతనంటే నాకు యిష్టం. ఇంకా ప్రేమిస్తున్నానుకూడా. మంచి అందగాడు. స్ఫుర ద్రూపి. అతన్ని యేపిల్ల ప్రేమించినా, తప్పు ఆపిల్లది మాత్రంకాదు.

ఏన్ — (కొంచెం తీవ్రంగా) అతన్ని నేనెన్నడూ ప్రేమించ లేదని అనుకుంటున్నాను. ఇంత విశ్వాసఘాతకుల్ని నేను ప్రేమించలేను.

ఏబీ — (బాధగాలేనట్లు కనబడ్డానికి ప్రయత్నిస్తాడు) సరే! ఇందులో యిప్పుడు విచారించడానికేముంది. పాపం! సేత్ గేల్‌కి చాలా చెడ్డవార్త వచ్చింది. వాళ్ల తండ్రికి చాలా జబ్బుగా వుందట. అందుకని పడమటికి వెళ్లాలనే తన చిర కాల వాంఛకి నీళ్లు వదులుకోక తప్పలేదు.

ఏన్ — (అతనివంక చూస్తూంది.) ఏబీ? నీకు ఆడవాళ్లని గురించేమీ తెలియదని నాఅభిప్రాయం.

ఏబీ — వాళ్లనిగురించి నేనూ తరుచూ ఆలోచించినా, బహుశా వాళ్లనిగురించి నాకంతగా తెలియకపోవచ్చు.

ఏన్ — నువ్వు ధైర్యశాలివి. ఎవరినైనా అవలీలగా జయిస్తావు. అందుకని నీకు అబలల బాధా భావాలూ అర్థంకావు. నేను ఆడదాన్ని. అందుకని వూరంతా నన్నుగురించేమని గుసగుసలాడుతారోయని ఆలోచించకుండా వుండలేను. అతను నన్ను వదిలేసాడంటారు. నేను పరిచ్యుతననీ నా ముందు జాలిపడినా, నావీపుతిరగ్గానే వేళాకోళం చేస్తారు ప్రజలు. (లేచి కుడివైపుకు వెళుతుంది.)

ఏబీ — అవును! వాళ్లు అలానే ప్రవర్తిస్తారు. కాని అటువంటి వాళ్ల మాటల్ని నువ్వు లక్ష్యంచేస్తావా?

ఏన్ — (లేచి) కేవలం యిదివొక హృదయ దౌర్బల్యం, లోపం. నీలాటివాళ్ల కర్థంకాని దిది ఏబీ. (కిటికీదగ్గిరికి వెళ్ళి బయటికి చూస్తూవుంటుంది. ఏబీ తనకుర్చీలోంచి పక్కకి తిరిగి ఏన్‌ను చూడ్డానికి ప్రయత్నం చేస్తాడు.)

ఎబీ — ఏన్! నీ భావాలు నా కర్థం కాకపోవచ్చును. నాకూ నీలాగానే హృదయ దౌర్బల్యం లేకపోలేదు. జోష్పీడు కూడా అలానే అన్నాడు. అతను చెప్పింది నిజం. ఇన్నాళ్లూ నా మనసులోని విషయాన్ని నీకు పైకిచెప్పలేకపోవడం హృదయదౌర్బల్యం కాకపోతే మరేమిటి (ఆమె వెనక్కి తిరిగి అతనివైపు ఆశ్చర్యంగా చూస్తుంది.) నీలాగే నేనుకూడా అపజయాన్ని అంగీకరించలేను. నేనెలా వుంటానో నాకు తెలుసు, నా పరిస్థితులెలాంటివో కూడా యెరుగుదును. నేను మనసారా ప్రేమించే కన్యకేమీ ఈయలేనిస్థితిలో వున్నాననీ తెలుసు.

ఏన్ — ఎబీ! నువ్వు నన్ను ప్రేమిస్తున్నానని అంటున్నావా?

ఎబీ — మనస్ఫూర్తిగా! అవును. అదే చెప్పబోతున్నాను. (లేచి ఆమె కెదురుగా నిలబడతాడు. ఆమె అతని కళ్లల్లోకి చూస్తుంది.) నా మనస్ఫూర్తిగా నిన్ను యెంత కాలంనుంచో ప్రేమిస్తున్నాను ఏన్. నువ్వు చాలామంచి దానివి. నీ మంచితనానికి తోడు తెలివీ, ధైర్యం, సహనం కూడా వున్నాయి. వీటినే నేను యెక్కువగాకోరేది. చక్కని చుక్కవి. అందుకని నీనంటే సహజంగానే నాకు సదభిప్రాయంకలిగింది. ఏన్! ఈ విషయాలన్నీ చెప్పి నిన్ను బాధించను. ఇవన్నీ యెందుకు చెప్పానంటే కొన్నాళ్ళపాటు నువ్వు నాతో స్నేహంగా వుంటే యీ అమ్మలక్కల నోళ్ళన్నీ నొక్కుకుపోతాయి. 'మేక్ నమర్' న్ని నాబోటిగాడికోసం వదిలేశావని వూరు కుంటారు.

ఏ.న్ — ( అతనిదగ్గిరికి వెళ్ళి ) ఏబీ! నిన్ను అర్థంచేసుకున్నా ననుకున్నాను. కాని నాకేమీ తెలియదని యిప్పుడే గ్రహించాను.

ఏబీ — ( విచారంగా ) అలా యెందుకంటున్నావు ? యిలా మాట్లాడుతున్నానని తీసుకోకూడనిచనువు తీసుకుంటున్నానని అనుకుంటున్నావా ?

ఏన్ — ( బాధగా ) లేదు ఏబీ! నేను నిన్నుగురించి ఆలోచించాను. నేనెరిగిన ఏబీగా కాని యెప్పుడూ మన మధ్య యీసంబంధాన్నిగురించి ఆలోచనే రాలేదు. నేను యెరగని అపరిచితవ్యక్తిని మొదటిసారిగా చూసినట్టుంది.

ఏబీ — ( మెల్లిగా ) నన్ను నీవు ప్రేమించాలని నేను అనడం లేదు. కలలోకూడా అటువంటిది సంభవిస్తుందని అనుకోను.

ఏన్ — ఏబీ ! నాకది తెలుసు. నీకున్నదంతా యితరులకు దానంచేసీకూడా వారినించి రవ్వంతైనా ప్రతిఫలంకోరవని యెరుగుదును. ఎందరో మగవాళ్లని యెరుగుదును. కాని నీలోనే యీ ప్రత్యేకతవుంది. నీ కిప్పుడు నిజంగా చెప్తున్నాను. నీలాటివాణ్ణిప్రేమించగల్గితే ఆనందిస్తాను. ఇంతమంచిహృదయంగలవాణ్ణి ప్రేమిస్తున్నందుకు నా అదృష్టాన్ని నేను మెచ్చుకుంటాను. కొంచెం వ్యవధిమాత్రం యియ్యి. ఈవిషయాన్నిగురించి ఆలోచించుకుంటాను.

ఏబీ — (తనకళ్ళని తనే నమ్మలేకపోతాడు.) వ్యవధియిస్తే తిరిగి నన్ను ప్రేమించడానికి ప్రయత్నిస్తావా ? నిజంగానా ?

ఏన్ — (జాలిగా) నేనేమీచెప్పలేను ఏబీ! (అతనిచొక్కా పట్టుకుంటుంది.) ప్రేమించడమేకాక, ప్రేమింపజేసుకుని,

యిరువురి జీవితాల్నీ ఆనందమయం చేయగలశక్తి నీలోవుం
దని నాకు తెలియదు ఏబీ. (ఏబీ ఆమెచేతిని తన చేతిలోకి
తీసుకుంటాడు.)

ఏబీ — ఈ దేశంలో ప్రతీవ్యక్తికీ వొకవిధమైన అవకాశం
వుందని పెద్దలు చెప్పేమాటలు నమ్మడానికెంతో ప్రయ
త్నిస్తున్నాను ఏన్. భగవంతుడు మానవుణ్ణి తన ప్రతి
రూపంగా సృష్టించాడనే విషయం యెంత సత్యదూరంగా
కనబడుతూవుందో యిదీ అలాగే కనబడుతుంది. ఏన్!
నేనే నిన్ను పొందగలిగితే నాకళ్ళతో చూచేవన్నీ అస
త్యాలనీ, నేను చదివిన కావ్యాల్లోని మధురభావాలన్నీ
మాత్రమే సత్యమనీ విశ్వసిస్తాను. (ఇద్దరూ వొకనిముషం
నిశబ్దంగా వుంటారు. ఏన్ పక్కగా తిరుగుతుంది.)
ప్రస్తుతం నిన్ను మాట ఈయమని నిర్బంధించను. నిన్ను
పోషించేశక్తి సంపాయించేవరకూ నీ హస్తాన్ని కోరనని
మాట యిస్తున్నాను. (త్వరగా అడుగులు వేసుకుంటూ
పోస్టుబేగ్ పుచ్చుకుని గుమ్మంవైపు వెళ్ళిపోతాడు.)

ఏన్ — ఎక్కడికి వెళ్ళిపోతున్నావు, ఏబీ. !

ఏబీ — బౌలింగుకు వొకచల్లని హాస్యపుకబురుచెప్పి నవ్వించి
వస్తాను. (నవ్వుతూ గుమ్మంలో నిలబడతాడు.)

ఏన్ — వేళాకోళపుకబురా, దేన్నిగురించి?

ఏబీ — ఇలినోయిస్ రాష్ట్రఎసంబ్లీకి నేను ఎన్నికల్లో నిలబడ
దల్చుకున్నానని చెప్పివస్తాను. (వెళ్ళిపోతాడు.)

రెండవరంగం సమాప్తం.

---

## మూడవ రంగం

(న్యూసేలంలో బౌలింగు గ్రీన్ ఇంట్లో చిన్నగది. గోడలు నిండా పుస్తకాల రాక్‌లూ, తాతముత్తాతల ఫొటోలూ వున్నాయి. గది మధ్య బల్లమీద దీపం వెలుగుతూ వుంటుంది. కుడివైపు బీరువా మీద గాజుకుప్పెలో కొవ్వొత్తి వెలుగుతూ వుంటుంది. టేబులుకి ఇటూ, అటూ కుర్చీ లుంటాయి. ఎడంపక్క సోఫా వుంది.

ఎడంవైపు వెనుకభాగంలో ఇంటి సింహద్వారం కనబడుతుంది. గుమ్మంపక్కని గోడకి తుపాకీ వేలాడుతూ వుంటుంది. కుడివైపు గోడకి గుమ్మం ఉంటుంది. కుడివైపు గోడకే నిచ్చెన వేసివుంది. దానిమీద ఎక్కి మిద్దెమీదకి వెళ్ళడానికి దారి కనిపిస్తుంది.

రెండవరంగం అయిన సంవత్సరానికి సాయంకాలం వేళ. బాగా పొద్దుపోయింది. బైట తుఫాను చెలరేగుతున్న శబ్దం. బౌలింగు ప్రకటనపత్రం చూచి గట్టిగా చదువుతూ వుంటాడు. ఆతని భార్య నాన్సీ సుఖంగా కూర్చుని కుట్టుకుంటూ భర్త చదివే దాన్ని వింటూ వుంటుంది.)

బౌలి — "విన్‌డ్సర్ కుర్చీలో చిన్న పర్వతంలా కూర్చుని మెల్లిగా చైతన్యం పొంది, 'పిక్ విక్' తను ఆరంభించిన క్లబ్బునుగురించి మెల్లిగా మాట్లాడుతున్నాడు" (బౌలింగు ముసిముసినవ్వులు నవ్వుతాడు. నాన్సీ విరగబడినవ్వుతుంది.)

నాన్సీ — అచ్చంగా నీలాగనే మాట్లాడుతున్నాడు. (తలుపు తట్టిన శబ్దం. భయంగా) ఏబీ చేసే చప్పుడులా లేదు. ఇంకెవరైనా వుంటారు?

బౌలి — (నిలబడి) ఎవరో ఎలా తెలుస్తుంది?

నాన్సీ — ఇంత రాత్రివేళ ఎవరైనా కావచ్చు. ఎందుకన్నా

మంచిది. ముందు తుపాకి సిద్ధంచేసి తలుపు తియ్యండి.
(బాలింగు తలుపు తీస్తాడు. జోష్‌స్పీడ్ లోపలికి వస్తాడు.)

బాలి — స్పీడ్! నువ్వా?

జోష్ — బాగున్నారా?

బాలి — ఎన్నాళ్ళకి కనిపించావు.

నాన్సీ — ఎల్లావున్నారు, మిస్టర్ స్పీడ్!

జోష్ — ఇంతరాత్రివేళ వచ్చినందుకు ఏమీ అనుకోకమ్మా!

నాన్సీ — మీరు రావటం మాకు చాలా సంతోషంగావుంది. ముందు తడిసిపోయిన కోటుతియ్యండి.

జోష్ — అలాగేనమ్మా! ఏబీలింకను ఇక్కడికివచ్చాడని తెలిసి అతనికోసం స్ప్రింగుఫీల్డునుంచి వస్తున్నాను. మీ ఇంట్లో దొరుకుతాడని నాకు తెలుసు.

బాలి — అడుగో, ఆ పైమిద్దెమీదే పడుకుంటున్నాడు.

నాన్సీ — రట్లెడ్జి ఇంటిపిల్ల ఏన్‌కి జబ్బుగావుందని చూడ్డానికి వెళ్ళాడు.

జోష్ — రట్లెడ్జి కూతురు ఏన్‌కి ఎప్పణ్ణుంచి జబ్బు? ఏం జబ్బు?

నాన్సీ — ఏదో సంధిజ్వరం వచ్చిందట. చాలాపాడురోగం అది. అదివస్తే మళ్ళీబతకడం వట్టిదట.

బాలి — ఏన్ మంచి బలమైనపిల్ల. ఎలాగయినా రోగంతో కుస్తీపట్టిబతికి బైటపడుతుంది. ఫరవాలేదు. జోష్! కూర్చో.

జోష్ — కూచుంటాను. (కూర్చుంటాడు. బాలింగ్ చేతిలో వున్న కాగితాన్ని పుస్తకంమీదపెట్టి అక్కడే నిలబడి చుట్ట అంటిస్తాడు.)

నాన్సీ — ఏన్‌కి జబ్బుచేసిందని కబురు తెలియగానే వెండా

లియానుంచి ఏబీ పరుగెత్తుకుంటూవచ్చి వాలాడు. ఆ పిల్లని చాలాఇదిగా ప్రేమిస్తున్నాడు.

జాలి — చూడు, నాన్సీ! నువ్వు మరీ వర్ణించి చెపుతావు.

( ఈ మాటలు అన్నీ జోష్ ఆత్రంగా వింటాడు. )

జోష్ — అయితే ఏబీ ఆ అమ్మాయిని వెర్రిగా ప్రేమిస్తున్నాడన్నమాట. యీమధ్య అతని వెర్రివాలకంచూసి ఏదో వూహించాను.

నాన్సీ — అతడిమొహం చూస్తేనే తెలిసిపోతుందండీ.

జోష్ — కిందటిసారి అతణ్ణి నేను చూసినప్పుడు చాలా మౌనంగా కనబడ్డాడు. అలావున్నావేమని అడిగితే ఒంట్లో బాగాలేదనన్నాడు.

జాలి — (నవ్వుతూ) అవునవును. చక్కగానే చెప్పాడు. అసెంబ్లీలో బాగా వున్నాడా?

జోష్ — అక్కడ కొంచెంకూడా వుత్సాహం చూపించడం లేదట. అక్కడ తనకి కానట్టు మాట్లాడకుండా కూచుంటాడట. రోజుకు మూడు డాలర్లు మాత్రం పుచ్చుకుంటున్నాడట. ఆపిల్ల ఏన్ కూడా ఇతన్ని ప్రేమిస్తోందా?

నాన్సీ — ఇంకా సందేహం ఎందుకు? ఏబి కోసమేగా మేక్ నైల్ ను వదిలేసింది.

జోష్ — ఆపిల్లని పెళ్ళిచేసుకోవాలని అనుకుంటున్నాడా?

నాన్సీ — ప్రస్తుతం అతనికివున్న కోర్కెఅల్లా ఆపిల్లని పెళ్ళిచేసుకోవాలనే. ఎంత త్వరగా పెళ్ళిచేసుకుంటే అంత మంచిది ఇద్దరికీని.

జా లి – (కూచుంటూ) పెళ్ళి కావడం ఆ పిల్లకి మంచిది అయినా ఇతని భావికి మాత్రం మంచిది కాదు.

నా న్సీ – (కుట్టు ఆపుచేస్తూ) ఎందుకని మంచిదికాదు? రట్లెడ్జి కుటుంబం చాలా మర్యాద అయినది. వూరూ పేరూలేని హేంక్సు, లింకన్సు కుటుంబాలకన్నా అన్ని విధాలా వుత్తములే వాళ్ళు.

జా లి – జోష్! నువ్వు నాఅభిప్రాయంతో ఏకీభవిస్తావా? ఏన్ ఎంతమంచిదైనా, ఎంత అందగత్తె అయినా, పేరు బడ్డ ఇంట్లోంచి వచ్చినా ఏబీకి ఆమెవల్ల నష్టమేకాని లాభంలేదు. ఏబీ మార్గం ఇదికాదు.

జో ష్ – పాపం; సంతోషం అంటే ఎరగని అతనికి యీపిల్ల వల్ల అయినా రవ్వంత ఆనందం కలిగితే బాగుండును.

నా న్సీ – (లేచి నిలబడుతుంది) నేనూ అలానే అనుకుంటున్నాను. మీఅందరికీ వున్నంత అభిమానమే ఏబీమీద నాకూవుంది. కాని మీ రొక్క విషయం మాత్రం మరిచిపోవద్దు. అతడు ముందునించీ బీదవాడు. వర్తకంతో దివాలా తీసాడు. పైగా సంవత్సరంనించి అసంబ్లీలో వుంటూ ఏఒక్కపనీ సాధించలేకపోయాడు. (తన కుట్టు సామగ్రిని అంతా పుస్తకాలదగ్గిర పెట్టడానికి వెళుతుంది)

జా లి – స్ప్రింగుఫీల్డు వెళ్ళిపోయి మళ్ళీ ప్లీడరీయే చేసుకోడం మంచిదనుకుంటాను, నినియన్ ఎడ్వర్డ్సు దీనికి సహాయం చేస్తాడు. అలా అయితే త్వరలోనే ఏన్‌ను మరిచిపోవచ్చు. ప్రపంచంలో లభ్యంకాని అలౌకికప్రేమ నేదో ఆమెనించి

పొందాలని ఆరాటపడుతున్నాడు. పెళ్ళిచేసుకుంటే శాంతి కల్యాణం అతన్ని వేధిస్తుంది.

నాన్సీ — (కూచుంటూ) ప్లీజ్! మీరూ ఆయన మాటలతో ఏకీభవిస్తారా?

జోష్ — (విచారంగా) నేనేం చెప్పలేనమ్మా. ఏబీలింకన్ భవిష్యత్తునుగురించి కలలుకనడం ఏనాడో మానుకున్నాను. నేను మొదటిసారిగా అతన్ని టాలిస్‌మన్ అనే ఓడలో చుక్కానిగా చూసాను. బహుశా మీకూ జ్ఞాపకం వుండేవుంటుంది. ఆరోజుల్లో డామ్‌వద్ద యీవోడ చిక్కుల్లో పడింది. మానాన్నగారి వ్యాపారానికి కావలసిన సరుకులు ఎన్నో అందులో వుండిపోయాయి. ఓడతోపాటు సరుకులన్నీ నాశనమైపోతాయనుకున్నాము. చిత్రం! ఏబీ ఎలాగో దాన్ని ఆపదనించి కాపాడేడు. ఇది మాటలతో పనా? అప్పుడు ఏబీ నమ్మదగిన వ్యక్తి అనీ, గొప్ప భవిష్యత్తు వుందనీ అనుకున్నాను. నా మూఢత్వంలో అతనితో స్నేహంచేసి అతనికిచేయూతనిస్తే చాలా గొప్పవాడవుతాడని ఆశించాను. కాని, నానమ్మకం నాశనం అయిపోవడానికి ఆట్టేకాలం పట్టలా. శారీరకంగా అతడు బలాఢ్యుడు; ధైర్యశాలి. కాని, మానసికంగా దుర్బలుడు. పగలంతా కాయకష్టంచేసి పొలందున్నడం దగ్గిరనించి పుల్లలు కొట్టడం వరకూ చేయగలడు. వేళాకోళంగా కబుర్లు చెప్పి నవ్వించగలడు. రాత్రిఅంతా 'హామ్‌లెట్' అనే విషాదాంతనాటకం చదువుతూ తానే ఆ రాజకుమారుణ్ణని ఊహించుకుని దుఃఖసముద్రంలో మునిగిపోనూ

గలదు. విచిత్రవ్యక్తి. ఇతడు గొప్ప వేదాంతి అయినా కావాలి. లేదా వట్టి వెర్రిబాగులవాడయినా కావచ్చు. యీ రెంటిలో ఏదో మాత్రం నేను చెప్పలేను.

జాలి — ( నవ్వుతూ ) జోష్! ఏబీలో నీకు కనిపించే గుణగణాలన్నీ ఏన్‌కిగాని కనిపించివుంటే ఒక్కదెబ్బని హడిలిపోయి న్యూయార్కులోవున్న మెక్‌నీల్ దగ్గరకువెళ్ళి పెళ్ళి చేసుకోమని కోరివుండేది. మెక్‌నీల్ ఏబీ అంత విచిత్ర వ్యక్తి మాత్రం కాదు.

నాన్సీ — ( భావోద్వేగంతో ) మీ అందరికీ ఏబీలింకన్ పుస్తకాల్లోని విషమసమస్యలా, విడదీయడానికి వీల్లేని క్లిష్టగణితంలా కనపడుతున్నాడా? సమస్యగా పరిష్కరించడానికి మీకు సరదాగావున్నా, విచారంలో మునిగి తేలుతున్న మానవుడని గుర్తుంచుకోండి. ఎవరేనా అతని హృదయబాధని చల్లార్చడానికి ప్రయత్నిస్తున్నారా? అతని వేళాకోళపు కబుర్లని చూసి హాయిగా ఆనందంగా నవ్వుతారు. ఎలక్షనునాడు మాత్రం ఓట్లు వేస్తారు. తినడానికి ఇంత తిండీ, తలదాచుకోడానికి ఇంత నీడా చూపిస్తారు. అతను కోరేవి యివేవీ కావు. అతను కాంక్షించేది శాంతీ, తృప్తి. జీవితంలో అతనితోపాటు కష్టనిష్ఠూరాల్ని అనుభవిస్తూ, అతన్ని ఆదరించి ఆదుకునే స్త్రీని అతను కోరేది.

జాలి — అయితే జీవితాన్ని ఎదుర్కోడానికే భయపడుతున్నాడనా నీవుద్దేశ్యం?

నాన్సీ — ( నిలబడి ) అవును. అదే నిజం. అహర్నిశలూ

అతణ్ణి చిన్ననాటినించీ ఒంటరితనం బాధిస్తూనేవుంది ఏవో అవ్యక్త అనురాగ ఆలాపాలు అతనిచెవుల్లో గింగురు మంటూ వుంటాయి. చిన్ననాడు అతను పెరిగిన వన్య ప్రాంతాల్లో వాళ్ళ అమ్మా అమ్మమ్మల మాటలేఅవి అని అతని నమ్మకం. యీ అవ్యక్తమయిన మాటలు తనని ముందుకు వెళ్ళమని ఆదేసిస్తున్నాయో, ఆగమని ఆజ్ఞే పిస్తున్నాయో అర్థంకాక బాధపడుతున్నాడతను. మీరు ఎన్నిచెప్పండి అతనికి మనోధైర్యం రాదు. హృదయ పూర్వకంగా అతన్ని ప్రేమించి విశ్వసించి అతనిలో అత నికే నమ్మకం కలిగించే స్త్రీవల్లే అతడు ఆత్మవిశ్వాసం కలవాడవుతాడు. ( తలుపుతట్టిన శబ్దం )

బాలి — అదుగో ఏబీ ( వెళ్ళి తలుపుతీస్తాడు. తలమీద ఏమీ వుండదు. శుభ్రంగా తడిసిపోయి వుంటాడు. ఇదివరకు కన్నా వయసు ముదిరినట్లూ, కొంచెం కఠినత్వం వచ్చి నట్టూ వుంటాడు. ) ఏబీ ! ఇదేమిటి. నీకోసమే మేమంతా యెదురుచూస్తూ వున్నాము. తడుస్తున్నావు. యివతలికి రా! ( ఏబీ లోపలికి వస్తాడు. బాలింగు తలుపు వేసేస్తాడు. )

నాన్సీ — మేమిద్దరం పిక్ విక్ క్లబ్బునుగురించి చదువుతూ వున్నాం స్పీడు వచ్చారు.

ఏబీ — జోష్ ! యెప్పుడువచ్చావు. నిన్ను చూడ్డం చాలా సంతోషంగా వుంది.

జోష్ — బాగున్నావా ఏబీ ? (ఏబీ నాన్సీవైపు తిరుగుతాడు)

ఏబీ — నాన్సీ !

నాన్సీ — ఏమైంది ఏబీ ?

ఏబీ — ఆమె యిక లేదు!

బాలి — ఏన్ పోయిందా?

ఏబీ — అవును. రాత్రి జ్వరం హెచ్చిపోయింది. ఎవరూ యేమీ చేయలేకపోయారు. (నాన్సీ బాలింగువంక చురుగ్గా చూస్తుంది. బాలింగు వెళ్ళి ఏబీ చెయ్యి తనచేతిలోకి తీసుకుంటాడు.)

నాన్సీ — ఏబీ! చాలా విచారంగావుంది. మంచిపిల్ల. ఈసంగతి తెలిస్తే ఆమెనెరిగినవాళ్ళందరూ బాధపడతారు.

ఏబీ — కావచ్చు. దానివల్ల కలిగే లాభమేమిటి? ఆమె పోనేపోయింది.

బాలి — ఏబీ, కొంచెం కూచో.

ఏబీ — నేను మీ అందరిదగ్గరా కూచోడానికి నోచుకోలేదు. నన్ను వెళ్ళనియ్యండి. (గుమ్మంవైపు వెళతాడు.)

జోష్ — (ఆపి) ఏబీ! ఏమిటీ పిచ్చిపని? ఎక్కడికి వెళతావు. నువ్విక్కడే వుండాలి.

బాలి — ఏబీ! జోష్‌మాట మన్నించు.

నాన్సీ — ఏబీ! రా. ఇలావచ్చి కూచో. (ఏబీ అందరిముఖాలూ చూసి మారుమాటాడకుండా వెళ్ళి కుర్చీలో కూర్చుంటాడు.) మేడమీాద నీకు పక్కవేసి వుంచాను. వెళ్ళి కొంచెం పడుకో, ఏబీ!

ఏబీ — (నిర్జీవంగా) నాకీ ప్రపంచంలో మిగిలినవాళ్ళు మీరు మాత్రమేను. మీ ప్రేమకు ప్రతిఫలం అర్ధరాత్రివచ్చి చావుకబురు చెప్పడమైంది.

బాలి — ఏబీ! యిది నీయిల్లు. మేం నీవాళ్ళం.

ఏబీ — మీరు చెప్పేది నిజమే. నాన్సీ, బౌలింగు - మీాకు నేను చాలా ఋణపడి వున్నాను. ప్రపంచంలో దేన్నీ ప్రేమించనంతగా ఆమెని ప్రేమించాను.

నాన్సీ — ఏబీ ! నాకు తెలుసునయ్యా.

ఏబీ — ఒంటరితనమే మంచిదని నాఅభిప్రాయం. ఒంటరిగా వున్నప్పుడే నాకు ఆనందం తృప్తీ. మరీ సన్నిహితంగా వుంటే మానవుల్లోని లోపాలు భరించలేనివిగా కనబడతా యని భయపడేవాణ్ణి. వ్యక్తులు వేరైనా మానవు లంతా వొకటేననీ, అందరూ అమాయకులూ వెర్రి బాగులవాళ్ళనీ నానమ్మకం. నన్ను గురించే వాళ్ళు అలానే అనుకుంటారని నమ్ముతున్నాను. ప్రశాంతనిశీధిలోని ఆకా శానికున్న ప్రవిమల ప్రశాంతసౌందర్యం మానవహృద యాల్లోకూడా వుంటుందని ఆమెని చూసిం తరువాత నమ్మాను. ఆమె మృదుల హస్తాన్ని నాహస్తం లోకి తీసుకుంటే నాహృదయంలో చెలరేగే భయసందేహాలు పటాపంచలై పోయేవి. నేను భగవంతుణ్ణి నమ్మాను. కష్ట పడి ఆర్జించి ఆమె కోర్కెలన్నీ ఆజ్ఞలగా పాలించి తీర్చా లని ఆశించాను. ఆమెకు నాలో విశ్వాసం వున్నంత కాలం ఆమె యేం చేయమన్నా ధైర్యంగా చేయగల్గి వుండేవాణ్ణి. ఆమె నాలో అటువంటి ఆత్మవిశ్వాసం కలి గించింది. సుడిగుండంలో కొట్టుకుపోయే ఎండుటాకువలే పోతున్నా ఆమె ప్రాణాన్ని ఆపుజేయలేక నిస్సహాయుణ్ణిగా వుండిపోయాను. చూస్తూండగానే పంజరంలోంచి చిలక

యెగిరిపోయింది. ఆమె తల్లితండ్రీ అక్కడే ప్రార్థనచేస్తూ వుండిపోయారు. "ప్రభూ! నీచేతులతో ప్రసాదించినదాన్ని, నీ హస్తాలతోనే తిరిగి గైకొన్నావని " వాళ్లు ప్రార్థన చేస్తూంటే, వాళ్లతో నాకంఠం కలపలేక పోయాను. నాశనం చేసే వుగ్రశక్తికల దైవాన్ని నేను కొలవలేను. (లేచినిలబడి ఆవేశంతో మాట్లాడుతాడు.) నావిచారంలో యేమేమో మాట్లాడుతున్నాను. క్షమించండి. ఈ బాధ భరించడం నావశంలోలేదు. ఒంటరిగా బతకలేను. ఆమెతో పాటు నేనూ పోతాను. నాకు పిచ్చిఎక్కి తీరుతుంది. (వెళ్లి తలుపు తీస్తాడు. బయట తుఫానుగాలి చెలరేగుతుంది.) ఈ గాఢాంధకారంలో ఆమె వొంటరిగా బయట వుండడం నేను భరించలేను.

(నాన్సీ బాలింగువంక విచారంగా చూస్తుంది. అతను గుమ్మం దగ్గిరగావున్న ఏబీ దగ్గిరగా వెళ్లి లాలనగా.)

బాలి — ఏబీ! నామాటవిను. పైకివెళ్ళి కొంచెంసేపు కునుకు తీయడానికి ప్రయత్నం చెయ్యి. నీకోసం కాకపోయినా, నాన్సీకోసం, నాకోసమైనా వెళ్ళు.

ఏబీ — (క్షణం ఆగి) మీయిష్టం (పైకి వెళ్ళడానికి నిచ్చెన యెక్కుతాడు.)

నాన్సీ — అయ్యో, పిచ్చివాడా! దీపం ఇదిగో (అతనికి కొవ్వువత్తి అందిస్తుంది.)

ఏబీ — నాన్సీ! దయవుంచు (నిచ్చెనమీద పైకి వెళ్ళిపోతాడు)

(అందరూ అతనివంకే చూస్తూంటారు.)

నాన్సీ — (కన్నీళ్ళు వొత్తుకుంటూ) పాపం ఒంటరిబతుకు!

(బాలింగు ఆమెని మాట్లాడవద్దని సౌంజ్ఞ చేస్తాడు.)

జోష్ — అమ్మా! ఇతన్ని ఒంటరిగా వుండనివ్వక మీ దగ్గిరే వుంచుకోండి.

బాలి — అలాగే జోష్.

జోష్ — వెళ్ళిరానా, శెలవు. (టోపీ, కోటు తీసుకుని వెళ్ళిపోతాడు.)

బాలి — వుంటాను జోష్. (తలుపు గడియపెట్టుకుని టేబిల్ దగ్గరగా వచ్చి దీపం చేత్తో పట్టుకుంటాడు.)

(నాన్సీ మిద్దెవంక చూచి నిట్టూర్చి కుడివైపు వెళుతుంది. ఆమె వెనకనే బాలింగు దీపం తీసుకువెళతాడు. స్టేజిమీదంతా చీకటి. మిద్దెమీద దీపం మాత్రం మినుకు మినుకు మంటుంది.)

ప్రథమాంకం సమాప్తం.

---

# ద్వి తీ యాం క ం

## నా ల్గ వ ర ం గ ం

ఇలినాయిస్ రాష్ట్రంలో స్ప్రింగ్‌ఫీల్డు గ్రామం. లింకన్, స్టూవర్టుల ఆఫీసు. కోర్టులో రెండవఅంతస్తు. వేసవికాలం. మధ్యాహ్నపువేళ. మూడవరంగం గడిచిన ఐదు సంవత్సరాలకి.

చిన్నగది. రెండు కిటికీలు, ఒకగుమ్మం లోపలిహాలులోకి, మెట్ల దగ్గిరికీవెళ్ళేమార్గంలా స్టేజీమీదకు కనబడతాయి.

కుడివైపు టేబిలూ కుర్చీ, ఎడంవైపు పాతడెస్కూ—దానినిండా చిందరవందరగా పత్రికలూ పడి వుంటాయి. వెనకభాగంలో వొక కుక్కి మంచం వుంటుంది. కిటికీలకిందవున్న చిన్నబీరువాల్లో పాత బడిన లాపుస్తకాలు వుంటాయి. ఒకమూలగా పాత స్టౌ వుంటుంది.

డెస్కుదగ్గిరే గోడమీద 26 నక్షత్రాలతో వున్న అమెరికన్ జండా వుంటుంది. రెండుకిటికీలమధ్యా ఎలక్షనుపోస్టర్లు, హారిసన్, టైలర్ల పార్టీకోసం నిలబడి అభ్యర్థులపేర్లు అంటించబడి వుంటాయి. అందులో 'ఏబీ లింకన్' పేరు కూడా వుంటుంది.

బిల్లీ హారెన్‌డన్ టేబిల్ దగ్గిర రాసుకుంటూ వుంటాడు. పొట్టి, గంభీరమైన యువకుడు. అప్పుడే లోపల అడుగు పెడుతున్న ఏబీని చూస్తూంటాడు. పాతగిల్లిన టోపీ, అల్పాకా కోటూ వేసుకుని, చేతిలో చినిగిపోయిన సంచితో ప్రవేశిస్తాడు. గంభీరంగా వుంటాడు. నోరు మెదపకూడదన్నట్టు ముఖంలో ప్రస్ఫుట మౌతూంటుంది. బూట్లనిండా బురద వుంటుంది. వయసు ముప్ఫై అయినా, ఏన్ రట్లెడ్జితోపాటు యౌవన రేఖలు భూస్థాపితం అయిపోయినాయి. ఏబీ ఆఫీసు తలుపు తెరిచి ఉంచుతాడు. దానిమీద "నెం. 4, స్ట్యూఅర్టు అండ్ లింకన్, న్యాయవాదులు" అని ఉంటుంది.

బిల్లీ — లింకన్‌గారూ! తిరిగివచ్చారా? క్షేమమా?

ఏబీ — బిల్లీ! కులాసేయేనా? (చేతిలోని సంచి బల్లపైన వుంచుతాడు. టోపీకూడాతీసి దానిప్రక్కనే పెడతాడు.)

బిల్లీ — లింకన్‌గారూ! మీ ప్రయాణం యెలా గడిచింది?

ఏబీ — మామూలుగా యిదివరకులానే వుంది.

బిల్లీ — మీ రారోగ్యంగా వుంటున్నారా?

ఏబీ — ఏదోవుంది షుమారుగా! కాని డాక్టరు హెన్రీగారి పుణ్యమా అంటూ యింకా యిలాఅయినా వున్నాను.

(తన రాతబల్లదగ్గిర కూచుని, వుాళ్ళో లేనప్పుడు వచ్చినటపా చదువుతూ కూచుంటాడు. కొన్ని ఉత్తరాల్ని విప్పకుండానే వుత్సాహంలేనివాడిలా వాటి నిమిత్తంవున్న అరల్లో పెట్టేస్తాడు.)

బిల్లీ — మీరు రాజకీయమైన వుపన్యాసాలేమైనా యిచ్చే అవకాశం కలిగిందా?

ఏబీ — అవును, అవును రెండుమూడుసార్లు లేచి నిలబడక తప్పలేదు. ఒకసారి నాప్రత్యర్థి స్టీవెన్ డగ్లసు ఎదురయ్యాడు. అతనికీ నాకూ బహిరంగంగా కొన్ని వాగ్వాదాలు నడిచినయ్యి.

బిల్లీ — (వుత్సాహంగా) చాలాబాగుంది. మీరూ, అతనూ యేయే విషయాల్ని గురించి వాదించుకున్నారు?

ఏబీ — ఇదిగో యిల్లాచూడు బిల్లీ, అతివుత్సాహం కనబరచక. మేమేదో సరదాగా మాట్లాడుకున్నాంగాని కొట్లాటలూ దొమ్మీలూ యేమీ జరగలేదు. ఇక్కడి విశేషాలేమిటి?

బిల్లీ — జడ్జిస్టూఆర్టుగారు వుత్తరం రాశారు. వారు వాషింగ్టన్‌చేరామనీ, అక్కడ యెలక్షను హడావిడి జోరుగా

సాగుతుందనీ, అందరూ మంచి వుత్సాహంగావున్నారనీ రాశారు. శ్రీమతి ఫ్రేమ్‌గారు తమకేసుకు ఫీజు కొన్ని రోజులవరకూ యిచ్చుకునే స్థితిలో లేమని చెప్పారు.

ఏబీ — నేనామెనుంచేమీ వాంఛించడంలేదు. పాపం! ఆమె భర్తకోసం నేనెంత వాదించినా లాభం లేకపోయింది. అతనికి వురిశిక్షకూడా పడింది. ఆమెకే నేను యేదో విధంగా సాయం చేయాలి.

( బిల్లీ అతనికి ఒక వుత్తరం అందిస్తాడు. ఏబీ చదువుతుంటే ప్రశ్నార్థకంగా చూస్తూంటాడు. )

బిల్లీ — అదిస్వయంగా తెచ్చియిచ్చారు. మీరురాగానే దీన్ని అందజేస్తానని మాటిచ్చాను. ఆవుత్తరం "ఎలీజాపి. లౌజాయ్ లీగ్ ఆఫ్ ఫ్రీమెన్" సంఘాన్నించి వచ్చింది. వచ్చేలక్ష్మీ వారం బానిసత్వనిషేధంపై జరిగే వూరేగింపులోమాట్లాడాలని వారు మిమ్మల్ని కోరుతున్నారు. అది చాలా ముఖ్యమైన సమావేశం.

ఏబీ — (సాలోచనగా) బిల్లీ! మొన్న నే మానవుణ్ణి బలిదానంచేయడానికి ప్రోత్సాహించే మహత్తరశక్తి యేదైనా వుంటుందా అని చాలా ఆలోచించాను. ఆ సందర్భంలో లౌజాయ్ జ్ఞాపకం వచ్చాడు. నేను 'క్వీన్సీ' నించి 'ఆల్టన్' పడవమీద వస్తున్నాను. ఆ పడవమీదే వొక పెద్దమనిషి పన్నెండుమంది నీగ్రోలతో ప్రయాణంచేస్తున్నాడు. ఆరుగుర్ని, ఆరుగుర్నికలిపి సంకెళ్లు తగిలించాడు. వీళ్ళం దర్నీ విక్స్‌బర్గులో అమ్మడానికి తీసుకువెళుతున్నాడట.

ప్రతివాడిచేతికీ యినపసంకెళ్ళు తగిలించారు. దాన్ని వేరే మరొక పెద్దగొలుసుకు తగిలించారు. వీళ్ళందర్నీ చూస్తూంటే గుదిగుచ్చినచేపల్లా కనబడ్డారు. తల్లిదండ్రుల్నీ, సంసారాల్నీ, భార్యాబిడ్డల్నీ శాశ్వతంగా వదిలేసి నోరు మెదల్చకుండా బానిసల్లాగా వెళ్ళిపోతున్నారు. హృదయ విదారకమైన దృశ్యమది. నా మనసు తరుక్కుపోయింది.

బిల్లీ — (వుత్సాహంగా) అయితే, మీరు లౌజాయ్ వుత్సవంలో మాట్లాడుతారన్నమాట ?

ఏబీ — (నీరసంగా) ఏమో ? చెప్పలేను. ఈ ఫ్రీమెన్ లీగంతా అంధవిశ్వాసంగల వాళ్ళతో నిండిపోయింది. సకారణంగా వాళ్ళ కేది నచ్చచెప్పబోయినా మీ కేమీ తెలియదని చీదరించుకుంటారు. వాళ్ళగోలే వాళ్ళది.

(ఏబీ ఒక ఉత్తరం విప్పి చదువుతూంటాడు)

(బిల్లీ చిరకోపంతో నిరుత్సాహపడి వాదించి లాభంలేదని హుష్షరని వూరుకుంటాడు. తనపని తనుచేసుకోవడం మొదలుపెడతాడు. ఒకక్షణంపోయినతరువాత జోష్‌స్పీడ్, బాలింగ్‌గ్రీన్ ప్రవేశిస్తారు.)

బాలి — మేము వచ్చి మీ న్యాయశాస్త్రచర్చలనేమైన పాడు చేస్తున్నామా ?

ఏబీ — (ఆనందంగా) బాలింగ్ ! (ఎగిరిగంతేసి బాలింగు చేతులు తనచేతుల్లోకి తీసుకుంటాడు) ఎల్లా వున్నావు బాలింగ్ ?

బాలి — ఏదో బాగా వున్నాను ఏబీ — నిన్ను చూస్తే చాలా సంతోషంగావుంది.

ఏబీ — బిల్లీ ! వీరు స్క్వాయిర్ గ్రీన్ — న్యూసేలమ్ వీరిది వీరు బిల్లీహెర్న్‌డన్. వీరు జోష్.

బిల్లీ — ( బొలింగుతో కరస్పర్శచేసి ) లింకనుగారి కెప్పుడూ మీగొడవే. మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా ఆనందంగా వుంది.

బొలి — హెర్న్డెన్ గారూ! మీరూ లాయరేనా?

బిల్లీ — అవునండీ. జడ్జీ స్టూఆర్టు లేనప్పుడు వారి మనిషిగా పనిచేస్తూంటాను.

బొలి — ఏబీ! వుపాధ్యాయవృత్తికూడా చేస్తున్నావన్న మాట.

ఏబీ — ఏముంది చేయడాని కిందులో? నాకు తెలిసిందీ చదివిందీ చెప్పడమేగాని!

బొలి — అవునోయ్! చెత్తతోవున్న ఆ బల్లచూస్తేనే తెలుస్తూందిలే!

ఏబీ — ఇంకొక యేడాది ప్లీడరీ చేశానంటే నాచెత్త వెయ్యడాని కొకగొదాము యిచ్చినా చాలదు. బొలింగ్! కూచో. ఇంతకీ నువ్విప్పుడు స్ప్రింగ్‌ఫీల్డు యెందుకు వచ్చినట్టు?

(బొలింగు కూచుంటాడు. జోష్ మంచంమీద కూచుని 'పైప్' అంటిస్తాడు. బిల్లీ మళ్ళీ బల్లదగ్గిర కూచుంటాడు.)

బొలి — కొత్తగావస్తున్న ఆవిరిపడవలో చేపలు పడదామని మిచిగాన్ సరస్సుకు వెళ్ళాము. వెళ్ళి సంవత్సరం పోయినా ఆదారికి వెళ్ళలేనంత భయం పట్టుకుంది. ఏబీ! నువ్వెలా వున్నావో చెప్పావుకాదు. అప్పులింకా వున్నా పలుకుబడి మాత్రం మంచిబాగా సంపాయించావని జోష్ అన్నాడు.

ఏబీ — రెండూ నిజంగానే చెప్పాడు. చాలా సభలకీ సమా

వేశాలకీ పిలుస్తూంటూ రిక్కడ నన్ను. వినియన్ ఎడ్వర్డ్సు జ్ఞాపకం వున్నాడా?

జాలి — బాగుంది, జ్ఞాపకం లేకపోవడమేమిటి?

ఏబీ — సరే మంచిదే. వాళ్ళింటికి నన్ను తరుచూ పిలుస్తూ వుంటారు. చాలా పెద్దయిల్లు. ఇంటిచుట్టూ వున్న వసారాలో గుఱ్ఱంపందేలు కూడా పెట్టవచ్చంటే నమ్ము. కెంటకీలోలాడ్ కుటుంబానికి చెందినది ఆయన భార్య. లాడ్‌లంటే చెప్పుకోతగిన కుటుంబంలే!

జోష్ — బాలింగుకి నువ్వు రోచెస్టరులో కలుసుకున్న వాళ్ళని గురించి చెప్పు.

ఏబీ — యునైటెడ్ స్టేట్సు అధ్యక్షుని కలుసుకున్నా, బాలింగ్.

జాలి — నిజమేనా?

ఏబీ — నా చేతిని చూస్తున్నావా? (తన కుడిచేతిని చాపి అరచేతిని చూపుతాడు.)

జాలి — అవునవును, అదే చూస్తున్నాను.

ఏబీ — మార్టిన్ వేన్‌బ్యూరితో కరచాలనం చేశాను యీ చేత్తోనే!

జాలి — (నవ్వుతూ) ఏబీ! ప్రెసిడెంటు నీతో బాగామాట్లాడారా?

ఏబీ — "నిన్ను గురించి వాషింగ్‌టన్‌లో చాలా గొప్పగాచెప్పుకుంటున్నారోయ్" అన్నాడు. తరవాత తెలిసింది ప్రతి వాళ్లనీ యిలాగే అనడం మామూలని. (నవ్వుతాడు.) బిల్లీ హార్డన్‌కి నేను తగని వాళ్లతో స్నేహం చేస్తున్నానని మహాకోపంగా వుంది. నీగ్రోబానిసత్వాన్ని దూషించ

కుండా, నోరుమూసుకుని తగుదునమ్మా, నేనే అమెరికన్ పౌరుణ్ణని యెలా తిరుగుతారో యీమనుష్యు లని బిల్లీ ఆశ్చర్యపోతూ వుంటాడు. సహజంగా మనిషికి కారం పాలు యెక్కువ. తనకే శక్తివుంటే యీనియన్నంతా భగ్గుని మసిచేసి మనల్నికూడా మాడ్చేసి వుండేవాడే. ఏమంటా వోయి బిల్లీ?

బిల్లీ — (ముఖం ముడుచుకుని) లింకనుగారూ! మీరు కోప్పడితే చెప్పలేనుగాని మీలోదాగివున్న శక్తుల్ని మీరుపయోగ పరిచి మానవజాతికి వినియోగించి వుంటే యెంతో బాగుండేది. కాదంటారా?

ఏబీ — జాలింగ్! ఈ అన్యాయాన్ని చూశావా? నిరంకుశ త్వాని అణచడానికని యుద్ధరంగంలో దిగి రక్తపాతం చెయ్య మంటాడు.

జాలి — హెర్డన్! మీకు నాఆశీస్సులు!

బిల్లీ — (లేచి నిలబడి టోపీతీసి) కృతజ్ఞుణ్ణి (జాలింగ్‌తో కర చాలనంచేసి ఏబీవంక తిరిగి) విల్కాక్సు కేసు 'రిట్' తయారు చేశాను. వెళ్లి కోర్టుగుమాస్తాతో ఎటెస్టు చేయించి తీసుకు వస్తాను.

ఏబీ — అలాగేచెయ్యి బిల్లీ.

బిల్లీ — (జాలింగులో) స్క్వాయిర్ గ్రీనుగారూ! ఈలోకంలో ఆయన కెవరైనా స్నేహితులంటూ వుంటే మీరూ, స్పీడుగారేనని ఏబీ తరుచూ అంటూవుంటారు. ఈరొంపిలో దిగిపోయారాయన. వార్ని యిందులోంచి బయటికిలాగి పుణ్యం కట్టుకోండి. స్పీడుగారూ, వస్తాను నమస్కారం!

జా లి — ఏబీ! చాలా తెలివైన కుర్రవాడు. తెలివికి తగ్గట్టు మంచివిషయగ్రాహకత్వంకూడా వుంది.

ఏ బీ — (బిల్లీవంకే చూస్తూ) కోర్టుగుమాస్తా ఆఫీసుకిందేవుంది, కాని టోపీకూడా పెట్టుకుని వెళ్లాడు. అంటే 'చినరీహౌస్'కి వెళ్ళి వస్తాడన్నమాట.

జా లి — తాగుతాడా?

ఏ బీ — అవును. ఎంతోవుత్సాహంవుంది మనిషిలో. కాని దాన్ని చంపేసుకుంటున్నాడు. సరే — న్యూసేలమ్ కబుర్లు చెప్పుదురూ! (కిటికీ దగ్గరవున్న గోడకు ఆనుకుని.)

జా లి — ఏమున్నాయి చెప్పడానికి!

ఏ బీ — పూజ్యురాలు మీభార్య యెలావున్నారు?

జా లి — నువ్వెలా వుంటున్నావో యేంచేస్తున్నావో అని ఒకటే బెంగ. రోజు రోజుకీ నీవిలా అయిపోడానికి కారణ మేమిటో తెల్సుకుని మరీ రమ్మంది వచ్చేప్పుడు.

ఏ బీ — (నవ్వుతూ) నేను బాగానేవున్నాను. ఏమి కాలేదు అనిచెప్పండి. డాలరుకో యేడుసెంటుల చొప్పున అప్పు లన్నీ తీర్చేశాను. సుఖంగా, ఆరోగ్యంగా వున్నాను.

జా లి — బాగుందోయి! మరి తరుచూ నీ క్షేమసమా చారాన్ని గురించైనా ఎందుకు తెలపడంలేదు చెప్పు?

ఏ బీ — జోష్ని అడిగితే నాకెంత తీరికవుంటుందో చెపుతాడు.

జా లీ — ఏమిటో తీరికలేని ఆమహాకార్యాలు?

ఏ బీ — నేను ప్రస్తుతపుఎన్నికల్లో వొక అభ్యర్థిని.

జోష్ — గోడమీద అంటించిన పేపర్లో అడుగున ఇతనిపేరూ వుంది చూళ్ళేదా? వీళ్ళందరూ విగ్ పార్టీ టికెట్టుమీద నిలబడినవాళ్ళేను!

ఏబీ — నేనునెగ్గితే వచ్చేయేడాది 'ఎలక్టోరల్ కాలేజీ' మెంబరు నవుతాను.

జాలి — 'ఎలక్టోరల్ కాలేజీ!' అంతకన్నా పై పదవికి వెళ్ళలేవన్న మాట?

ఏబీ — ప్రస్తుతం నాకున్న పనుల్లో యింతకన్నా యెక్కువ నిర్వహించలేను. న్యూసేలమ్‌లో నేను వున్నప్పుడు సేత్ గేల్ వుండేవాడు, గుర్తుందా? అతను తరుచూ పడమటికి వలస పోతానంటూండేవాడు. ఈవాళే వుత్తరం రాశాడు. ప్రస్తుతం 'మేరియానా' లో వుంటున్నాడు, పెళ్లాం, కొడుకులతో సహా. తూర్పులో 'టెక్సాస్' ని గురించి చాలా తీవ్రమైన ఆందోళన చేస్తున్నారని రాశాడు.

జాలి — మంచిపనిచేస్తున్నారు. దీనివల్ల వొక్క టెక్సాస్‌లో మాత్రమే కాదు. నెబ్రాస్కాలో, అక్కడినుంచీ కాలిఫోర్నియాకూడా వ్యాపిస్తుందీపిశాచం. దీనివల్ల దక్షిణాదిఅంతా అంటువ్యాధిలా నిరంకుశత్వం అల్లుకుపోతుంది. స్వతంత్ర రాష్ట్రాలుగావున్న మనల్ని ఆదైవమే కాపాడాలితప్ప మరివేరేదిక్కులేదు.

జోష్ — ఏంచెయ్యగలం! అంతా మన దురదృష్టం. అల్లకల్లోలాల కిది నాందీపాఠం.

ఏబీ — ఇదే నిజమైతే, బానిసత్వనిర్మూలకులపైనే యీ అభాండమంతా వేస్తారు. ఈఆందోళనవల్ల వచ్చేఫలితాలు

తెలిసికూడా ఆందోళన చెయ్యడం మానలేదు. శాంతి సీవిధంగా నాశనం చేస్తున్న వీళ్ళనందర్నీ జైల్లో పారెయ్యాలి!

బాలి — నీమనసు మార్చుకున్నావా? నువ్వు బానిసత్వాన్ని అరికట్టేవాడివనుకున్నాను!

ఏబీ — (మంచంమీద పడుకుని) లేదు, మారలేదు. బానిసత్వాన్ని యెంత ద్వేషిస్తానో యుద్ధాన్నీ అంతే ద్వేషిస్తాను. వాటిమాట అలావుంచండి. ప్రస్తుతపు మీయభిప్రాయం అర్థమైంది నాకు. (శాంతంగా మాట్లాడుతూ) మీరంతా బిల్లీహెర్న్‌డన్ అభిప్రాయాన్నే స్థిరపరిచి మీ సహృదయత్వంలో నావృద్ధినిగురించి బాధపడుతున్నారు. అంతేనా?

బాలి — అదికాదు ఏబీ! నీజీవితంలో జోక్యం కలగజేసుకోదల్చుకోలేదు నేను.

జోష్ — నేనూ అంతే. నీవిషయంలో యెన్నో ఆశలు పెట్టుకుని నిరాశపడ్డాం. కాని ఆ విషయాలన్నీ యిప్పుడెందుకులే. అవి మాతోనే వుండనీయి.

ఏబీ — (నవ్వుతూ) నేనెలాంటివాణ్ణో, అలాగే—నాలాగే మీరూ అంగీకరించి తీరాలి. నేను వీరుణ్ణికాదు. 'బ్లేక్ హాక్' యుద్ధం తెలిసిపోయింది నేను తుపాకి పట్టుకుని రెడ్ యిండియన్‌నైనా కాల్చలేనని. వట్టి పిరికివాణ్ణి. వాళ్ళనిచూసి నేనెలా భయపడ్డానో వాళ్ళూ నన్నుచూసి అలాగే జడిసి నావైపుకే రాలేదు. ఎందరో్న యెరుగుదును. చకచకాగా చంపుతారు, హాయిగా చచ్చిపోతారు.

అందుకని అలాటివాళ్ళని యుద్ధాలు చెయ్యవల్సి వుంటే చెయ్యమనండి.

శాలి — శాంతిప్రియులుకూడా తమ దేశాలకి సేవ చేస్తూంటూ రొక్కొక్కప్పుడు.

ఏబీ — రాజకీయాల్లో ప్రవేశించనంత కాలం శాంతిప్రియులు కావచ్చు, కాని వొక్కసారి అందులో అడుగు పెట్టాక మారిపోతూంటారు. (పక్కమీద లేచి కూచుని) నేనే కాంగ్రెసులో నిలబడి నెగ్గితే మీరు చెప్పే రొంపిలో నేనూ దిగక తప్పదు. శాంతా—యుద్ధమా? అనే క్లిష్టసమస్యాపరిష్కారంలో దేనికోదానికి ఓటుచేయక తప్పదుగా? 'టెక్సాసు' 'మెక్సికో' తో తలపడవచ్చు. 'ఇంగ్లండు' 'ఆరిగన్' తో యుద్ధానికి దిగవచ్చు. లేదా మనలో మనమే అంతర్యుద్ధానికి దిగి 'ఓహియో' నది యివతల వారితో అవతలవారు కత్తులు దూయవచ్చు. ఇటువంటి పరిస్థితుల్లో నేనెటు వోటు చేస్తానని మీఅభిప్రాయం? తడుముకోకుండా మంచిదనుకున్న దానికే ఓటుచేస్తానని చెబుతారు కాబోలు. మంచిఅభ్యుదయంఅంటే యేమిటి? ఏదోవొక ఆశయసిద్ధికోసం, కొన్నిప్రాంతాలకోసం యుద్ధం చేయడమేనామంచి? లేక యుద్ధం యెలాగైనా జరక్కుండా చూడ్డమేనామంచి? అందుకని నాబోటివాడు "ఎలక్టోరల్ కాలేజీ" లోనేవుండడం మంచిది. నాల్గునెలల ముందుగానే యెన్నుకొన్న అధ్యక్షుడికి వోటువెయ్యడమే పని.

శాలి — నీ అంతర్వాణి చెప్పేమాటలు నిర్లక్ష్యంచేస్తూనే బతుకంతా యిలాగే తెల్లార్చే తెలివి మాత్రం వుంది.

( నినియన్ ఎడ్వర్డ్సు ప్రవేశిస్తాడు. ధనవంతుడిలా వేషం, కొంచెం లావుగా వుంటాడు )

ఏబీ, జోష్ — ( ఒక్కసారిగా ) నినియన్ !

నిని — మీరేనా ! బిల్లీ హెర్న్డన్ 'చెనరీ హౌస్' దగ్గిర కనబడి మీరు సర్యాంగమన్ నించి తిరిగివచ్చి యిక్కడవున్నారని చెప్పాడు. ( బాలింగునుచూసి ) ఏమిటీ! మాకేస్తం స్క్వాయిర్ గ్రీన్ ? ( బాలింగుతో కరస్పర్శ చేస్తాడు. )

బాలి — బాగున్నావా , ఎడ్వర్డ్సు ?

నిని — ఏబీ! నిన్నీరోజు మాయింటికి భోజనానికి పిలుచుకుపోవడానికని వచ్చాను. స్క్వాయిర్ గారు, మీరూవస్తే మాయింటావిడ యెంతైనా ఆనందిస్తుంది - మీకు తీరికుంటేనే సుమండి. జోష్ నువ్వూరాక తప్పదు.

జోష్ — పరమ సంతోషంగా !

నిని — 'కెంటకీ' నించి మామరదలు మేరీటాడ్ మాయింటికి వచ్చింది. ఆమెను అందరికీ పరిచయం చేద్దామని వుంది. చక్కని పిల్ల. బాగా అనర్గళంగా ఫ్రెంచి మాట్లాడుతుంది. చీటికి మాటికి ఆసువుగా కవిత్వం అల్లేస్తుంది. లోకంలోవున్న పుష్పజాతుల్ని గురించి బాగా తెలుసు. వాటిపేర్లన్నీ కంఠతాయే. స్టీవెన్ డగ్లస్‌నీ, మరికొందరు యువకుల్నీ ఆవిడతో పరిచయం చేసుకుంటారని పిల్చాను. అబ్బాయిలూ! అందుకని మీరు కొంచెంముందే రావడం మంచిది.

బాలి — మీ యింటావిడికి నాధన్యవాదాలు చెప్పు. యింట్లో

మా ఆవిడ నాకోసం యెదురుతెన్నులుచూస్తూ ఆత్రంగా వుండివుంటుంది.

నిని — మీరు చెప్పిందానికి నేను అడ్డుచెప్పడ మెలాగు. ఏబీ! నువ్వు త్వరగానే వస్తావుగదూ ?

ఏబీ — ఓ! అలానేవస్తాను. అందుకాశ్చర్య మేముంటుంది ?

నిని — అయితే మంచిది. చక్కని చుక్కని కలుసుకుంటు న్నావు కాని జాగర్త! వొంటిరిగా బతకాలనుకుంటే మాత్రం ఆవిడవల్లో పడకుండా చూచుకో!

ఏబీ — నినియన్, నీహెచ్చరికకు ధన్యుణ్ణి.

నిని — వుంటాను బొలింగ్. జోష్, మళ్ళీ కల్సుకుందాం. (వెళ్ళి పోతాడు.)

ఏబీ — బొలింగ్ ! నీకు నావిషయమంతా తెల్సుగా ! రోజూ యిదే గొడవ. ఏఅమ్మాయికో ఒకఅమ్మాయికి వరుడు కావాలని, అందుకు యెరగా నన్ను చంపుతూంటారు. కాబోయే ప్రతిపెళ్ళికూతురికీ అనర్ఘళంగానే ఫ్రెంచి వచ్చి వుంటుంది. ప్రతీ అమ్మాయీ చక్కనిచుక్కే !

బొలి — ఏబీ! నీవచ్చీరాని ఫ్రెంచిలో అమ్మాయిలతో యెల్లా మాట్లాడుతావో చూడాలని వుందోయ్!

(ఏబీ అతనివంక సాకూతంగా చూస్తాడు.)

ఏబీ — బొలింగ్ ! నీతో నేను వేళాకోళమాడ్డంలేదు. జోష్ ! నిజం నువ్వేచెప్పు, నేనేమైనా నటిస్తున్నానా ? మీదగ్గిరా నా రహస్యాలు! నన్ను నేను యెగతాళి చేసుకుంటే మిమ్మల్ని చేసినట్టే. దయార్ద్ర హృదయులైన మీరు నన్ను గురించి యేమనుకున్నా నన్నూ, నాలోపాల్నీ నేను

క్షమించుకోలేను. ఎప్పుడో యెక్కడో అంతర్యుద్ధం జరుగు తుందని మీరూహిస్తున్నారు, కాని నిరంతరం నాహృద యంలో అంతర్యుద్ధజ్వాల ప్రజ్వలిస్తూనే వుంది. రెండు పక్షాల్లోనూ న్యాయం వుందనీ, రెండుపక్షాలవారి లోనూ లోపం వుందనీ అనిపిస్తుంది. ఈ రెండు భావాలకీ అతీతంగా వుండాలని కాంక్షిస్తున్నాను. బైబిలులో చెప్పి నట్టు ఇంటగెలిచి రచ్చగెలవాలికదా! నామనసుకే నేను సమాధానం చెప్పుకోలేనప్పుడు చేయగలిగే దేముంటుంది? ఎప్పుడో వొకనాడు యీబాధతో నామనసు ముక్కలై పోతుంది. అప్పుడుగాని శని విరగడవదు. ఈగొడవలన్నీ యెప్పుడూ వుండేవే— రండి వెళదాం (టోపీ చేతితో పట్టు కుని) డార్లింగ్! నీకోసం నాన్సీ యెదురు చూస్తూ వుంటుంది. జోష్! కెంటకీనుంచి వచ్చిన ఆ పిల్ల, మేరీటాడ్ యెవరోగాని, ఆవిడగారి మన్నల్ని అందుకోవాలని మాత్రం వుంది.

(వెళ్ళుతున్న వారికి చేతులు వూపుతాడు.)

నాల్గవ రంగం సమాప్తం

---

## ఐదవ రంగం

(స్ప్రింగ్‌ఫీల్డులో యెబ్రహాం యింటివరండా. కిందటిరంగం గడి చిన ఆరునెలలపిదప. నవంబరునెల. సాయంత్రపువేళ.

కుడివైపు చలిమంటఅర (ఫైర్ ప్లేస్). ఎడంవైపు విశాలమైన కిటికీలకు తెరలువేసివుంటాయి. వెనకనున్నగుమ్మం హాల్లోకిమార్గం.

కుడివైపునున్న చలిమంటఅర దగ్గరగా చిన్నమంచం, వొక పడక

కుర్చీ వేసివుంటాయి. ఎడంపక్కగా యింకొక మంచం, కుర్చీలు, వాటి ముందు టేబిలూ వుంటాయి. గోడలకు తాతతండ్రుల ఫోటోలు తగిలించి వుంటాయి. గది అందంగా అలంకరించి వుంటుంది.

నినియన్ చలిమంటముందు నిలబడి భార్య ఎలిజబెత్ తో మాట్లాడుతూంటాడు. గొప్పయింటి పడుచులా అలకరించుకుని వుంటుంది. తన గొప్పతనాన్ని ప్రదర్శించుకోవాలనే అలంకరించు కుందా అన్నట్టు కనబడుతుంది. ఆందోళనపడుతున్నట్టు ముఖంలో వ్యక్త మౌతూంటూంది.)

ఎలి — ఎలానమ్మను! నాచెల్లెలు యింత అవక తవకపని చేయదు.

నిని — నాకై తే నమ్మకంలేదు. మేరీ ఏబీని చాలారోజు ల్నుంచే యెరుగును. అతని గుణగణాల్ని బాగా యెరిగే వుండి వుంటుంది.

ఎలి — మనందర్నీ నవ్వించినట్టే దాన్నీ నవ్విస్తున్నాడు. ఎడ్విన్ వెబ్, స్టీవెన్ డగ్లసేగాక యింకెందరో యువకులూ, సౌందర్యవంతులూ, మర్యాదస్తులతోనే యెక్కువచను వుగా వుంటుంది.

నిని — నీకు కనబడని సౌందర్యాన్నేదో ఆమె అతనిలో చూస్తుందని యెందు కూహించగూడదు ?

ఎలి — వట్టిది! అమాయికమైన తన మనసుని వున్నదున్న ట్టుగా పైకి చూపించడమే ఏబీలింకన్ లోని సుగుణం. స్నేహానికతను మంచివాడే కావచ్చు కాని, మంచి కుటుంబంలోని చురుకైన పిల్లకి కాదగినభర్తమాత్రంకాదు

నిని — నువ్వనేది నిజం! మేరీ చురుకైనది. అందుకనే అతని మీద కన్ను వేసిందేమో.

(ఎలిజబెత్ భర్తని తీక్షణంగా చూసి నవ్వుతుంది)

ఎలి — నినియన్! నన్ను వెటకారం చేస్తున్నావు. ఏమీ లేని దానికి కావాలని నన్ను రెచ్చగొడుతున్నావు.

నిని — లేదు, ఎలిజబెత్! నగ్నసత్యాన్ని యెదుర్కోడానికి నిన్ను సంసిద్ధురాల్ని చేస్తున్నాను. గొప్పవంశమనీ, సంస్కారంగల పిల్లనీ, కెంటకీ బేంక్ అధ్యక్షుని కూతురనీ ఏబీలింకన్ ఆమెని పెళ్లిచేసుకోవాలని వుత్సాహపడుతాడని నీవూహించకు. అది గొప్పపొరపాటు...

( మేరీటాడ్ ప్రవేశిస్తుంది. వయస్సు 22. పొట్టి. అందంగా, స్ఫురద్రూపిలా కనపడుతుంది. గుమ్మంమధ్యలో ఆగి అక్కనీ బావనీ అనుమానంగా చూస్తుంది)

మేరీ — మీరిద్దరూ యేదో మాట్లాడు కుంటున్నట్టున్నారు.

నిని — కుర్రాళ్లందరూ వేలంవెర్రిగా యిప్పుడు పాడుతున్న కొత్తపాట సంగతి మీఅక్కకు చెపుతున్నాను.

పాట

మేరీ — (ముఖం చిట్లించుకుని నవ్వుతూ) నినియన్! నీసమయస్ఫూర్తికి చాలా ఆనందంగా వుంది. మీరు నన్నుగురించే మాట్లాడుకుంటున్నారు. ( ఎలిజబెత్ వంక చూస్తుంది. చెల్లెలి పట్టుదల చూసి ఆమె కొంచెం వొణుకుతుంది. ) అవునా?

ఎలి — అవును, మేరీ!

మేరీ — చాలా తీక్షణంగానే యోచిస్తున్నట్టుంది?

నిని — ఎలిజబెత్ అనవసరపు భయాలతో బాధపడుతుందనుకుంటున్నాను...

ఎలి — (మాట కడ్డుపడుతూ) నేను చెప్పదలుచుకున్నదాన్ని చెప్పనివ్వండి (మేరీవైపు తిరిగి) మేరీ - నిజంచెప్పు. నువ్వు

...నువ్వు ఎబీలింకన్ని చేసుకోవాలని నిజంగా అనుకుంటు న్నావా! (తీక్షణంగా యిద్దరివంకా చూస్తుంది.) మేరీ! యిటువంటిదసలు సంభవిస్తుందనికూడా వూహించలేకుండా వున్నాను....

మేరీ — నినియనే యీభయంకర విషయమై ముందుప్రస్తావన చేశాడుకదూ? ఈ అనవసరపు గొడవని యెత్తాడు గనక ధైర్యంగా యెదుర్కోడమే కర్తవ్యమని నావుద్దేశ్యం. అందుకని, యెప్పుడో గాదు - యిప్పుడే దాన్ని పరిష్క రిద్దాము. ఎలిజబెత్! నువ్వుఅడిగిన ప్రశ్నకి సమాధానం చెపుతున్నాను. నువ్వుయెత్తిన విషయాన్ని గురించి నేనొకసారికాదు, చాలాసార్లు ఆలోచించి-చివరకు లింకన్ భార్యను కావడానికే నిశ్చయించు కున్నాను. (మంచం మీద కూచుంటుంది. నినియన్ భార్యవంక చూసి, 'నేను ముందే చెప్పానుగా?' అన్నట్టు చూసి సదభిప్రాయాన్ని వ్యక్తపరుస్తాడు. ఎలిజబెత్ కళ్ళు వొప్పజెప్పి చూస్తుంది.) ఈచుట్టుపక్కలనున్న యువకులందర్నీ, కొందరు పెద్ద వాళ్ళమంచిచెడ్డల్నీ జాగ్రత్తగానే చూశాను. వాళ్ళందరిలో లింకనే మంచివాడనిపించింది. అందుకని అతన్నే వరించాను.

ఎలి — ఇంత చక్కగా వరించినందుకు మెచ్చుకోమంటావు గదూ?

మేరీ — లేదు! మెచ్చుకోనూ అక్కరలేదు, దూషించి జాలి పడనూ అక్కరలేదు.

ఎలి — — (పక్కగా తిరిగి) అయితే నోరువిప్పను.

నిని — మేరీ! నీవిషయంలో జోక్యంకలగజేసుకుంటున్నందుకు

క్షమించు. అస లీవిషయాన్ని, నీ నిర్ణయాన్ని అతనికి చెప్పావా ?

**మే రీ** — ( నినియన్ను చూసి చిరునవ్వు నవ్వి ) లేదింకా చెప్పలేదు. సాయంకాలం వస్తాడు. అణకువగా నాచెయ్యి కోరతాడు. ముందు చూపించాల్సిన సిగ్గూ అభిమానం వొలకపోసి తరువాత " ఊఁ " అంటాను.

ఎ లి — ( జాలిగా ) మేరీ ! మొండిధైర్యంతో వేళాకోళంగా మాట్లాడుతున్నావు. నీ మాటలు నాకు బాధగానూ ఆశ్చర్యంగానూకూడా వున్నాయి. నీకేంచెప్పాలో, యెలా చెప్పాలో తెలియడంలేదు. చనిపోయిన నాన్నా అమ్మా నిన్ను వొప్పగించారు. నేను నీకన్నా పెద్దదాన్ని. నీ బాధ్యత నాది. నీ మంచికోరి...

**మే రీ** — ( ప్రేమా జాలీ పెనగొనగా ) ఎలిజబెత్ ! నన్ను ఆజ్ఞాపించడం, అర్థించడంకూడా అనవసరం. నేనిదివరకే వొకనిర్ణయానికి వచ్చాను.

ని ని — మేరీ ! నీధైర్యానికి చాలాసంతోషం, కాని, నేను తెల్సుకో...

ఎ లి — నినియన్ ! నేనూ మా చెల్లీ మాట్లాడుకోవల్సిన విషయమిది.

**మే రీ** — లేదు ! నినియన్ వుద్దేశ్యమేమిటో తెలుసుకోవాలని వుంది. ( నినియన్తో ) ఏమిటది ?

ని ని — నిన్ను వొకప్రశ్న వేయాలనుకుంటున్నాను.

**మే రీ** — ( శాంతంగా ) తప్పకుండా అడుగు.

ని ని — చూడుఅమ్మాయి - నీ వుద్దేశ్యాల్ని వ్యతిరేకిస్తున్నా

నమకోకు. వొక్కమాట. ఏబీ అంటే నాకు చెప్పలేని ప్రేమని నీకు తెలుసు. అతనిలో దేన్నిచూసి అతణ్ణి ప్రేమించావో తెలుసుకోవాలని కుతూహలంగా వుంది.

మేరీ — (మొదటిసారిగా సందేహిస్తూ) నినియన్! నువ్వు అడిగిన ప్రశ్నకు చక్కని సూటైన సమాధానం చెప్పాలనే వుందికాని నాకు తెలియదు.

ఎలి — (ఎగిరిగెంతి) అవునవును చెప్పలేవు! కళ్లుమూసుకుని గోతిలోపడుతున్నావు. భవిష్యత్తు యెలావుంటుందో కూడా గ్రహించలేకుండా వున్నావు.

మేరీ — ఎలిజబెత్! నీవూహించేది నిజంగాదు. తాత్కాలిక వుద్రేకంలో నేనీపని చేయలేదు నీవనుకుంటున్నట్టుగా. నన్ను నేను మరచిపోలేదు. నేనెరిగిన యువకులందరిలోనూ పీరుడైన 'లోషిన్ వార్న్' పోలిన పురుషు డితడొక్కడే. ఇతనితోతప్ప మిగిలినవారితో నాజీవితాన్ని పంచుకోలేను.

ఎలి — అతనితో ఆనందంగానైనా జీవించలేవని కూడా గ్రహించలేకపోతున్నావా? అతని వంశం - గతచరిత్ర - అతని వాలకం - చివరికతని భావాలుకూడా...?

మేరీ — (నిశ్చలంగా) మీారందరూ అనుకునే పెళ్ళి చేసుకుని నేను తృప్తిపడలేను. సుఖం, శాంతీ కావాలనే కోర్కె నాకు లేదు.

ఎలి — నువ్వు గడపబోయే భవిష్యత్తు అంటే పాపం చాలా సరదాగావుందా? ఉండడానికి కొంపలేక ఏగొందిలోనో తలదాచుకుంటూ, సాయానికి పనిపిల్లైనా లేకుండా, చివరికి నలుగురిలోకీ వస్తే అవునన్నబట్ట లేకుండా వుండడమేనా!

మేరీ — (గట్టిగా) నేను బీదతనం యెరగను. అందుకని అది యెలావుంటుందో చెప్పలేను. నాభర్తనాతో సహకరిస్తూ ముందుకు పురోగమిస్తూంటే, అభ్యుదయ పథానికి మేం ముందంజ వేస్తున్నంతకాలం, యిదివరకు నేనెరిగిన యే సుఖాన్నైనా వదులుకోగలను. (చివరి మాటలను, ఆవేశంతో వున్మత్తురాలిలా మాట్లాడుతుంది.)

ఎలి — నిలకడ లేకుండా సోమరిలా దారిపొడుగునా ఆగుతూ, వేళాకోళాలాడే యేబీలింకనుతో యెంతదూరం పురోగమిస్తావు?

మేరీ — (నిలబడి కోపంగా) దారిలో యేమీ అతన్ని అడ్డలేవు. నేను వెంటుండి ముందుకునడిపించే ధైర్యం నాకుంది. నేనేమిచేస్తే నీకిష్టంగావుంటుందో నేనెరుగుదును. నినియన్ వంటివాణ్ణి యేరుకుని పెళ్లిచేసుకు సుఖంగావుండమంటావు. నినియన్ లాంటివాళ్లనెందర్నో చూశాను—అచ్చంగా అతనిలాంటివాళ్లనే — బావగారంటే నాకుగౌరవం లేదనుకోకు. కాని అలాంటిపనిమాత్రం చేయను — చేయదల్చుకోలేదు - ఎన్నటికీ. మీచుట్టూకొన్ని పరిధుల్ని నిర్మించుకుని, సామాన్యులతో కలవకుండా చాలాపవిత్రంగా వున్నామనుకుంటున్నారు. కాని, నిజంగా మీజీవితాల్ని సంకుచితంచేసుకున్నారు. మీవంటివారు తమచుట్టూ నిర్మించుకున్న ఇనపగోడల్ని బద్దలగొట్టి తనచుట్టూ యేవిధమైన పరిధీలేకుండా స్వేచ్ఛగాబతకగల సమర్థుడు ఏబీలింకన్!

ఎలి — మేరీ! ఏంమాట్లాడుతున్నావ్? పిచ్చిదానిలా బాధ్యతా రహితంగా మాట్లాడుతున్నావు... ...

మేరీ — (చీదరించుకుంటూ) నీకిది పిచ్చితనంలా కనబడు తుందిలే? పిత్రార్జితం బాగావుండి, లోకంలో యింతో అంత స్థిరపడినవాణ్ణి పెళ్లిచేసుకున్నావు. అందుకని జీవితంలో నీవెదుర్కోవలసిన సమస్యలులేవు. ఎక్కడున్నావు గొంగళీఅంటే వేసినదగ్గిరేవున్నానన్నట్టు? నీస్థితిని అభివృద్ధి చేసుకుందామనిగాని, మార్చుకుందామనిగాని నీకు తోచలేదు. నీవుద్దేశ్యంలో యింకా అభివృద్ధంటూలేదు. పరిపూర్ణమైన జీవితం నీకిదేకావచ్చు! కాని నాకిదికాదు పరిపూర్ణత్వం. నాజీవితాన్నీ, నాభర్తజీవితాన్నీకూడ నాయిష్టమైనట్టు తీర్చిదిద్దాలనీ, రూపొందించాలనీ భావిస్తున్నాను. బాధ్యతారహితమైన పనా యిది?

(పనిపిల్ల ప్రవేశిస్తుంది)

పని — అమ్మా! లింకన్‌గారు వచ్చారు.

ఎలి — ఇక్కడికా?

మేరి — (ధృఢంగా) నేనువచ్చి కలుసుకుంటాను!

పని — లింకనుగారూ! లోపలికి వస్తారా?

(ఏబీ లోపలికివస్తాడు. కొత్తసూటు. తల శుభ్రంగాదువ్వుకుని వుంటాడు.)

ఏబీ — శ్రీమతి నినియన్‌గారూ! నమస్కారం. కుమారిటాడ్ గారూ! అభివందనాలు. నినియన్! నీకూ నావందనాలు.

ఎలి — నమస్కారం!

మేరి — నమస్కారమండీ లింకన్‌గారూ.

(ఎడంపక్కనున్న మంచంమీద కూచుంటుంది.)

ని ని — ఏబీ! నీరాకకి చాలాసంతోషంగా వుంది.

(నారిమధ్య యేదో రభస జరుగుతుందని గ్రహించి యేమీ యెరగనట్టు మామూలుగా మాట్లాడుతాడు.)

ఏ బీ — ఆలస్యమైయిందనుకున్నాను. వస్తూంటే దారిలో న్యూసేలమ్‌లో కాడీతనంగా తిరిగే జాక్ ఆర్మ్‌స్ట్రాంగు భార్య యెదురైంది. నినియన్! నీ కతను గుర్తున్నాడా?

ని ని — (చిరునవ్వుతో) ఆ, బాగాగుర్తుంది. ఇప్పుడేం చేస్తున్నాడు?

ఏ బీ — (చలిమంట దగ్గిర నిలబడి) అతను బాగానేవున్నాడు. అతని భార్య హాన్నా కొడుకు డఫ్ హత్యానేరం కింద బంధించబడ్డాడని అతని తరఫున నన్ను యెలా అయినా వాదించమని కోరుతూంది. జైలుకువెళ్ళి కుర్రాడితో మాట్లాడాను. నాదృష్టికి అతను చాలావరకూ తప్పుచేసి వుంటాడనే తోస్తుంది. వాళ్ళమ్మ నాచినిగి పోయినగుడ్డల్ని కుడుతూంటే నేను వాడికి గోళీలాడడం నేర్పేవాణ్ణి. (ఎలిజబెత్ వైపు తిరిగి) నేను సర్వేకి వెళ్ళి కంపల్లోనూ డొంకల్లోనూ నాపంట్లాముల కాళ్ళు చింకిగా చేసుకోకుండా వాటికి అడుగున తోళ్ళువేసి కుట్టేది. ఆమె రుణం తీర్చుకోడానికి నేను ఆకుర్రాడి కేసువాదించి, వాణ్ణెలాఅయినా న్యాయశిక్షపాలు కాకుండా కాపాడాలి.

ని ని — ('అమ్మయ్యా' అని - శాంతంగా నవ్వుతాడు.) తప్పకుండా కుర్రాణ్ణి వదిలేస్తారు. ఏబీ! నీలాంటి ప్లీడర్లే లేకపోతే దేశంలో అందరూ న్యాయశిక్షకు జడిసి, తప్పు చేయకుండా సుఖంగా బతికి పోయేవాళ్ళు-పొద్దుపోయింది.

పిల్లలు ప్రార్థనచేసి పడుకుంటారు. వెళ్ళి వాళ్ళని పడుకోబెట్టాలి. నేనూ, ఎలిజబెత్ వెళ్ళి రామా మరి!

ఏబీ — వద్దు. నేనూ వచ్చి వాళ్ళతో ప్రార్థనచేస్తాను.

నిని — వద్దు. నువ్వొచ్చావంటే నీకథలకి వాళ్ళు నిదరపోరు. ఎలిజబెత్ వెళ్దామా?

(ఎలిజబెత్‌కు వెళ్ళడం సుతరామూ అంగీకారం కాకపోయినా, ఆగిపోవడానికి కారణం కనబడదు.)

ఏబీ — (ఎలిజబెత్‌తో) పిల్లలకి నాముద్దులని చెప్పండి.

నిని — నువ్విక్కడ వున్నావని తెలిస్తే వాళ్ళూరుకుంటారా?

ఎలి — (ఆఖరిప్రయత్నం చేస్తుంది.) మేరీ! నువ్వు మాతో వచ్చి పిల్లల్ని నిదరించవా?

నిని — వద్దు. మేరీ నిక్కడే వుండమను—ఏబీకి కాలక్షేపానికి.

(ఎలిజబెత్‌ను వెంటబెట్టుకుని వెళ్ళిపోతాడు.)

మేరీ — (చిరునవ్వుతో) నినియన్ పిల్లల్ని చూడకుండా చేసినందుకు అతణ్ణి మెచ్చుకుంటున్నాను. మీరంటే వాళ్ళకి ప్రాణం.

ఏబీ — పిల్లలందరికీ నేనంటే యెందుకో తెలియదు చాలా యిష్టం. బహుశా నామాటలన్నీ వాళ్ళకి వేళాకోళంగా వుంటాయికాబోలు.

మేరీ — అదికాదు - వాళ్ళని మీరుబాగా అర్థంచేసుకుంటారు. అదేగదా వాళ్ళకి కావాల్సింది ... కూచోండి లింకన్. (మేరీ తనపక్కనే కూచోమన్నట్టు చూస్తుంది)

ఏబీ — అలాగే కూచుంటాను.

(మేరీ పక్కగా కూచోడానికి మంచంవైపు వెళతాడు. అతనివంక ముగ్ధురాలై చూస్తూంటుంది.)

అయిదవ రంగం సమాప్తం

## అరవ రంగం

(సుల్ఫీ లా ఆఫీసు గది. క్రిందటి సన్నివేశం జరిగిన కొన్ని వారాలకు. ఆకోటూ సంవత్సరాది. మధ్యాహ్నపు వేళ.

ఏబీ బల్లవంక తదేక దీక్షగా చూస్తూ కుర్చీలో కుప్పగా కూలబడి వుంటాడు. తలమీద టోపీ, వంటిమీద ఓవర్‌కోటూ అలానే వుంటాయి. ముడివేయని మఫ్లరు మెడచుట్టూ వేలాడుతూంటుంది.

కుడివైపు బల్లమీద జోష్‌స్పీడు ఆనుకుని కూచునివుంటాడు. తదేక ధ్యానంగా వుత్తరాన్ని చదువుతూంటాడు. చదవడం పూర్తిచేసి, మడిచి, నేలవంక చూస్తూ వుండిపోతాడు.)

ఏబీ — జోష్! దాన్ని పూర్తిగా చదివేవా?

జోష్ — ఆ!

ఏబీ — అయితే—బాగానే వుందంటావా!

జోష్ — లేదు ఏబీ — సరిగాలేదు. (ఏబీ నెమ్మదిగా తిరిగి అతన్ని చూస్తాడు.) ఈ వుత్తరం రాయడమంత గొప్ప పొరపాటు మరేంలేదు — నేనింకా దయదల్చి చిన్ని మాటల్లో చెపుతున్నాను.

ఏబీ — మోటుగా రాశానా?

(ఏబీ ఎంత మామూలు ధోరణిలో మాట్లాడుదామని ప్రయత్నిస్తున్నా అతను విచారంతో కుంగిపోతున్నాడని తెలిపోతూంటుంది. మానసిక ఆవేదనవల్ల కుప్పలా కూలిపోయేస్థితిలో వున్నా యెలా అయినా ధైర్యం చిక్కబట్టుకోవాలని యత్నిస్తూంటాడు.)

జోష్ — నీ మాటలతో నాకేమీ పేచీలేదు. నీ భాషకూడా చాలా బాగా వుందనే చెప్పాలి. ఏబీ! కాని, నువ్వు చేస్తున్న యీపని యెంత క్రూరమైందో, నీకు తగనిదో

తెలుసా? నీలాటివా డిలాటిపనికి యెలా పూనుకున్నావో సని అర్థం చేసుకోలేకపోతున్నాను.

ఏబీ — ఇదివరలో మనసారా ప్రేమించిన స్త్రీనికూడా యిలాగే చేశాను. ఆమె నాపనిని ఆక్షేపించలేదు.

జోష్ — ఈవిడ వేరే వ్యక్తి. (కిటికీదగ్గిరికి నడచి, ఏబీవంకకు తిరిగి) మన మెలాటివారమో, మనలో యెన్నిరకాల మన స్తత్వాలున్నాయో, స్త్రీలకుకూడా అలాటి భేధాలే వుంటాయనీ, వారూ మనలాటి వారేననీ నీవెందు కంగీకరించవు? ఆడవాళ్ళందరూ వొకలాగే వుంటారనికదూ నీ అభిప్రాయం—ఆమె మాత్రం నీ దృష్టిలో ప్రత్యేకమైన వ్యక్తి, దేవకన్య అని నీవుద్దేశ్యం. నువ్వురాసిన వుత్తరం నీకు నువ్వు రాసుకుందిగాని మేరీకోసం రాసింది కాదు. ప్రతీ అక్షరం నీమనస్సాక్షికి చెప్పుకున్న వొకపాఠం.

ఏబీ — (నెమ్మదిగా లేచి) అయితే యీ వుత్తరాన్ని నువ్వు పట్టుకెళ్ళి యివ్వనంటావు?

జోష్ — ఇవ్వను ఏబీ — నేనివ్వదల్చుకోలేదు.

ఏబీ — (కోపంగా) పోనీ యింకోరు పట్టుకు వెళతారులే!

జోష్ — (వెటకారంగా చిరాకులతో) పెళ్ళిచేయడానికి పూజారి వస్తాడుగా, అప్పుడతని చేతికిచ్చి పెళ్ళికూతురి కీయమని చెపుదువుగానిలే! కాని...ఏబీ, కొంచెం మనసు శాంతించే వరకీ వుత్తరాన్ని పంపకుండావుంటే మంచిదని నావూహ.

ఏబీ — (జోష్వైపుతిరిగి వుద్రేకంగా) ఈగొడవ అటోయిటో వొక్కసారిగా తేలిపోతేతప్పు, నెత్తిమీద కుంపటిలాయిది నన్ను బాధిస్తూంటే నాకు శాంతెలాలభిస్తుందనుకున్నావు?

నీకు కళ్ళులేవా, జోష్? నాకికేదీ గత్యంతరం లేదని నీకర్థం కావడంలేదా ?

జో.ష్ — ఎబీ! నావిషయం స్పష్టంగానే తెలుస్తూంది. నువ్వూహించే వానికన్నా నీపరిస్థితి విషమించింది. తెలివైన వైద్యుడి సలహా తీసుకుంటే మంచిదని నాపుద్దేశ్యం.

ఏబీ — (బిల్లీ టేబిలు దగ్గిర కూచుని) ఏవైద్యుడూ బాగుచేసే జబ్బు కాదునాది.

జో.ష్ — డాక్టరు డ్రేక్ అనే మంచి వాడొకాయన నీలాటి వాళ్ళకి వైద్యంచేయడమే వృత్తిగా పెట్టుకున్నాడు ఏబీ...

ఏబీ — (బాగాదిగులుగా) అయితే యిలా అర్థంచేసుకున్నావన్నమాట! ఎన్నోసార్లు చేద్దామనుకున్నవన్నీ యిప్పుడు చేసేశాను. నాకు మతిపోయింది. జోష్ - చాలామంది కన్నా నీకు నన్ను బాగా తెలుసును. చాలా వరకు నువ్వు నిజానికి దగ్గిరిగానే వున్నావ్. నాకు మతిపోయింది. నా బతుకు ఆఖరై పోయే రోజులు సమీపించాయి. తెగిపోయే దీన్ని పట్టుకు వేళ్లాడలేను. ఎప్పుడో వొకప్పు డిది తెగిపోక తప్పదు. ఎక్కడో, ఎప్పుడో చెప్పలేను దారం తెగి నేల మీద వొరగడం. దీన్నించి తప్పించగలనేమోకూడా చెప్పలేను. కాని వొకసంగతి—ఎలా అయినా యిందు లోంచి బయటపడాలి — దీ న్నిక సహించలేను—స్వేచ్ఛా వాయువుల్ని పీల్చితీరాలి!

(కిటికీవైపునున్న జోష్ గబుక్కున ఏబీవైపు తిరిగి.)

జో.ష్ — నినియన్ యెడ్వర్డ్సు వస్తున్నాడు. ఈవుత్తరం అతనికి చూపించి సలహాఅడిగి తేనో ...

ఏబీ — (విచారంగా అతన్ని ఆపి) లేదు - లేదు - ఈవిషయమై వాక్కు-ముక్కు-కూడా అతనికి చెప్పవద్దు! ఆ వృత్తాన్ని జేబులో పెట్టుకో. ప్రస్తుత మీావిషయమతనితో చర్చించడాన్ని భరించలేను.

(జోష్ వృత్తాన్ని జేబులో పెట్టుకుని మంచందగ్గిరికి వెళతాడు.)

జోష్ — నినియన్! బాగున్నావా?

నిని — (దూరాన్నించే సంతోషంగా) జోష్! నూతనవత్సరాదికి శుభాకాంక్షలందుకో!

(నినియన్ ప్రవేశిస్తాడు. మృగపుబొచ్చుతో చేసిన అందమైన కోటు వేసుకుంటాడు. చేతిలో రెండు వెండిపొన్నుకర్రలుంటాయి. ఒక కర్రని సంచిలో పెట్టి బల్లమీద పెడతాడు.)

నిని — ఏబీ నీజీవితానికంతటికీ శుభప్రదమైన నూతనవత్సరాదికివే నా శుభాకాంక్షలు!

ఏబీ — నినియన్! ధన్యుణ్ణి. నీకుకూడా యివే నాశుభాకాంక్షలు.

నిని — (కోటుతీస్తూ) మనసులోంచి వచ్చిన మాటల్లాలేవు. (చలిమంటదగ్గిరికివెళ్ళి చేతులువెచ్చచేసుకుంటాడు.) ఏబీ! నిన్నీరోజు క్షమించేశాను. భయపడుతున్నట్టున్నావేమిటి? (నవ్వి, జోష్‌వంక చూస్తాడు) అబ్బా — చాలా చలిగా వుందిక్కడ! ఈపొయ్యి అంటించరా ఎప్పుడూ?

ఏబీ — చలిమంట మండుతూనేవుంది. కావాలంటే దాన్ని కూడా అంటించు.

నిని — (అగ్గిపుల్ల అంటించి) ఈవేళ సరదాగాలేవు.

(స్టవ్ అంటిస్తాడు.)

జోష్ — ఏబీ కొంచెం నిరుత్సాహంగానే వున్నాడు.

ని ని — అలాగేవుంది చూస్తూంటే. ఏదో, ఎవర్నో పోగొట్టు కున్నవాడిలావుంది ముఖం.

ఏ బీ — చనిపోయినవాళ్ల దగ్గిరకే వెళ్లివచ్చాను.

ని ని — (అపనమ్మకంగా) ఏమిటీ! పెళ్ళినాడు చావుదగ్గిరికి వెళ్లావా?

జోష్ — ఏబీ చిరకాలమిత్రుడు బాలింగ్‌గ్రీన్ పొద్దుటే పోయాడు.

ని ని — (ఆశ్చర్యపోయి) ఏబీ! విషయం తెలుసుకోకుండా నిన్ను వేళాకోళం చేసినందు కేమీ అనుకోకు. పాపం!

ఏ బీ — నినియన్! అతనిక లేడు పాపం.

ని ని — ఖనన సంస్కారానికి నువ్వు దగ్గిరే వుండడంవల్ల వాళ్ళ కుటుంబంవాళ్ళ కొకవిధమైన ఆసరాలా వుండి వుంటుంది. మంచిపని చేశావు అక్కడికి వెళ్ళి, ఏబీ.

ఏ బీ — నావల్ల యెవరికీ మనశ్శాంతి కలగదు. అతన్నిగురించి రెండు ముక్కలు మాట్లాడమని అడిగారు. ఎంత ప్రయత్నించినా నోరు పెగల్లేదు. చనిపోయినవాణ్ణి గురించి యింద్రుడనీ, చంద్రుడనీ పెద్దపెద్ద మాటలతో యెందుకు పొగడమని కోరుతారో వూహించలేను. పోయినవాడి ఆత్మశాంతి కీ వుపన్యాసా లవసరమా? చాలామంచివాడు— న్యాయం వుంది— నేనంటే ప్రాణం పైగా. నాకా్కవలసిందంతే!

ని ని — ఏబీ! ఈ మాటలే చెప్పలేకపోయావా?

ఏ బీ — (నిలబడి) వాళ్ళకి కావల్సింది......మాటలుకావు- వుపన్యాసం.

నిని— హాయిగా నువ్వూ మేరీవంటివాళ్ళు పెళ్ళిచేసుకు సుఖంగా వుండదల్చుకున్నారు. బాలింగే బతికుంటే 'యిలాంటి శుభసమయంలో నాకోసం విచారించవద్దని' చెప్పి వుండేవాడు. (పెళ్ళికబుర్లు చెప్పి సరదాపుట్టించాలని యత్నం చేస్తాడు.) పెళ్ళి యేర్పాట్లన్నీ అయిపోయాయి. పూజారి '(డెస్సర్' గారి కీవిషయం చెప్పాను. వచ్చే జనానికి విందుచేసే హాడావిడిలో పడివుంది ఎలిజబెత్. పెళ్ళి గొడవలేకుండా హాయిగా అయిపోతుంది. నీకేవిషయంలోనూ బెంగలేదు.

(బిల్లీ హెర్నడన్ వస్తాడు. బాగా తాగివున్నాడు, కాని మాటలు చురుగ్గా బాగానేవస్తున్నాయి. జేబులో సీసాకనబడుతూ వుంటుంది.)

బిల్లీ — మీరుకూడా అందుకోండి నాశుభాకాంక్షలు (సీసా బల్లమీద పెట్టి కోటు తీస్తాడు.)

నిని — ఏబీ! నీకు మంచి పెళ్ళికానుక తెచ్చానోయ్. మీ ఆవిణ్ణి వెంటబెట్టుకుని బయటికి వెళ్ళేప్పుడు నువ్వు దర్జాగా కనబడాలని యీ బెత్తం తెచ్చాను. (కర్ర ఏబీకి అందిస్తాడు. ఏబీ, దాన్ని దీక్షగా చూస్తూంటాడు.)

ఏబీ — నినియన్! చాలా బాగుంది దిది. (అది పట్టుకునివెళ్ళి తన బల్లదగ్గిర కూచుంటాడు.)

నిని — మేరీ నువ్వు అందంగా వుండాలని కోరుతుందోయ్. అందుకే నేనిది నీకుతెచ్చాను. జోష్! బిల్లీ! మీరేమీ అనుకోనంటే నేను స్వవిషయం కొంత మాట్లాడుతాను.

బిల్లీ — సంతోషంగా వెళతా నవతలకి...

నిని — వెళ్ళవద్దు బిల్లీ. ఏబీ స్నేహితుడిలానే మాట్లాడు

తాను. మళ్ళీ మాట్లాడడానికి టైము దొరకదు. రెండు ముక్కలిప్పుడే చెప్పదల్చుకున్నాను. పెళ్ళికూతురు నా మరదలు. అందుకని మీరు సుఖంగా వుండాలంటే నేను కూడా కొంత బాధ్యత వహించాలి. (ఏబీ దగ్గిరికి వస్తాడు.) ఏబీ! ఆవిడ కోర్కెలనే గుర్రాలకి కళ్ళెం తగిలించగలిగావో జయం పొందావన్నమాటే. (జోష్ వైపు తిరిగి) "చిన్నప్పటినించీ, నేను పెళ్ళిచేసుకునేవాడెవరైనా సరే యునైటెడ్ స్టేట్సు ప్రసిడెంటు కావాల్సిందే!" అంటూండేదని నాభార్య చెపుతుంది. పెళ్ళికావల్సిన కన్యలందరూ తమభర్తలు గొప్పవాళ్ళు కావాలని ఆశించడం సహజమేను. (మళ్ళీ ఏబీవంక తిరిగి) కాని, మేరీ యీనాటికీ ఆ కలలు కంటూనేవుంది. అందని మానిపళ్ళు కర్రలు జాచమనీ, స్వర్గాని కెగరమనీ నిన్ను ప్రోత్సహించినా నువ్వు మాత్రం జాగర్తగా వుండు. భగవంతుడేనాటికేది ప్రాప్తిచేస్తాడో దానితోనే తృప్తిపడమని చెప్పా. నాసలహా అయిపోయింది. (కోటు గుండీలు పెట్టుకుంటూ) సరిగ్గా 5 గం॥ లకు కల్సుకుందాం. అందంగా తయారయ్యి రావోయ్ యేబీ!

జోష్ — నినియన్! నేను వుంటానిక.

(నినియన్ వెళ్లిపోతాడు. ఏబీ డెస్కువైపు తిరిగి శూన్యంలోకి దృష్టి ప్రసరిస్తాడు. బిల్లీ సీసావిప్పి కప్పులో పోసుకుంటాడు మళ్లీ కొంచెం గొంతుకు తడిచేసుకుందామని. తాగేముందు కప్పు ఎత్తి ఏబీవంక చూపుతాడు.)

బిల్లీ — (బొంగురుగా) లింకన్‌గారూ! మీ ఆయురారోగ్యాల కోసం ప్రార్థిస్తూదీన్ని... మీకు కాబోయే ఆమెకోసం

కూడాదీన్ని తాగుతున్నాను. (ఏబీ యేమీ పలకడు. బిల్లీ దాన్ని తాగేసి కప్పు బల్లమీద పెడతాడు.) నేను మనస్ఫూర్తిగా ప్రార్థించలేదనికదూ మీరు దాన్ని అంగీకరించలేదు? మీరు తీసుకున్న యీనిర్ణయం నాకిష్టంలేనిదని మీకు తెలిసింది. మీ వంశమర్యాద వున్నతం చేసుకోవాలని, మా గౌరవాన్ని కుదువపెట్టి మీ రీవివాహాని కంగీకరించి — మిమ్మల్ని మీరు చులకన జేసుకున్నారని అనుకున్నందుకు క్షమించండి...

ఏబీ — బిల్లీ! యిందులో క్షమించడాని కేముంది?

బిల్లీ — నేనూ, మేరీటాడ్‌గారూ స్నేహపూర్వకంగా వుండలేమని అనుకున్నాను. కాని నాదిపౌరపాటనీ, ఆవిడలక్ష్యం నాలక్ష్యం వొకటేననీ, అదే మీరు యూనియన్‌అధ్యక్షుడు కావడమని, ఆమెబావగారు చెప్పగా విని తెలుసుకున్నాను. (యినియన్‌అంటే వొకవిధమైన అసహ్యమున్నట్లు మాట్లాడుతాడు.) లక్ష్యసిద్ధికోసం ఆమె మిమ్మల్ని యెక్కడా ఆగకుండా హెచ్చరిస్తూ ముందుకు నడిపిస్తుంది. దైవం ఆమెకు మనోధైర్యంయివ్వాలని కోరుతున్నాను. (ఈ మాటలన్నీ ఏబీ వెనక్కితిరిగివుండగానే చెపుతూంటాడు. సీసాలో మిగిలినదికూడా పోసుకుని తాగుతాడు. ఏబీ తిరిగి అతన్ని చూస్తాడు.)

ఏబీ — ఆ సీసా అంతా యివాళ్లే కాళీఅయిందా?

బిల్లీ — ఈ సీసాయేనా? అవును, పూర్తిచేశాను.

జోష్ — ఈవేళ సంవత్సరాదికదా అందుకని తాగవచ్చును.

బిల్లీ — (జోష్‌వంక చూసి) స్నేహితుడుగారూ! మీరు నన్ను సమ

ర్థించినందుకు సంతోషం. వారి ఆరోగ్యంకోసం యింకో సారి ప్రార్థిస్తూ దీన్ని కూడా పుచ్చుకోడానికి అనుజ్ఞ ఈయండి. (ఏబీ వైపు వొక్క అడుగు వేసి.) యునైటెడ్ స్టేట్సు అధ్యక్షునికీ, అతని భార్యకీ! (తాగుతాడు.)

ఏబీ — (చిరాగ్గా) బిల్లీ! యికయింతటితో చాలించు.

బిల్లీ — అలాగే. పెళ్లి పూర్తిగా అయిపోయేవరకూ యిదే ఆఖరిది. పెళ్లి అయింతరువాత యెడ్వర్డ్సు వాళ్లయింట్లో మాంచిరకం 'షాంపెయిన్' యిస్తారనుకుంటున్నాను. మీరు నన్ను గురించేమీ బెంగపెట్టుకోవద్దు. మర్యాదగల దుస్తుల్లో వచ్చి మర్యాదగానే ప్రవర్తిస్తానులెండి మర్యాదస్తులందరిముందూ!

ఏబీ — పెళ్లి జరిగితేగా! (బిల్లీ నిశ్చేష్టుడై జోష్, ఏబీల వంక యిటూ అటూ తెల్లబోయి చూస్తూంటాడు.) మేరీటాడ్‌కి తీసుకువెళ్ళవల్సిన వుత్తరం వొకటి వుంది.

బిల్లీ — ఏమిటది! వుత్తరమా?

ఏబీ — జోష్! దాన్ని యితని చేతికియ్యి. (జోష్ జేబులోని వుత్తరం తీసి మంటలో విసిరేస్తాడు. ఏబీ యెగిరి గెంతుతాడు.) నీకలా చేయడానికేం హక్కువుంది?

జోష్ — నాకేమీ హక్కులేదని తెలుసు. చేసేశాను. (ఏబీ జోష్ వంక నిశ్చలంగా చూస్తాడు.) నాపీక నొక్కిచంపాలన్నట్టు అలాచూడక. ఏబీ! కావాలంటే ఆ పనీ చెయ్యగలవు కాని చేయలేవు. (జోష్ బిల్లీవైపు తిరిగి.) లింకన్ ఆవుత్తరాన్ని మేరీకిరాస్తూ, తనకి స్వేచ్ఛనీయమనీ, యిదివరలో పొరపాటున ఆమెని ప్రేమించినట్టు

చెప్పాననీ, యిప్పుడు పెళ్ళి జరిగిపోతే యిద్దరికీ అంతు లేనిబాధ కలుగుతుందనీ రాశాడు.

ఏ బీ — (విచారంగా) ఇది సత్యంకాదా? కాకపోతే యేదినిజం?

జోష్ — నిజానిజాల సంగతి నేనువాదించడంలేదు. మగవాడి విలా ఆమె యెదురుగావెళ్ళి వున్నవిషయం చెప్పమని అంటున్నాను అంతే.

ఏ బీ — ఇదింకా బాధ కలిగించేమార్గం. దీనిమూలంగా ఆమె యింకా నొచ్చుకుంటుంది. వుత్తరంలో రాయకుండా వున్న భయంకరమైన విషయాలన్నీ ఆమె యెదురుగా వెళితే బయటికి వెళ్ళగక్క లేకుండా వుండలేను. (ఆవేశంగా) ఆమె లక్ష్యసిద్ధికోసం, అర్థంలేని ఆశలకోసం ఆవిడ అడుగుజాడల్లో నడుస్తూ, కీలుబొమ్మలా వుండడానికి నేనంగీకరించలేను. జీవితానికి పరమావధి వున్నతాధికారం పొందడమే అయితే వెళ్లి స్టీవెన్ డగ్లస్‌నే పెళ్లిచేసుకోమని చెపుతాను. అతడికెన్నో కోర్కెలున్నాయి. నాపుణ్యానికి నన్ను వొంటరిగా వదిలి పెట్టెయ్యండి. (కూచుని, టేబిలు కానుకొంటాడు.)

జోష్ — (నిస్పృహగా) అయితే మంచిదే. ఆమెదగ్గిరికి వెళ్ళి యీవిషయాలే స్వయంగా చెప్పు. ఆమెకుభయపడి పెళ్ళి మానుకున్నాననడం, పొరపాటున ప్రేమించానని చెప్పేననడంకన్న కొంత మర్యాదగా వుంది.

(బిల్లీ యెలాఅయినా యీసంభాషణలో పాల్గొనాలని ఆత్రంగా వుంటాడు)

బిల్లీ — నేనొక విషయం చెపుతాను వింటారా?

ఏ బీ — నీమాటలు వినదగ్గ పరిస్థితుల్లో వున్నానా అని సందేహం.

జోష్ — ఏమిటా కబురు, బిల్లీ !

బిల్లీ — (తీవ్రంగా) ఏంలేదు. లింకన్‌గారూ! మీరు మేరీని పరిత్యజించడంలేదు. అది నిజం కాదు. మానవుడుగా మీరు నెరవేర్చవల్సిన ధర్మాన్ని నెరవేర్చలేక, అప జయాన్ని పొంది, దైవోపహతులు గాకుండా వుండడాని కని మేరీటాడ్ నిండుజీవితాన్ని బలిదానం చేస్తున్నా రంటేను !

ఏ బీ — (చిరాగ్గా) అవును, విద్యుక్తధర్మం మీద కదూ మాట్లాడుతున్నావు? అందరూ దాన్నిగురించి మాట్లాడే వాళ్ళే! యేది నావిద్యుక్తధర్మమో చెప్పేవాళ్ళు మాత్రం యెవళ్ళూలేరు.

బిల్లీ — (కళ్లు చెమ్మగిల్లగా) నేను చెపుతాను వినండి. అమెరి కన్ పౌరు డనుకునే ప్రతివ్యక్తి ధర్మమేమిటో చెపుతాను ! సర్వవిదితాలైన కొన్నిసత్యాల్ని కాపాడ్డమే ఆ ధర్మం - అవేమిటంటారా, వినండి — మానవులందరూ సోదరులు — ప్రతీవ్యక్తికీ కొన్ని హక్కులున్నాయి—వాటిలో ముఖ్య మైనవి, ఆనందంగా స్వేచ్ఛగా జీవించడాని కందరికీ సమాన మైనహక్కు వుంది.

ఏ బీ — (కోపంతో) ఈహక్కులనీ నాకులేకుండా పోయాయా ?

బిల్లీ — నీతోటి మానవులు రెండుమిలియన్లమంది దాస్యంలో మగ్గుతూంటే నీ వీహక్కులన్నింటినీ అనుభవిస్తూ కూచుం టావా ? అదిగో నీయెదురుగా పదినక్షత్రాలతో మెరు

స్తున్న మనయూనియన్ జండా. ఆ పదినక్షత్రాల్నీ గుర్తుగా పెట్టుకొన్న పదిరాష్ట్రాలవాళ్ళూ, కోటిమానవుల రక్త మాంసాలతో వ్యాపారంచేస్తూ, ఆబానిసత్వాన్ని మానే కన్నా యూనియన్‌లోంచి వేరుపడతామనే ఘోష వింటూ నేటఆనందంగానీజాతిజండాన్ని చూడగలవా? మిగిలిన రాష్ట్రాలభవిష్యత్తేమిటి? పసిఫిక్ మహాసముద్రపర్యంతం విస్తరించివున్న పడమటిరాజ్యాల గతేమిటి? ఈ దేశమంతా స్వేచ్ఛాజీవులకు తావిస్తుందా? నీ మనఃతృప్తికైనా దీనికి సమాధానం దొరికిందా నీకు? అదిగో, నీజాతీయజండా. లింకన్! దాన్ని గర్వంగా చూస్తున్నావు. అది నేడు ముక్కముక్కలై నాశనమైపోడానికి సిద్ధంగావుంటే దాన్ని రక్షించడాని కేంచేస్తున్నావు నువ్వు?

(ఏబీ గొంతిలేచి బిల్లీదగ్గిరే నిలబడి, కోపాన్ని దిగమింగుతూ ఆవేశంగా)

ఏబీ — నేనేంచేస్తున్నానా! నాపని నేనుచూచుకుంటున్నాను. మిగిలినవాళ్లుకూడా యెవరిపనివాళ్ళు చేసుకుంటే యూని యన్ కేవిధమైన ఆపదా రాదు — ఇకచాలు — బాని సత్వాన్నిగురించి వుపన్యాసాలు వినలేకుండా వున్నాను. నువ్వు చెప్పే ఆస్తిహక్కుల్ని గురించి అంటావా, మన రాజ్యాంగచట్టం ప్రజలకాహక్కుల్నియిచ్చింది. రాజ్యాంగ చట్టప్రకారం యూనియన్ నడవదా, నాశనం కానీ!

బిల్లీ — రాజ్యాంగచట్టం నాశనమైపోవాలి! రాజ్యాంగా లంటూ యేర్పడకముందే స్వతంత్రపిపాస మానవుల కేర్పడింది! చట్టం యీస్వాతంత్ర్యాన్ని ప్రజలకీయకపోతే

అది చట్టంతప్పు. దాన్ని మార్చాలి. న్యాయంగా దాన్ని మార్చడానికి వీల్లేకపోతే బలవంతంగా శక్తిచేతనైనా మార్చితీరాలి. స్వాతంత్ర్యరక్షణకై యేంచేసినా తప్పు గాదు! ఈవిషయం ప్రపంచంలో యెవరికీ తెలియనంత బాగా నీకు తెలుసు. లింకన్! 'లౌజాయ్' మొదలైన స్వాతంత్ర్యయోధుల్ని గౌరవించేవాళ్లలో నీవొకడవని మరిచిపోవద్దు!

ఏబీ — (అతన్నించి దూరంగా వెళ్లి) ఆ త్యాగమయులందర్నీ గౌరవిస్తాను - వారిప్రతిభనుచూసి అసహనంకూడా కలుగుతూంది. తామునమ్మిన సత్యానికై బలిదానంకాగల వున్న తత్వం వారిలోవుంది. (జోష్‌వైపు తిరిగి, ఎంతోనీరసంగా) జోష్! నీ సలహాప్రకారం మేరీవద్దకువెళ్లి విషయం చెప్పిం తరువాతనే యీవూరు వదిలివెళ్లి పోతాను...

జోష్ — ఏబీ! యెక్కడికి?

ఏబీ — (నెమ్మదిగా) నాకే తెలియదు.

(బయటకు వెళ్ళిపోయి తలుపులు వేస్తాడు. ఒక్క క్షణం ఆగి బిల్లీ తలుపుదగ్గిరకు పరుగెత్తి ఏబీని ఎలుగెత్తి పిలుస్తాడు.)

బిల్లీ — లింకన్! పారిపోతున్నావా? నువ్వు-పారిపోతున్నది నీబాధ్యతనించీ, నీతోటి మానవులనించీ, నీఆత్మనించీనని భగవంతుడికి తెలుసు.

జోష్ — (బిల్లీని గుమ్మంలోంచి యివతలకిలాగి.) బిల్లీ! అతడు జబ్బుమనిషి. వొంటరిగా వదలవద్దు యెప్పుడూ.

బిల్లీ — (టేబిలుమీదకూచుని) స్పీడ్ అతడికోసం యేంచేద్దాం! అతన్నేంచేద్దామో చెప్పండి? (ఏడుస్తాడు)

జోష్ – నాకేమీ తెలియడంలేదు, బిల్లీ (కిటికీదగ్గిరికి వెళ్ళి బయటికి చూస్తూంటాడు.) మనసులో చెలరేగుతున్న అంతర్యుద్ధంవల్ల జనానికి దూరంగాపోయి వొంటరిగా వుండాలని కోరుతున్నాడు. ఇదివరలో 'ఏన్‌రబ్లెడ్జి' పోయి నప్పుడుకూడా యిలానే అయిపోయాడు. అడవుల్లోకిపోయి, అక్కడంతా తిరిగి తిరిగి మళ్లీ మానవుల బాటలకి చేర తాడు. అతడంత అతడే మనసు మార్చుకోవాలి.

బిల్లీ – ( ఆప్యాయతతో ) భగవంతు డతన్ని కాపాడాలి!

ఆరవ రంగం సమాప్తం

---

## ఏ డ వ ర ం గ ం

(న్యూ సేలమ్ దగ్గిరేవున్న ప్రయరీమైదానంలో చల్లగా వెన్నెల రాత్రి. కిందటిరంగం జరిగిన రెండు సంవత్సరాల తరువాత. రంగం ముందు చలిమంట. దానిచుట్టూ పేకేజీపెట్టెలూ, పరుపుచుట్టలూ, పాతట్రంకుపెట్టెలూ వుంటాయి. రంగం వెనకభాగంలో వొక పెద్దగూడు వున్న 'పెట్టిబండి' వుంది.

చలిమంటదగ్గిరే తన యేడేళ్ళకొడుకు నెత్తుకుని సేత్ గేల్ నిలబడి వుంటాడు. కుర్రాడి వొంటిమీద కంబళి కప్పివుంటుంది.)

జిమ్మీ – నాన్నా! నావొళ్ళుమండిపోతూంది. కంబళితీసేయి. మంటదగ్గిర నిలబడక నాన్నా!

సేత్ – వద్దు నాయనా! కప్పుకుని వుంటేనే బాగుంటుంది.

జిమ్మీ – నాన్నా! దాహంగా వుంది, కొంచెం మంచినీళ్ళు తాగనా?

సేత్ – అలాగే తాగుదువుగాని బాబూ. 'గోబీ' నీళ్ళు

తెస్తున్నాడు. (కుడివైపు చూస్తాడు: జాక్ ఆర్మ్‌స్ట్రాంగ్ వస్తూంటాడు) జాక్! దారి తప్పిపోయావనుకున్నాను, వచ్చావా?

జాక్ — (వస్తూనే) న్యూసేలం చుట్టుపక్కల యేం జరిగినా దారితప్పను. అబ్బాయి యెలావున్నాడు?

సేత్ — (జాక్ వంక అనుమానపడుతున్నట్టు చూసి) కొద్దిగా దాహం యెక్కువగా వుంది......ఏబీ కనబడ్డాడా?

జాక్ — చాలా దూరం వెళ్ళిపోయాడు. అందుకని వెదికి తీసుకురావడం ఆలస్యమైంది. నది దాటి 'ఏన్‌రట్లెడ్జ్' సమాధి దగ్గిరికి వెళ్ళాడు.

సేత్ — ఇక్కడికి వస్తున్నాడా?

జాక్ — లించెష్టర్ రోడ్డుకు వెళ్ళి డాక్టరు చాండ్లర్ని తీసుకు చక్కావస్తానన్నాడు. బహుశా, వచ్చేస్తూనే వుంటాడు. (జిమ్మీని సమీపించి) యెలావున్నావు అబ్బాయీ?

జిమ్మీ — నావొళ్ళు కాలిపోతూంది.

(ఏగీ వచ్చి జాన్‌ని చూస్తుంది)

ఏగీ — ఆర్మ్‌స్ట్రాంగ్! మీరు మళ్ళీ వచ్చినందుకు చాలా సంతోషం!

జాక్ — డాక్టరు త్వరలోనే వస్తున్నాడమ్మా!

ఏగీ — ఏం చేయగలం! అంతా ఆ సర్వేశ్వరుడి దయ! పక్క వేసి మెత్తగా చేశాను. బండి లోపలికి తీసుకు రండి.

సేత్ — జిమ్మీ! అమ్మమాట విన్నావా? చక్కగా పక్క వేసిందట. వెళ్ళి పడుకో బాబూ!

(ఏగీ బండిలోకి వెళ్ళిపోతుంది)

జిమ్మీ — గోబీ యింకెప్పుడు వస్తాడు? నాకుదాహం వేసేస్తుంది. నీళ్ళింకా యెప్పుడు తెస్తాడు?

సేత్ — నీళ్ళిప్పుడే తెస్తాడు నాయనా. గోబీ యెంతోమంచివాడుకదూ! నీకు నీళ్ళు తెస్తాడు. (జిమ్మీని బండిలోకి అందిస్తాడు.)

జాక్ — కొంచెం హెచ్చినట్టుందిగదూ?

సేత్ — (విచారంగా) అవును. మీరు వెళ్ళినదగ్గిర్నించీ జ్వరం పీల్చేస్తుంది. ఏబీ వస్తే బాగుండును. అతన్లో యేం శక్తి వుందో తెలియదుగాని వచ్చాడంటే యెంతో మనోనిబ్బరం వస్తుంది.

జాక్ — సేత్! నువ్వు యేబీనిచూసి యెంతకాలమైంది?

సేత్ — అతను నాకంటికగపడి షుమారు ఎనిమిది సంవత్సరాలైనా అయి వుంటుంది. ఏదో కొన్నేళ్ళు వుత్తరాలు రాసుకుంటూ వుండేవాళ్ళం.

జాక్ — నువ్విప్పు డతణ్ణి చూస్తే ఆశ్చర్యపోతావు. (స్ప్రింగుఫీల్డు వదిలిపెట్టాక చాలామారిపోయాడులే. మంచి పేరూ గౌరవం సంపాయించుకున్నాడు. పాపం! ఈమధ్య యేదో కొంచెం వొకమాదిరిగా అయిపోయాడని అంటున్నారు. ఎప్పుడూ నవ్వుతూ వేళకోళాలు చేస్తూండే ఏబీ కాదు మనం చూడబోయేది.

సేత్ — మనమందరం మారుతూనే వుంటాం. (గోబీ వస్తూన్నట్టలికిడై లేచి నిలబడతాడు.) ఏగీ! (ఎడంవైపు నించి గోబీ నీళ్ళబాల్చీతో ప్రవేశిస్తాడు. పెట్టెబండిలోంచి ఏగీ యువతలికి వస్తుంది.) గోబీ నీళ్ళు తెచ్చాడు!

గో|బీ — అమ్మగారూ! నీళ్ళివిగోనండమ్మా. (బాల్చీ అందిస్తాడు.)

వ గీ — ఇలాయివ్వుగోబీ. (నీళ్లందుకుని బండిలోకివెళ్లిపోతుంది.)

గో బీ — జిమ్మీబాబుకి యెలావుందండీ అయ్యగారూ?

సేత్ — అలాగే వున్నాడు.

గో బీ — (తలవూపి) నేను వెళ్ళి వంటకి నీళ్ళు తెస్తాను. (కుంచ వొక చేత్తో, కెటిల్ వొక చేత్తో పట్టుకు వెళ్ళిపోతాడు.)

సేత్ — (జాక్ తో) ఈ ప్రయాణంలో కుర్రాడి కిలా జబ్బు చెయ్యడం మా దురదృష్టం. దగ్గిరిలో డాక్టరులేడు. ఏవిధ మైన వుపశాంతీ చెయ్యడానికి వీల్లేకుండా వుంది.

జాక్ — ఎన్నాళ్ళనించీ ప్రయాణం చేస్తూన్నారు సేత్?

సేత్ — మూడు నెలలు దాటిపోయింది మేం బయలుదేరి. ఓరున వర్షాలు కొన్నాళ్ళు. అన్ని యేర్లూ పొంగి పోయాయి. పెన్సిల్వేనియా కొండల్లో ప్రయాణం సాగ లేదు. ఎన్నిసార్లో అనుకున్నాం వెనక్కి మళ్ళిపోదామని అంతా మానుకుని. ఒక్కసారి ముందడుగు పడిం తరు వాత వెనక్కి తిరగలేం! (కుడివైపు చూస్తాడు.) చూడు! ఆవస్తున్నది ఏబీ కదూ?

జాక్ — (నిలబడి) అవును అతనే!

సేత్ — (సంతోషంగా అటే చూస్తూంటాడు) ఎంత చిత్రం! ఇదివరకటి టోపీ, ఆ పాతగుడ్డలతోనే వస్తున్నాడు. హాయ్ ఏబీ!

ఏబీ — సేత్! (వచ్చి సేత్ తో కరస్పర్శచేస్తాడు.) ఇన్నాళ్ళకి కనబడ్డావు సేత్! ఎంతో ఆనందంగా వుంది.

సేత్ — ఏబీ! నాకెంత యిదిగా వుందో యెలా చెప్పను మాటల్లో.

ఏబీ — నువ్వు పడమటకి వెళుతున్నావంటే యెంతో సంతోష పడ్డాను. నీ కొడు కెక్కడ?

సేత్ — అదుగో! ఆబండిలోవున్నాడు.

(ఏగీ బండిలోంచి యివతలికి వస్తుంది.)

ఏగీ — డాక్టరు వచ్చారా?

సేత్ — ఏగీ! ఎప్పటినుంచో చూడా లనుకుంటున్న నా స్నేహితుడితనే! పేరు ఏబీ లింకన్. ఏబీ! ఇదిగో నాభార్య.

ఏబీ — మిమ్మల్ని కలుసుకున్నందుకు నాకు చాలా ఆనందంగా వుందమ్మా!

ఏగీ — మీరు రావడం మాకు చాలా సంతోషం.

ఏబి — డాక్టరు 'చాండ్లర్' యింట్లో లేడు. చీకటిపడే వేళకి 'బోగర్' వ్యవసాయ క్షేత్రానికి వస్తాడన్నారు! నేను అక్కడికివెళ్లి వెంటబెట్టుకుని తీసుకువస్తాను.

సేత్ — ఏబీ! తప్పకుండా అలాచెయ్యి.

ఏగీ — మీాకు పుణ్యముంటుంది అలాచేస్తే!

ఏబీ — ఈలోగా నావల్ల ఏమైనా అయితే చేస్తానమ్మా!

సేత్ — ఏబీ, నువ్వు చెయ్యడానికేముంది? కుర్రాడికి 'స్వేంప్' జ్వరం వచ్చింది. వాణ్ణి గొడవచెయ్యకుండా పట్టుకోలేక పోతున్నాం.

ఏగీ — (బాధగా) మీరు మాకు చేయగలిగిన సాయం వొకటే వుంది. ఈ దిక్కుమాలిన స్థలంలో ప్రార్థనచేయ డాని కెవరైనా పూజారి దొరుకుతాడా?

సేత్ — (విచారంగా) పూజారా ?

ఏబీ — జాక్ ! నీకెవరైనా తెలుసునా ?

జాక్ — న్యూసేలం చుట్టుపక్కల ఇరవై మైళ్ళవరకూ యెవరూలేరు.

ఏగీ — ఎవరైనా దొరుకుతారేమో పిలిచి జిమ్మీకోసం జపం చేయిద్దామనుకున్నాను (బండిలోనికి వెళ్ళిపోతుంది. ఆమె వెళ్ళిన వైపే సేత్ విచారంగా చూస్తూంటాడు.)

సేత్ — ప్రార్థన చేయిస్తానంటుంది. ఆశ వదలుకున్నట్టేగా !

జాక్ — మనశ్శాంతికోసంకూడా కావచ్చుగా ?

ఏబీ — సేత్, అబ్బాయికి చాలా హెచ్చుగా వుందా ?

సేత్ — అవును ! చాలా యెక్కువగానే వుంది.

జాక్ — ఏబీ ! నువ్వేప్రార్థనచేయకూడదూ ? చక్కగాచేస్తావు.

ఏబీ — నాకు ప్రార్థన చెయ్యడం యేమంత బాగారాదు. పైగా ఆమెకు మనశ్శాంతి కలిగేలా చెప్పలేనని భయం.

సేత్ — ఫరవాలేదు ఎలాచెప్పినా ఏబీ ! ఎదో ఏగీ మనో తృప్తి కిదంతా. రా, కూచో !

ఏబీ — (పెట్టిబండి వంక చూస్తూ.) సేత్ ! ఇన్నాళ్ళకి నీకల నిజం కాబోతుంది. మనమిద్దరం కలిసి యేం కలలు కన్నామో అవి నువ్వు నిజం చేసుకుంటున్నావు.

సేత్ — నిజమే ఏబీ ! మేరీలాండ్ జనంతో నిండిపోయింది. మా పొలం చుట్టుపక్కలంతా యిళ్ళయి పోయాయి. విశాలంగా వుండే స్థలంకోసం అన్వేషణ ఆరంభించాను. నీకు నాల్గు నెలలక్రితం మేమిలా బయలుదేరుతున్నామని, మాతోపాటు నిన్నూ రమ్మనీ రాశాను. నువ్వు కూడా మాతోపాటు వస్తావని ఎదురుచూశాను.

ఏబీ — సేత్ ! నీవు త్తరం నాకు చేరేప్పటికి చాలా కాలం పట్టింది. చిన్నప్పుడు నేనుంటూవుండే 'ఇండియానా' 'కెంటకీ' ల చుట్టుపక్కలే తిరుగుతూన్నాను. (పెట్టె మీద కూచుని) నువ్వు 'నెబ్రాస్కా' లో వుండిపోతావా ?

సేత్ — లేదు, అక్కడ ఆగం. చాలా దూరమే వెళ్ళాలనుకుంటున్నాం. ఈ దేశాలన్నీ దాటి 'ఆరిగన్' వెళ్ళాలనుకుంటున్నాం.

ఏబీ — (ఆశ్చర్యంగా) ఆరిగన్ వెళుతున్నావా ?

జాక్ — అవును. ప్రస్తుతంఅందరూ అక్కడికే వెళుతున్నారు.

సేత్ — 'కేన్సాస్' సరిహద్దుల్లోవున్న, 'వెస్టుపోర్టు లేడింగు' కు ముందు వెళతాం. రైళ్లన్నీ అక్కణ్ణించే పడమటితీరానికి బయలు దేరుతాయి. మాలాగే పడమటికివెళ్లాలనుకున్న వాళ్లందరూ యిక్కడినుంచే బయలు దేరుతారు. ఒంటరిగా వెళ్లకుండా అందరంకలిసి మజిలీలుచేసుకుంటూ, కొండలూ మైదానాలూ దాటిపోతాం.

ఏబీ — మీరువెళ్లేదూరం తల్చుకుంటేనే ఆశ్చర్యంగా వుంది. మీతోపాటే మన సరిహద్దుల్నికూడా జరుపుకుంటూ వెళుతున్నారన్న మాట.

సేత్ — చివరి కిదంతా పుల్లయ్య వేమారం కావచ్చునుకూడా. కాని అందరూ అనడం అక్కడినేల మాంచిసారవంతంగా వుందని. నల్లని రేవడిమట్టినేలనీ, వానలు బాగాపడతాయనీ, ఎండకూడా బాగాకాస్తుందనీ, రకరకాలుగా చెపుతున్నారు.

జాక్ — ఏబీ ! నువ్వుకూడా వీళ్లతో వెళ్లిపోరాదా ? పడమటి తీరానికి మంచిభవిష్యత్తువుంది. ఇదంతాయెందుకు కిందటి

వారంమట్టుకు కిందటివారం నాకళ్లతో చూశాను వండ లాదిసామానుబళ్లు. వెర్‌మాంట్, కేనక్టికట్, పెన్సిల్వే నియాలనించి అక్కడిభూములకోసం బయలుదేరినవాళ్లే. నాకైతే బండిలేదు. బండిదొరగ్గానే నేనూ వెళ్లిపోవాల నుంది. అక్కడ రెడ్ఇండియన్లతో కలబడవల్సివస్తే నాలాంటియుద్ధవీరులూ, శాంతి కాపాడవల్సివస్తే నీలాటి శాంతిప్రియులూ కావల్సివస్తారు ఏబీ!

ఏ బీ — (తిన్నగా దృష్టిసారించి.) అక్కడికివెళ్లాలని అందరికీ వుత్సాహం వుంటుంది, కాదనలేను.

జాక్ — అయితే నీకు వెళ్లడానికడ్డేమిటి? అక్కడినించి యిక్కడికి వూరికేపనిలేకుండా తిరుగుతున్నానని నువ్వే చెప్పావుగా యిప్పుడు.

ఏ బీ — అవునన్నాను. నాకు స్థిరత్వంలేక తిరుగుతూవున్నాను... (మాటమార్చేసి) సేత్! మీముగ్గురేనా వెళ్లేది?

సేత్ — అవును! మాతోపాటు మా నీగ్రో గోబీకూడా వున్నాడువెంట.

ఏ బీ — గోబీ మీబానిసా?

సేత్ — గోబీయా! కాదు. అతను సర్వస్వతంత్రుడు. మానాన్న వాళ్లనాన్నకి ఇరవైయేళ్లక్రితం స్వేచ్ఛనిచ్చాడు. కాని యేంలాభం? అతణ్ణి మేము చాలాజాగ్రత్తగా కాపాడాల్సి వచ్చింది. ఈ చుట్టపక్కల వాళ్లకి చాలామందికీ బానిసల సమస్యల్ని గురించి యేవిధమైన అభిప్రాయంలేదు. స్వేచ్ఛపొందిన నీగ్రోబానిస యెవరైనా వర్జీనియా సరిహద్దుల్లోకి వెళితే వెంటనే వాణ్ణి పట్టుకుని నదిఅవతలకి

తీసుకుపోయి అమ్మేస్తున్నారు. ధైర్యంగా యెవరైనా వొకరు బానిస తరుపున కోర్టుయెక్కితే, అడుగడుక్కీ, మూర్ఖులైన న్యాయవాదులు చేతుల్లోపడి కేసులన్నీ గంగపాలై పోతున్నాయి. అందుకనే యింతమంది జనం స్వేచ్ఛవున్న దేశానికి పోవాలని నడుం బిగించుకున్నారు.

ఏబీ — అయితే ఆరిగన్‌లో స్వేచ్ఛగా వుండవచ్చు ననుకొంటు న్నావా నువ్వుకూడా?

సేత్ — అవును! తప్పనిసరిగా స్వేచ్ఛవుండి తీరా లక్కడ. అదిలేకుండా వుండడానికి......

ఏబీ — (విచారంగా) సేత్! నీవనుకున్నట్లు జరగదు. వాషింగ్ టన్‌లోని రాజకీయవేత్తలు బానిసవ్యాపారం చేసేవాళ్లకి పడమటి దేశాలు కొంచెంకొంచెం,అమ్ముకుంటున్నంత కాలం నువ్వు వూహించే స్వేచ్ఛ అక్కడకూడా దొరకదు.

సేత్ — (కోపంగా) ఆ దేశం స్వతంత్రంగా వుండితీరక తప్పదు. బానిసవ్యాపారాన్నించి ప్రజల్ని రక్షించడానికి ఈ దేశం నుంచి విడిపోయి అవసరమైతే కెనడాతో చేతులు కలపడానికి కూడా అంగీకరిస్తాం. లేదా వాయవ్యంలో వేరే స్వతంత్రరాజ్యంగా యేర్పడనైనా యేర్పడతాం.

ఏబీ — (ఆశ్చర్యంగా) కొత్తరాజ్యమా?

సేత్ — ఎందుకు కాకూడదు?

ఏబీ — నాకునువ్వు మెంటర్ గ్రహం వొకప్పుడన్న మాటలు గుర్తుకు వస్తున్నాయి. "ఏదో వొకనాడు యునైటెడ్ స్టేట్సులోని రాష్ట్రాలు వొకరికొకరు శత్రువులై విడిపోయి

యూరపుఖండంలోని వివిధరాజ్యాలుగా తయారవు తాయి" అని అన్నాడు.

సేత్ — మంచి బాగా చెప్పాడు. నామాటలుకూడా అవగతం చేసుకో. నేను నాదేశాన్ని ప్రేమిస్తున్నాను. దాని రక్షణకై యుద్ధం చేయడానికి వెనకాడను. వాషింగ్టన్ మొదలైనవాళ్లు చిన్నప్పుడు యింగ్లాండు దేశాన్ని యెంతో ప్రేమించి దానికోసం యుద్ధం చేసినా, వారు పక్షపాతబుద్ధితో అన్యాయం చేయడానికి పూనుకుంటే, మాతృదేశాన్నించి విడిపోయి స్వతంత్రదేశంగా వుండడానికి వెనుదీయలేదు.

జాక్ — ఏండ్రీ జాక్సన్ వంటివాడే దైవకృపవల్ల వైట్ హౌస్‌లో వుండివుంటే, యిలాటి దేశద్రోహులందర్నీ కొరడాలతో కొట్టి మరీ తరిమేశేవాడు.

ఏబీ — సేత్! నీభార్యా, కొడుకులవంటి సహృదయుల్ని అమెరికా తనపౌరులు కాదనే రోజు వస్తే అది చాలా దురదృష్టపురోజు.

సేత్ — (ఏడుస్తూ) నాకొడుకా......? ఏదో వూహిస్తూ మాట్లాడేస్తున్నాను. అంతా వృధా. వాడు మాకు దక్కకపోతే మేం ముందుకువెళ్ళి ప్రయోజనమేమిటి? నేడు మనం అనుభవిస్తున్న కష్టాలు లేకుండా సుఖంగా వుంటారనేగదా యిన్ని కష్టాలకూ వోర్చి భవిష్యత్తుకు పునాది వేయడం. ఆ ఫలాల్ని అనుభవించడానికి వాళ్ళు లేకపోతే యిదంతా దేనికి? ఏబీ! ఇలా అంటున్నానని యేమీ అనుకోకు. నాకేమోగాని చాలాభయంగావుంది.

ఏబీ — (త్వరగా లేచి నిలబడి) సేత్! నీవు భయపడకూడదు. ఎప్పుడూ జీవితంలో భయంతో నే గడిపే నేను, నీ కీవిష యంలో చెప్పడాని కసమర్థుణ్ణి కావచ్చు. కాని నిన్ను చూసిం తరువాత, నువ్వు చెయ్యబొయ్యే మహత్తర కార్యాల్ని గురించి విన్న తరువాత నేనెందుకూ కొరగాని వాణ్ణని బాధపడుతూ వున్నాను. నిన్నూ, నీలాంటివాళ్ళనీ రక్షించడానికైనా నేను అమెరికాకు యెంతో సేవ చేయ వల్సి వుంది. సేత్! నువ్వు ముందుకు వెళ్ళడం మాన వద్దు. ఏ ఆపదా, యేకష్టం నిన్ను నీమార్గాన్నించి వెనక్కి మళ్ళించకుండా వుండుగాక. అపజయాన్ని అంగీక రించకు.

(ఏగీ బండిలోంచి వస్తుంది. చాలా భయపడుతూన్నట్టు కన బడుతుంది.)

ఏగీ — సేత్!

సేత్ — ఏమిటి, ఏగీ?

ఏగీ — చాలా ఎక్కువగా వుంది. నిదరలో మూల్గుతున్నాడు. వూపిరి అందడంలేదు...(ఏడుస్తుంది. సేత్ ఆమెను దగ్గిరికి తీసుకుంటాడు.)

సేత్ — వూరుకో! మరేం ఫరవాలేదు. డాక్టరు రాగానే మందు వేస్తాడు. భయపడకు. తప్పకుండా నయమౌతుంది.

ఏబీ — అమ్మా! మీరు వొప్పుకుంటే నాకు చేతనైనట్టు ప్రార్థన చేస్తాను.

(అతనివంక ఇద్దరూ చూస్తారు.)

జాక్ — ఏబీ! బాగా అన్నావు.

సేఠ్ — ఏబీ ! నువ్వేంచేసినా సరే, నీకు రుణపడి వుంటాం.

(ఏబీ టోపీ తీసేస్తాడు. అతను మాట్లాడుతూంటే ఎడంపక్క నించి గోబీ వచ్చి సగౌరవంగా నిలబడతాడు.)

ఏబీ — సర్వేశ్వరా! ఈచిన్నబాలుణ్ణి రక్షించు. దయామయా! ఈతని తలిదండ్రులు నీకార్యముల నెరవేర్చుటకై, ఈభువిని నీసంతానమంతయూ సుఖముగానుండుటకై కృషి చేయుటకు దూరతీరములకు వెళ్లుచున్నారు. భవిష్యత్తులో వారెక్కడికి పోవలెనో, ఏమిచేయవలెనో, మార్గమధ్యమున యెన్ని యిక్కట్టుల నెదుర్కొనవలసి వచ్చునో వారికి తెలియదు. వారి చిన్నికూనను వారినుండి వేరుచేయవద్దని వినమ్రుడనై ప్రార్థించుచున్నాను. ఈ చిన్నిబిడ్డకు స్వేచ్ఛాజీవితమును ప్రసాదించుము. మృత్యువనెడి సంకెళ్లనాతనికి ప్రాప్తింపజేయబోకుము. ఆతని జన్మహక్కైన జీవితము నాతనికి ప్రసాదింపుము. పచ్చని మైదానములను, ఎత్తైనకొండలను, సస్యశ్యామలమైన పంటభూములనూ, గలగల ప్రవహించేనదులనూ చూచి ఆనందించే హక్కు నాతడు పొందునట్లుచేయుము. ఈచిన్నికుమారుడు అమెరికావాసి. అమెరికా అతనిది. తరతరాలనించీ అతని తాత తండ్రులే లక్ష్యసాధనకై కృషిచేశారో దానికై యీబాలుడు కూడా పాటుపడునట్లు దీవించి, దానిని ప్రసాదించుము. అతని తండ్రినీ, అతనినీ, మమ్ములనందరినీ శక్తిసంపన్నులగా చేయుము. భగవాన్! మా ముందున్న యీ మహత్తరకార్యసాధనకు, ఆత్మబలిదానంచేసి మానవులకు

స్వేచ్ఛప్రసాదించిన నీకుమారుడు ఏసుక్రీస్తుద్వారా మమ్ము కాపాడుము. ఆమెన్ !

గోబీ — (భక్తితో) ఆమెన్ !

సేత్, ఏగీలు — (నెమ్మదిగా) ఆమెన్ !

(ఏబీ తిరిగి టోపీపెట్టుకుంటాడు)

ఏబీ — అర్ధరాత్రి కావస్తుంది. నేను 'బోగర్' వ్యవసాయ క్షేత్రానికి వెళ్లి డాక్టర్ని తీసుకువస్తాను. (వెళ్లిపోతాడు.)

సేత్ — ఏబీ ! నీరుణం తీర్చుకోలేను.

ఏగీ — లింకన్‌గారూ, మీకేంచెప్పాలో తెలియడంలేదు.

గోబీ — లింకనుగారూ, భగవంతు డెప్పుడూ మిమ్మల్ని కాపాడాలి !

(దీపాలారిపోయిం తరువాత తెరపడుతుంది.)

ఏడవ రంగం సమాప్తం.

---

## ఎనిమిదవ రంగం

(కిందటిరంగం జరిగిన కొన్నిరోజుల తరువాత. ఎడ్వర్డ్సు యింటి వరండా, మేరీ పుస్తకం చదువుతూ కూచుని వుంటుంది. ఒక క్షణంలో పనిపిల్ల ప్రవేశిస్తుంది.)

పని — అమ్మా ! లింకనుగారు వచ్చారు.

మేరీ — లింకన్‌గారా ? (అలాకూచుండిపోయి, లోపలపొంగి పొరలుకువస్తున్న భావసముదాయాన్ని అణచుకోడానికి ప్రయత్నిస్తుంది. పుస్తకం మూసేసి లేచి నిలబడుతుంది.)

పని — అమ్మా ! మీరు వారికి కనబడతారా ?

మే రీ — ఆః ఒక నిముషంలో! ( పనిపిల్ల వెళ్లిపోతుంది. మేరీ పక్కగాతిరిగి పుస్తకం సోఫాలో పడేస్తుంది. మనసులో భావాలు తెల్లమైపోకుండావుండాలని యత్నంచేస్తుంది. చలిమంటదగ్గిరే నిలబడి, వస్తూన్న ఏబీకి యెదురుగా వుండేట్లు నిలబడి వుంటుంది. ) లింకన్! యిన్నాళ్లకి మళ్లీ మిమ్మల్ని కలుసుకున్నందుకు సంతోషంగా వుంది.

( ఏంమాట్లాడుకోవాలో తెలియక యిద్దరూ తటపటాయిస్తూం టారు. వచ్చినవిషయం క్లుప్తంగా యెలాచెప్పడమా అని ఏబీ ఆలో చిస్తుంటాడు. ఇద్దరిమధ్యా అభిప్రాయభేదంకలగనట్టుగా పూర్వంలా యెప్పటి పరిచయంతో మాట్లాడాలని చూస్తుంటుంది మేరీ. )

ఏ బీ — మేరీ! నీ విచ్చిన చనువువల్ల యిలా యెందుకు వచ్చావని ఆశ్చర్యపడుతున్నావా?

మే రీ — ( వెంటనే ) సనియన్ యింటికిరావడానికి నీకెప్పుడూ ఆహ్వాన ముండనేవుంది.

ఏ బీ — క్రితంసారి మనంకలుసుకున్నప్పటి నాప్రవర్తనకు నామీద నాకే అసహ్యంవేసింది.

మే రీ — జోష్ స్పీడు, మీకు అనారోగ్యంగావుండి మళ్లీ కోలుకొన్నారని కబురు చెప్పాడు. అతనిమాటలు విని మీకోసం చాలా బాధపడ్డాం.

ఏ బీ — నన్ను మర్చిపోనందుకు కృతజ్ఞుణ్ణి.

మే రీ — ప్రస్తుతం ఆరోగ్యంగా వుంటున్నారుగా? మీరు మళ్లీ మీ పూర్వపుపనిలో ప్రవేశించి యెసెంబ్లీకి నిలబడతారని అనుకుంటున్నాను. దీనికన్న పెద్దకార్యక్రమాన్ని దేనైనా నెత్తినపెట్టుకున్నారా?

ఏబీ — మేరీ! ఇంకేకార్యక్రమాలూ లేవు. (ధైర్యంచికట్టి మనం చిరకాలం బంధించబడవల్సిననాడు యెన్నోమాట లని నీహృదయాన్ని నొప్పించినందుకు క్షమించు.

మేరీ — లింకన్! మీా రావిషయాన్ని గురించి బాధపడవద్దు. దీంట్లో నాతప్పూ లేకపోలేదు.

ఏబీ — (ఈ మాటలకి నొచ్చుకుని) తప్పు నీది కాదు — ఇదంతా నా అసమర్ధత — పిరికితనం...

మేరీ — అహంభావంతో కళ్ళు మూసుకున్నాను. నేను నిన్ను నిజంగా ప్రేమించాను. (వణుకుతున్న కంఠాన్ని, కమ్ము కుంటున్న బాధనీ పక్కకి నెట్టి ధైర్యంగా మాట్లాడు తుంది.) నువ్వు నన్ను ప్రేమించేలా చేసుకోగలనని నమ్మాను. మన యిరువురి హృదయాలూ ప్రేమాను బంధంతో యేకమై, నా దృఢనిశ్చయాన్ని నీలో ఆత్మ బలంగా వెలిగించగలనని అనుకున్నాను. నీ వొక గొప్ప మానవుడవై, ప్రజానాయకుడ వౌతావని తలిచాను. కాని, యివన్నీ జరక్కుండా అడ్డుకున్నావు. (పక్కగా తిరిగి) నీకు చక్కని శక్తిసామర్థ్యాలున్నాయని యెరుగుదును — కాని ఆశక్తినంతా నీమహత్తరభవిష్యత్తు నెదుర్కో డానికి వుపయోగిస్తావనుకోలేదు.

ఏబీ — (శాంతంగా) మేరీ! నాలో నీకు పూర్తి విశ్వాసం వుందని యెరుగుదును, కాని దానికి నేను తగినవాణ్ణి కాలేకపోయాను. కాని యీసారి నీకోర్కెలన్నీ నిజం చేయడానికి యత్నం చేస్తాను. (మేరీ అతనివంక తదేక దీక్షగా చూస్తుంది.) మన యిద్దరివీ భిన్నమార్గాలు. అవి

కలవ్వని నేను వూహించి యిలా పిరికి పందలా ప్రవర్తిం చాను. కాని నావూహా పొరపాటని త్వరలోనే గ్రహించాను. మంచికైనా చెడుకైనా యిరువురి జీవితాలూ వొకటై పురోగమించవల్సిందేనని తెల్సుకున్నాను. అందుచేత నీవు నాసహధర్మచారిణిగా వుండడానికి సమ్మతిస్తావేమో అడిగి తెల్సుకోవాలని వచ్చాను. మేరీ ! నీవు మళ్ళీ నన్ను అంగీకరిస్తే, దానివల్ల నీకెంత అవమానమో, బాధో గ్రహించగలను.

మేరీ — ( కోపంగా ) అవమానానికి నాకు భయంలేదు. మన ఘనవిజయం ముందీ అవమానా లన్నీ తుడిచిపెట్టుకు పోతాయి. కాని, నీలో నీకు సంపూర్ణవిశ్వాసం కలిగే వరకూ మనకు విజయం కలగదు. ఇంతమార్పు నీలో యెలా వచ్చింది ?

ఏబీ — భార్యాబిడ్డలతో నాచిన్ననాటిస్నేహితుడొకడు, పెట్టి బండిలో, పడమటిమైదానాల్లో ప్రయాణంచేయడం చూశాను. అతనివెంట నన్నూ రమ్మన్నాడు. వెళ్లాలని మనసులోచాలా కుతూహలంగావుంది. (మాటలో విచారం తొణికిసలాడుతుంది, కాని ఆమెవంక చూచి ప్రశాంతంగా మాట్లాడుతాడు ) నాజీవిత లక్ష్యం అతనిలా ప్రయాణం చెయ్యడం కాదనీ, నీతో ముందుకు పురోగమించడమే ననీ తెల్సుకున్నాను.

మేరీ — ఏనాడూ వెనకదృష్టిలేకుండా, అధైర్యపడకుండా వుంటారుకదూ ?

ఏబీ — సత్యంకోసం, భగవంతుడు నాకు సత్యమని తోపించిన

దానికోసం, జీవితమంతా పాటుపడతాను. నువ్వొగాని నావెంట నంటివుంటే, నమ్ము నామాట!

(అతనివంక పరీక్షగా చూస్తుంది. కొద్దిసేపు అతన్ని ద్రోలాయమానసుణ్ణిగా చేయాలని యత్నించాలని వున్నా. నిజంగా చెప్పేయాలనే భావంవల్ల అపజయం పొందుతుంది.)

మేరీ — మీారు కోరినట్లు చేయడానికి నాకేమీా అభ్యంతరం వుండదు. మృత్యువు మనల్ని శాశ్వతంగా వేరుచేసేవరకూ మీాపక్కనే వుండి అన్నిటినీ యెదుర్కొంటాను. (పరుగుని అతణ్ణి సమీాపించి అతన్ని పట్టుకుని) ఏబీ! నిన్ను మనసార ప్రేమిస్తున్నాను — నిజంగా ఆరాధిస్తున్నాను. మన యిద్దరి మధ్యా యేం జరిగినాసరే నిన్ను ప్రేమిస్తూనే చచ్చిపోతాను. (ఏడుస్తూ అతని భుజాలమీాద తలపెడుతుంది. అతడు సిగ్గుపడుతూనే ఎడంచేత్తో కొంచెం దగ్గిరగా తీసుకుంటాడు. ఆమె పక్కగావున్న తివాసీని తదేకంగా చూస్తూ వుంటుంది.)

తెర పడుతుంది

ఎనిమిదవ రంగం సమాప్తం

---

## తృ తీ యా ం క ం

### తొ మ్మి ద వ ర ం గ ం

(ఇలినాయస్ పట్టణంలో వొక సభావేదిక. 1858 వేసవి సాయంకాలం. సభావేదికపై వుపన్యసిస్తున్న వుపన్యాసకుడి దగ్గిరగా దీపం వెలుగుతూవుంటుంది.

సభావేదిక వెనుకభాగంలో మూడుకుర్చీలు వేసివుంటాయి. ఒక కుర్చీమీద న్యాయాధిపతి స్టీవెన్ డగ్లస్ కూచుని వుంటాడు. రెండవ దానిమీద టోపీపెట్టుకుని యేబీ కూచుని, మధ్య మధ్య పెన్సిలుతో పేపర్లో 'మార్క్' చేసుకుంటూ కూర్చుని వుంటాడు. సభావేదిక చివర నిలబడివున్న నినియన్ కోసం మూడోకుర్చీవేసి వుంటుంది. ఆసభకు నినియన్ మధ్యవర్తిగావుంటాడు.)

నిని — వీరిరువురు ఇలినాయిస్ నుంచి యునైటెడ్ స్టేట్సు సెనేటరు అభ్యర్థిగా పోటీచేయుచున్న జడ్జీ స్టీవెన్ డగ్లసుగారూ ఏబీ లింకన్ గారూను. వీరిద్దరూ, మన జీవిత సమస్యల్నే గాక భవిష్యచ్చరిత్ర నంతా మార్చగల కొన్ని ముఖ్యమైన సమస్యల్ని గురించి చర్చిస్తారు. దేశంలో అందరిదృష్టీ మన రాష్ట్రంమీదనే వుంది. ఇటువంటి వాదాల్లోని నియమాల ప్రకారం, ముందు జడ్జీ డగ్లసుగారు మాట్లాడుతారు.

(నినియన్ వెళ్ళి తనకై వేసివున్న కుర్చీలో కూచుంటాడు. జడ్జి డగ్లసు ముందుకు వస్తాడు. మనిషిని చూస్తే ఆత్మవిశ్వాసం వున్నవాడిలా కనబడుతాడు. మితంగానూ, క్లుప్తంగానూ మాట్లాడే వాడిలా వుంటాడు.)

డగ్ల — సోదరులారా ! నామిత్రుడు లింకన్ తన అప్రియమైన సహృదయంతో, వ్యంగంగా చక్కని నానుడులతో

మీకింతవరకూ వుపన్యసించాడు. తన వుపన్యాసంలో చాలాభాగం నా గుణగణాల్ని మెచ్చుకుని రాజకీయ వేత్తగా నన్ను గణన చేయకపోయినా, అతనికి నేను కృతజ్ఞుణ్ణి. మిమ్మల్ని అందర్నీ నేను కోరేదేమంటే, అతడు పైకి కనబడే అంత అమాయకుడు కాడనీ, అతని సహృదయత్వం చాలావరకూ జాగ్రత్తగా పెంపొందించ బడిందనీ గుర్తించమని కోరుతున్నాను. అతను చెప్పే ప్రతి సామాన్యవిషయంలోనుకూడా తెలియని అపాయా లెన్నో అంతర్లీనమై వున్నాయి. షేక్స్పియరు మహా కవి విషాదాంతనాటకంలోని బ్రూటస్‌లా యితడూ సహృదయుడు కావచ్చు. శత్రువు అజాగర్తగా వున్నప్పుడు వెనకనుండి పోటు పొడవగల సమర్థు డితను. నా శరీరమంతా గాయాలమయమై పోయింది. కానినేను ఎలానో నిజాయితీగానే బతుకుతున్నాను. దీనికి కారణం 'నిజాయితీ, సత్యం' అనే రెండు చేయూతలవల్లా రోజులువెళ్లబుచ్చుతున్నాను. సత్యాన్ని యెంత రెన్నిరకాలచిత్రవధలుచేసి నేలపాలుచేసినా, అది మళ్లీ తలయెత్తుతూనే వుంటుంది. పిట్టకథలతోనూ, వేళా కోళాలతోనూ లింకను మిమ్మల్ని నవ్వించవచ్చును. దక్షి ణాదిలో బానిసలుపడుతున్న బాధల్ని పూసగుచ్చినట్లు వర్ణించి, మీకళ్లవెంట నీళ్లు కారేలా చేయనూ గలడు. సత్యమార్గానికి మిమ్మల్ని నడిపించి, అతి తెలివిగా మిమ్మల్ని వెంటనే పక్కదార్లు పట్టించనూగల సమర్థుడు. వుదాహరణ కొకవిషయం వినండి — ఉత్తరాదిలో పారిశ్రామికులు పడే

పాట్లనిగురించి పొరపాటునైనా వొక్కసారి ముచ్చటించడు. లేదు పాపం! న్యూ యింగ్లాండు రాష్ట్రం అతని దృష్టి ప్రసరించలేనంత దూరంగా వుండడంచేత వేలాది ప్రజలు స్త్రీ పురుష వివక్షతలేక, బట్టలమిల్లుల్లో అవస్థలు పడుతూ 'సమ్మె' చేస్తూంటే, అతని దయార్ద్రహృదయానికీ విషయం చేరనేలేదు కాబోలు! వీళ్లందరూ యెందుకు 'సమ్మె' చేస్తున్నట్టు? స్వతంత్రులమని చెప్పుకునే ఈ నిర్భాగ్య పౌరులు, లేచింది మొదలు రాత్రి వరకూ — రోజుకు పద్నాలుగ్గంటలు, హృదయ విహీనమైన ఫేక్టరీల్లో బట్టలు నేసే మగ్గాలదగ్గిర మగ్గిపోతూ, వెలుగుముఖమే ఎరక్క, పని అయేప్పటికి అలిసి, సొమ్మసిల్లి చలిలో, చీకట్లో వొంటి మీద జానెడుబట్టయినా లేక, కడుపు నకనకలాడిపోతూంటే, పందులు కూడా నివసించని కొంపల్లో తలదాచుకోడానికి వెళుతూంటారు! ఎటువంటి స్వాతంత్ర్య మిది? ఎక్కడో 'మస్సచ్యుసెట్సు' లో జరుగుతున్న విషయం తెలియదనుకోండి పోనీ! ఇక్కడ మన రాష్ట్రంలోనే 'ఇలినాయిస్ సెంట్రల్' లో రైలురోడ్డు కూలీల సత్యాగ్రహంవల్ల రైళ్లు నడవడం లేదనికూడా యెరగడా? అణగారిపోతున్న యీ రైల్వేకూలీలు బతికేందుకు సరిపడిన కూలీ యివ్వమనేగా గొడవ చేస్తున్నారు! దీన్నిబట్టి వుత్తరాది పరిస్థితి అంతాయిలాగే ఆందోళనకరంగా వుందని చెప్పవచ్చును. ఆకలితో అటమటిస్తూ, చింకిగుడ్డలతో రోడ్లమీద వూరేగుతూ, దొమ్మిల్ని నడిపిస్తున్నా రెందుచేత? వారికీ, వారి బిడ్డలికీ పిడికెడు కూడూ, జానెడు బట్టా

దొరకే కదా? ఇదెలాంటి స్వతంత్రం! ఏవిధమైన సౌభ్రాతృత్వం! చీటికీ మాటికీ లింకన్ సమానత్వం, స్వేచ్ఛలమీద వుపన్యాసాలిస్తాడు. 'లౌజాయ్' మొదలైన కొందరు పెద్దలు బానిసత్వ నిర్మూలనాన్ని గురించి చెప్పిన పలుకులే చిలకలాగా పలుకుతూంటాడు 'డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెన్‌డెన్సు' (స్వారాజ్య ప్రకటన) ప్రకారం మానవులంతా వొకటే ననీ, స్వేచ్ఛా సమానత్వా లందరి హక్కులనీ, కాబట్టి నీగ్రోకు కూడా సమానత్వానికి హక్కు దారనేగదూ వీరందరూ వాదించేది. చీఫ్ జస్టిస్ 'టేనీ' గారు 'డ్రెడ్‌స్కాట్' కేసులో వివరించింది పై చెప్పిన విపరీతపు వాదనకు వ్యతిరేకంగా వుంది. ఈ 'జడ్జిమెంటు' ని బట్టి నీగ్రోలంతా అధమజాతి కాబట్టే వారికన్న వుత్తమజాతిచేత జయించబడి, బానిసలుగా చేయబడ్డారు. కాబట్టి ఆస్తులన్నిటివలెనే వీరు కూడా ఆస్తేను! రాజ్యాంగరీత్యా అధికార మీయబడిన సుప్రీంకోర్టు అధికారాన్ని కూడా లింకన్ ధిక్కరిస్తాడు కాబోలును! 'డ్రెడ్‌స్కాట్' విచారణ పక్షపాతబుద్ధితో చేసింది కాబట్టి ప్రజలందరూ దాన్ని వ్యతిరేకించి మార్చాలని లింకను సూటిగా చెప్పకపోయినా, ఆ అర్థం వచ్చేట్టుగానే సూచించాడు. సుప్రీంకోర్టు అధికారాన్ని ప్రజలు మన్నించకుండా, దానియందు వారికున్న అభిమానాన్ని నాశనం చేయడానికి, లాయరుగా వుంటూనే లింకను విప్లవాన్ని ప్రోత్సహిస్తున్నాడు. రాజ్యాంగాధికారా లన్నిటిమీదా విప్లవం, తిరుగుబాటూ, అసూయా

ప్రజల్లో కలిగిస్తున్నాడు. న్యాయానికి కట్టుబడి వుండమని ప్రోత్సాహించడానికి బదులు, ప్రజల్లో భావోద్రేకం, హింసా, దౌర్జన్యాలను ప్రోత్సహిస్తున్నాడు. సోదరుణ్ణి, తోటి సోదరుడిపై పురికొల్పుతున్నాడు! ఈవిధమైన పగలు రగుల్కొల్పడంవల్ల కలిగే పర్యవసాన మొకటే అదే అంతర్యుద్ధం! 'డ్రెడ్‌స్కాట్' విచారణ్ణి గురించి నా అభిప్రాయ మేమిటని ప్రశ్నిస్తాడు. దానికి నాసరియైన సమాధాన మిదే: "సుప్రీముకోర్టు విచారణే దేశాని కంతటికీ న్యాయమైన విచారణ. దాన్నే నేను శిరసావహిస్తాను". 'సర్వజాతి సమానత్వ' మనే పిచ్చిమాటలు మాట్లాడుతూ, వుద్రేకంతో నీగ్రోలకి వోట్లు వేయమనీ, వాళ్ళతో కలిసిమెలిసి తిరగమంటూ, చివరికి వాళ్ళని పెళ్ళికూడా చేసుకుంటూ గోలచేసే వీళ్ళమాటల్ని లక్ష్య పెట్ట దల్చుకోలేదు! ప్రతీరాష్ట్రం తనపని తను చూసుకుంటూ, యెవరిజోలికీ పోకుండా వుండడం వుత్తమమని చెప్పదల్చుకున్నాను. ఈ సిద్ధాంతాన్ని లింకను అంగీకరిస్తే, మన రిపబ్లికు శాశ్వతంగా, స్వతంత్రరాష్ట్రాలతో, అస్వతంత్ర బానిసరాష్ట్రాలతో వర్ధిల్లగలదు. పూర్వంలానే ధనంలో, జనంలో, శక్తిలో అధికులమౌతూ, సర్వప్రపంచానికీ ఆశ్చర్య భయాన్ని కలిగించగలం! (సభికులవంక చూసి పక్కగా తిరిగి నుదురు తుడుచుకుని కుర్చీలో వచ్చి కూచుంటాడు.)

వి ని — (నిలబడి) లింకనుగారు మాట్లాడుతారు.

(ఏబీ చేతిలో కాగితాలు చూచుకుని టోపీతీసి కాగితాన్ని దాంటో పెట్టి లేచి నెమ్మదిగా ముందుకువచ్చి నిలబడతాడు.)

ఏ బీ — (నెమ్మదిగా) జడ్జీ డగ్లసుగారు నా నేర్పు నొక బాకు పోటుతో మెచ్చుకున్నారు. అందుకు కృతజ్ఞుణ్ణి. వారు బాకు నుపయోగించడంలో నాకన్నా నేర్పరని అంగీకరిస్తాను. ఒకేసారి వారు పదిబాకుల్ని గాలిలో ఎగరవేయగలరు కాని అదృష్టవశాత్తు అవి యెవరికీ అపకారం చేయవు, ఎవర్నీ బాధించవు. పాపం! జడ్జీగారు దక్షిణాదిలో బాని సత్వాన్ని నిషేధించవద్దని వాదించినా, వుత్తరాదిలో మాత్రం దాన్ని అరికట్టాలని గట్టిగా బల్లగుద్ది వాదిస్తారు. యూనియన్ కొకపక్క విశ్వాసాన్ని చూపెడుతూనే, రెండవపక్క, రాష్ట్రాలు సర్వ స్వతంత్రంగా వుండాలని అదే నోటితో చెప్తున్నారు. నాకీసందర్భంలో జ్ఞాపక మొస్తున్న చిన్నపిట్టకథ చెపుతున్నందుకు జడ్జీగారు క్షమిస్తా రను కుంటాను. కెంటకీలో వొకస్త్రీ వుండేది. తనకర్ర కొంప లోంచి ఒకరో జావిడ బయటికి వచ్చేప్పటికి ఆవిడ మొగుడూ ఒక ఎలుగుగొడ్డూ కలిసి కుస్తీ పడుతున్నారు. అతడి ప్రాణం పోయేలా వుంది. దాంతో కిందా మీదా పడుతూనే భార్యని కేకపెట్టి "రావే! వచ్చి నన్నెలా అయినా రక్షించు"మని గోలపెట్టాడు. వెంటనే ఆవిడగారు "నన్ను వచ్చి యేంచెయ్యమంటావు?" అంది. "ఏముంది చేయడానికి, నాదగ్గిర నిలబడి ధైర్యంచెప్పు" అన్నాడు అతను. పాపం! ఆయిల్లాలికి పక్షపాతం చెయ్యడం యిష్టం లేదు. అందుకని, భర్తనుద్దేశించి "బాగా దెబ్బలాడండి" అంటూనే, వెంటనే "ఎలుగూ బాగాపట్టవే" అందిట.

"నీగ్రోలకిఓటువేసి, వాళ్ళలోకలిసి తిని, పెళ్ళికూడాచేసుకోవా"
మని జడ్జీగారనడం మీరందరూవిన్నారు. బహుశా నన్ను ద్దే
శించే యీమాటలన్నీ అనివుంటారు వారు. వాళ్ళు బాని
సలగా వుండకూడ దన్నంతమాత్రంచేత, వాళ్ళతో వియ్యా
మందుదామనే అర్థం అందులోలేదు. ఈరెంటిలో దేన్నీ
నేను కోరను. వాళ్ళజోలికి మనం వెళ్ళకుండావుంటే
చాలును. కొన్ని విషయాల్లో వాళ్ళు నాతో సమా
నులు కాకపోవచ్చు. నేను జడ్జీగారితో అన్నివిధాలా
సమానుణ్ణి కాదు కదా? తమస్వహస్తాలతో ఆర్జించు
కున్నసొత్తును, యితరులఆజ్ఞా, అనుజ్ఞాలేకుండా తినడా
నికి మనకెంత హక్కుందో వారికీ అంతే హక్కుంది.
ఇక నీగ్రోస్త్రీల సంపర్కమంటారా? ...... చెపుతాను
వినండి - జడ్జీగారి కీవిషయం వినడానికి వుత్సాహంగానే
వుండొచ్చును - బానిసవ్యాపారంచేసే రాష్ట్రాలలో బానిస
లకూ మనవారికీ పుట్టిన నిర్భాగ్యులూ, అనాథులూ
నాలుగులక్షలమందివున్నారు. బానిసత్వం అక్కరలేదన్న
వాళ్ళకి పుట్టినవాళ్ళుకారు వీళ్ళందరూ! బానిసత్వనిర్మూలం
పేరుచెపితే న్యూ యింగ్లాండు విషయాలు జ్ఞాపక మొస్తు
న్నాయి. ఈవిషయాలుకూడా జడ్జీగారు చెప్పనేచెప్పేరు.
ఎత్తుగా రాళ్ళతో చీకటిగదులతో ఖైదులాకట్టిన ఫ్యాక్ట
రీల్లో, పొద్దుగుంకేవరకు నడుంబద్దలుగొట్టుకుంటున్న పారి
శ్రామికుల్ని నేనూ చూసాను స్వయంగా. ఈఫ్యాక్టరీ
లలో నల్లబానిసలు లేకపోయినా వాళ్ళు సమకూర్చిన
దూదితో బట్టలు నేస్తూ, రోజుకు యాభై సెంట్లు గడిస్తూ

బానిసలనే పేరులేకుండామాత్రం బతుకుతున్నారెందరో తెల్లవాళ్లు. అమెరికన్ పౌరుడిగా నేనీపరిస్థితుల్ని చూసి గర్వించి ఆనందించడంలేదు. కాని అమెరికన్ పౌరుడు గానే నేనొక ప్రశ్న వేస్తున్నాను. ఉత్తరాదిలో నేడు 'సత్యాగ్రహం' చేస్తున్నవారందరూ దక్షిణాదివెళ్ళి బాని సలస్థానం ఆక్రమించమంటే అంగీకరిస్తారా? అలా అని వార్ని ప్రశ్నిస్తే యేమనిసమాధానం చెపుతారో తెలుసా? ఈ పరిస్థితుల్ని చక్కబెట్టుకోగలశక్తి మాచేతుల్లోనే వుందంటారు. మానవుడుగా, తనహక్కుల్ని పొందడానికై రాజ్యాంగరీత్యా 'సత్యాగ్రహం' చేయగల దేశంలో నివ సిస్తున్నందుకు అమెరికన్ పౌరుడుగా దైవముఖంచూసి ధన్యవాదాలర్పిస్తున్నాను. నేను విప్లవాన్ని పురికొల్పడం లేదు. విప్లవాన్ని ప్రోత్సాహపరచవల్సిన అవసరంకూడా వుదయించదు. ఇది ప్రజారాజ్యం. రాజ్యాంగమే ప్రజలు, ప్రజలేరాజ్యాంగం. వారి కీ రాజ్యాంగపద్ధతు లిష్టంలేక పోతే, వెంటనే ప్రజాస్వామ్యపద్ధతులపైన తమరాజ్యాంగ విధానాన్ని మార్చుకోగలరు. లేదా, విప్లవాత్మకమైన పద్ధతిననుసరించి వారి కయిష్టమైన సభ్యుల్ని తొలగించ వచ్చును. స్వాతంత్ర్య సముపార్జకులైన మనపెద్దలు మన కిచ్చిన హక్కిదే! సుప్రీంకోర్టును నేను అగౌరవం చేయ మని ప్రబోధించడంలేదు. సుప్రీంకోర్టు కెంతన్యాయం ప్రియమైనదైనా, దానిలోని న్యాయవేత్తలందరూ మానవులనీ, మానవులంతాపొరపాట్లుచేస్తారనీ, ముఖ్యంగా నేడు యీకోర్టులో వున్నవారంతా, జాతీయవిభేదాలవల్ల

న్యాయవిచక్షణాజ్ఞానాన్ని యేమరిచే దక్షిణాదివారి బిడ్డ లసీ మరిచిపోవద్దని మీకు చెప్పదల్చుకున్నాను. "మానవు లెంతవరకూ న్యాయశీలురు కాగలరో అంతవరకే న్యాయా ధీశులు న్యాయశీలురు కాగలర" ని వొకనుడి వుంది. దాన్నెవరో అసలేదు - థామస్ జఫర్ సన్ గారే అన్నారు. (డగ్లసువైపు తిరిగి) నీగ్రోల ఆస్తి సముపార్జనకోసమే 'డ్రెడ్ స్కాటు విచారణ' చేయబడింది. మానవత్వపుహక్కు లకూ, ఆస్తి హక్కులకూ మధ్య అనాదిసిద్ధంగా సంఘర్షణ జరుగుతూనే వుంది. నేనూ, జడ్జీ డగ్లసుగారూ కూడా యీ లోకంవదలి వెళ్ళినా యిది యిలా జరుగుతూనే వుంటుంది. రెండు మూలసూత్రాలమధ్య జరుగుతున్న సంఘర్షణ యిది. ఒకటి సామాన్య మానవధర్మం, రెండవది ప్రభువులు దైవాంశసంభూతు లనే ధర్మం. వీటిమధ్య అనాదిసిద్ధంగా రభస జరుగుతూనేవుంది. "నువ్వు కష్టపడి పండిస్తే నేను తిని అనుభవిస్తాన"న్నట్టు వుంటుంది దీన్నే వేరేపదాల్లో చెపితే! ఈమాటలు ప్రజల్ని నిరంకుశంగా పాలించి వారికష్టార్జి తాన్ని కుడిచేప్రభువు నోటివెంట వచ్చినా, పాలించే జాతిమాది, పాలకులం మేము అనే అహంకారపూరితమైన జాతినోటివెంటవచ్చినా, రెంటికీమూలం, నిరంకుశత్వమేను. "మానవులంతా సమానులే" ననే నినాదంతోనే మనజాతి వర్ధిల్లింది. మన స్వాతంత్ర్యప్రకటన సమయంలో వెల్లడిచేసిన రాజ్యాంగచట్టంలో దీనికి విభిన్నంగా యేసూత్రమూ కన బడదు. మనస్వార్థంకోసం, సౌకర్యార్థం మానవులంతా వొకటే కావచ్చు, వొక్క నీగ్రోజాతితప్ప అని అంటున్నాం.

ఈసూత్రాన్నే భవిష్యత్తులో కూడా అమల్లో పెడితే, అందరు మానవులూ సోదరులే, కాని నీగ్రోలు తప్ప, పరదేశీయులు కాక, కేథలిక్కులు కాక, యూదులు తప్ప, బీదవారు తప్ప అంటూ నిరర్ధకమైన హద్దుల్ని నిర్మించుకోడాని కేదీ అడ్డురాదు. బానిసత్వాన్ని సమర్థించే వారంతా చివరికి మనల్ని యిటువంటి నిర్ణయాలవైపుకే తీసుకు వెళతారు. ఉత్తర దక్షిణాల ప్రజలంతా జడ్జీగారి నిర్ణయానికి బద్ధులై యేగొడవలూ లేకుండా, యెవరి గొడవ వాళ్ళు చూసుకుంటూ వుండాలంటారని నాకు తెలుసు. ఇది తాత్కాలికంగా మంచిపనే కావచ్చు. కొద్దికాలం పరిశీలిస్తే సత్యం మీకే తెల్లమౌతుంది. మీతోటి మానవుల్ని బానిసలుగా చేసి, వారి హక్కుల్ని నిరాకరించి, వార్ని పశువులుగా మార్చి, ఎందుకూ పనికిమాలిన వాళ్ళుగా చూస్తూ రాక్షసత్వాన్ని ప్రేరేపిస్తే, అదే మీ మీద చివరకు తిరగబడి మిమ్మల్ని నాశనంచేసి మింగేయదా అని ప్రశ్నిస్తున్నాను. స్వాతంత్ర్యానికి హద్దులు వేస్తే యేంజరుగుతుందో జాగ్రత్తగా పరీక్షించండి. అంతర్యుద్ధాన్ని నేను పురికొల్పడంలేదు. మన ప్రజాప్రభుత్వానికి మూలధర్మాల్ని, మనజాతిని అభ్యున్నత పథానికి నడిపించిన ధర్మాల్ని, యింకా మనల్ని వున్నతస్థానాలికి కొనిపోయే ధర్మాలకై నే నీనాడు పాటు పడుతున్నట్టే, నేను బతికున్నంతకాలం కృషి చేస్తాను. బానిసత్వం కావాలనే వారివల్లకాదు నేడు మన సనాతనధర్మాలికి ముప్పు వాటిల్లుతుంది, జడ్జీ డగ్లసువంటి వారివల్ల, అటువంటివారి మాటలు నమ్మి

'వాళ్ళకర్మ వాళ్ళది! వాళ్ళజోలి మనకెందు' కనే వాళ్ళవల్లనే. రాబోయే ఆపద గుర్తించకుండా మనదాకా వచ్చాక చూద్దామనే ఈ తత్వం నాకు సరిపడదు సరిగదా, పరమ అసహ్యం. అన్యాయం, రాక్షసత్వమైన యీ బానిసత్వాన్నే నే నసహ్యించుకునేది. దీనివల్ల ప్రపంచంలో మనం న్యాయబద్ధమైన ప్రభావాన్ని చూపలేకపోతున్నాం. స్వాతంత్ర్యసంస్థల్ని దూషించి, విమర్శించే వాళ్ళందరికీ మనం ఆత్మద్రోహులమని విమర్శించే అవకాశం యేర్పడుతుంది. అంతేకాదు, స్వేచ్ఛాప్రియులైన మన మిత్రులు మన నిజాయితీని శంకించే అవకాశం యేర్పడుతుంది. "డిక్లరేషన్ ఆఫ్ ఇండిపెన్డెన్స్" (స్వాతంత్ర్య ప్రకటన) నాడు ప్రకటించిన ధర్మసూత్రాలకి వ్యతిరేకంగా వున్న యీ పద్ధతిని మనలో స్వేచ్ఛాప్రియులైన వారందరూ ప్రతిఘటించి తీరుతారు. అంతేగాక, స్వార్థంతో మనం రాజ్యాంగచట్టాన్ని ధిక్కరిస్తున్నామని కూడా అనవచ్చునేమో...జడ్జీగారు తమ వుపన్యాసాన్ని అంతంచేస్తూ 'సర్వప్రపంచాన్నీ మనం గడగడ లాడించాలని' అన్నారు. కాని మన కటువంటి వుద్దేశ్యా లున్నాయని నేను తలచను. మానవులంతా స్వేచ్ఛగా బ్రతకాలనీ, అలా బ్రతకాలనుకున్న వారికి మనచేయూత నివ్వాలనీ కోరుతున్నామని నావూహ. ఒక మహత్తరజాతిగా వర్ధిల్లితేగాని మనం యిటువంటి ప్రోత్సాహాన్ని యీయ తగం. మనరాష్ట్రాలన్నీ ఐకమత్యంగా కలిసీ మెలిసీ వుంటేగాని యిదిసంభవించదు. స్వాతంత్ర్యానికి అర్థం వాకటేగాని, జాతి జాతికీ మధ్య,

కులం కులంకీ మధ్య వేరేవిధంగా మారదు. 'గృహకల్లోలాలతో వున్న యిల్లు ఏనాటికైనా ఛిన్నాభిన్న మైపోక తప్పదు. సగం స్వతంత్రులతో, సగం బానిసలతో నిండిన యీ ప్రభుత్వం శాశ్వతంగా వర్ధిల్ల నేరదు!

( పక్కగా తిరిగి తన కుర్చీదగ్గిరికి వెళ్ళిపోతూంటాడు. )

తెర పడుతుంది.

తొమ్మిదవ రంగం సమాప్తం

---

## పదవ రంగం

( ఎడ్వర్డ్సు యింటి వరండాలోనే లింకన్ కుటుంబం వుంటుంది. 1860 సం॥ లో వసంతఋతువు. సమయం మధ్యాహ్నం.

కుడిపక్కగావున్న మంచమీద పదేళ్లకొడుకు టాడ్‌ని వాళ్లో కూచోపెట్టుకుని లింకను కూచుని వుంటాడు. హార్వర్డు విశ్వవిద్యాలయంలో చదువుతున్న పెద్దకొడుకు రాబర్టు వయసుగలవాడిలా పొగగొట్టంతో చుట్టపీలుస్తూ, కిటికీదగ్గర కూచుని తండ్రి తమ్ముళ్లకి చెప్పే కథలు వింటూంటాడు. జోష్‌స్పీడు మెంవైపు కూచుని వుంటాడు. )

ఏబీ — ఆరోజుల్లో రోడ్లు బాగోపోడమేకాదు - కొన్నిచోట్ల అసలురోడ్డుకూడా లేదనీ, కాలిబాటలుతప్ప మరేమార్గం వుండేదికాదనీ మరిచిపోకూడదు నువ్వు, టాడ్! ఆచిమ్మచీకట్లలో దారికూడా తెలిసేదికాదునాకు......

విల్లీ — భయమేసేదా?

ఏబీ — అవును, భయంగానే వుండేది.

విల్లీ — ఇండియన్లను చూచి గదూ?

ఏబీ — అబ్బే అదికాదు – ఆచుట్టుపక్కల వాళ్ళెవరూ వుండే వాళ్ళు కాదు. నేనుగాని దారితప్పితే నిష్కారణంగా ఆపిల్లాడు చచ్చిపోతే, దానికి నేనే బాధ్యుణ్ణవుతానుకదా అని భయపడ్డాను. కాని చివరికి యెలా అయితేనే డాక్టర్ను వెతికి పట్టుకున్నాను. అలిసిపోయి వున్నాడేమో పడుకోడానికి సిద్ధంగా వున్నాడు. నావెంట 'రమ్మంటే', 'రాలేనని' మూల్గాడు. 'కాదు కూడదని' వెంట బెట్టు కుని తీసుకు వచ్చాను.

విల్లీ — ఆ అబ్బాయి చచ్చిపోయాడా, నాన్నా !

ఏబీ — లేదు విల్లీ, చచ్చిపోలేదు. జబ్బు యెక్కువగా వుంది. డాక్టరు వచ్చి యెన్నోరకాల మందులిచ్చాడు.

టాడ్ — ఆ మందులన్నీ చేదుగా, విషంలావున్నాయా నాన్నా ?

ఏబీ — ఏమో ! అలాగేవుండి వుంటాయి, కాని అవిమాత్రం మంచి బాగాపనిచేశాయి. దీని తరువాత నేను వాళ్ళని చూడకపోయినా తరుచు వుత్తరాలు రాస్తూవుండేవాళ్ళు. టాడ్ ! అప్పుడు అబ్బాయి నీఅంతే వుండేవాడు. కాని యిప్పుడు పెద్దవాడై పెళ్ళిచేసుకుని నీఅంతకొడుకు తండ్రి కూడా అయ్యాడు. పర్వతాలమీద మంచు అంతా కరిగి నదిలా ప్రవహిస్తూ వొకపెద్ద మైదానం దగ్గిరనించే పోతూంది. ఆ మైదానంలోవున్న వొక పొలంలో వున్నాడా అబ్బాయి యిప్పుడు.

(మేరీ ప్రవేశిస్తుంది.)

మేరీ — రాబర్ట్ ! యింట్లోనేనా చుట్టకాల్చడం ?

రాబ — (చిరాగ్గా) లేదమ్మా (లేచినిలబడతాడు.)

మే రీ — నీకెన్నోసార్లు చెప్పాను, యీావరండాలోనే కాదు, యీాయింటి చుట్టుపక్కల యెక్కడా కూడా చుట్ట కాల్చ డానికి వీల్లేదని......

ఏ బీ — చూడు, మేరీ! విశ్వవిద్యాలయంలో చదువుకుంటున్న కొడుకుని కొంచెం మర్యాదచేసి మాట్లాడాలి, బాబీ! నువ్వువెళ్ళి ఆపాకలో కాల్చుకోరా!

రా బ — అలాగేనండీ!

మే రీ — మళ్లాయింకెప్పుడూ యిలాజరక్కూడదు, తెలిసిందా?

రా బ — సరేనమ్మా. (వెళ్ళిపోతాడు.)

ఏ బీ — మననాయకులూ, దేశనిర్మాతలూ అయిన వాళ్ళ కథలు చెపుతున్నాను పిల్లలికి.

మే రీ — పిల్లలూ! భోజనానికిక వేళయింది.

(అందరూ లేస్తారు వెళ్ళడానికి.)

విల్లీ — తరవాత యేమైందండీ నాన్నగారూ?

ఏ బీ — ఇంకేముంది. అందరూ తరువాత హాయిగా సుఖంగా వున్నారు. ఇకపరుగెత్తివెళ్ళండి భోజనానికి.

(విల్లీ, టాడ్ పరుగెత్తుతారు)

జోష్ — మేరీ! టైము యెంతయిందమ్మా?

మే రీ — నాలుగు దాటింది. (తెరలకుపట్టిన మంచుపొగను చేత్తో దులుపుతుంది.)

జోష్ — ఏబీ! నాలుగుదాటింది. వాళ్ళు యేక్షణంలోనైనా రావచ్చునింక.

ఏ బీ — (లేచినిలబడి) అయ్యో! దేముడా!

మే రీ — (అతన్ని చురుకుగా చూసి.) ఎవరు?

ఏ బీ — తూర్పునించి యెవరోవస్తున్నారు. ఒకతను రాజకీయ వేత్త, పేరు 'క్రిమ్మిన్.' రెండవ అతను ఏదో వ్యాపారం చేస్తున్నాడు, పేరు 'స్టర్విసన్' ... ...

మే రీ — (ఉత్సాహంగా) హెన్రీ - డి - స్టర్విసనా !

ఏ బీ — అవునతనే! మూడవఆయన బోస్టన్‌నించి వస్తున్న గౌరవనీయులు డాక్టర్ బారిక్ గారు.

మే రీ — (చురుగ్గా) దేనికోసంవస్తున్నా రిక్కడికి?

ఏ బీ — ఎందుకు వస్తున్నారో సరిగ్గా తెలియదు - బహుశా యునైటెడ్‌స్టేట్సు అధ్యక్షపదవికి నేను పనికివస్తానేమో చూడ్డానికివస్తున్నారనుకుంటున్నాను. (మేరీ వొకక్షణం నిశ్చేష్టురాలైపోతుంది) మనంయింకా వొకక్రలకొంపలో వుంటూ, పందుల్నికూడా యింట్లోనే రాత్రులు పడుకో బెట్టుకుంటున్నామేమో చూడ్డానికి వస్తూండవచ్చు.

మే రీ — (కోపంగా) ఈవిషయం నాకు ముందుగా యెందుకు చెప్పలేదు ?

ఏ బీ — పొరపాటు మేరీ! మరిచిపోయాను.

మే రీ — తపస్సుచేసినా యీజీవితంలో మనగడప తొక్కని వాళ్ళు అతిథులుగా మనయింటికి వస్తున్నా రనేమాటే మరిచిపోయావా ?

ఏ బీ — వారు అతిథులు కారుగా, ఏదోపనిమీద వస్తున్నా రంతే!

మే రీ — (జుగుప్సగా) అవునవును, చాలా చక్కని పనిమీదే వస్తున్నా రనుకుంటాను! ఈ పడమటివాళ్లు పందులుదొడ్డి లాటికొంపలో, పుగాకువాసనతో యెలావున్నారో చూడ్డానికి వస్తున్నారు గదూ?

ఏబీ — మేరీ! పూర్తిగా మరిచిపోయా నీవిషయమని చెప్పా నుగా?

మేరీ — లింకన్! నేను నీ భార్య నయ్యాను. ఇంతకన్నా నీ బానిసనై వుంటే యింకా యెక్కువ మర్యాదగా చూసే వాడివి. నీజీవితంలో నేనూ భాగస్తురాల్ననీ, నీవిషయాలు తెలుసుకోడానికి నాకూ కొంత కుతూహలం వుంటుందనీ కొంచెం జ్ఞాపకంచేసుకుంటూంటే బాగుండును.

ఏబీ — జోళ్ళు శుభ్రంగా మెరుగుపెట్టుకుంటూనులే మేరీ!

(బాధకలిగిస్తున్న యీసన్నివేశాన్నించి తప్పించుకోడానికని బయటికి వెళ్లిపోయాడు. వణుకుతున్న పెదిమలతో, వస్తున్న దుఃఖాన్ని దిగమింగుకుంటూ మేరీ అతనిపై పేచూస్తూ నిలబడిపోతుంది)

మేరీ — (కూచుంటూ విచారంగా) జోష్! అంతా వింటూనే వున్నావుగా? పెళ్ళిముందునించీ యిదే వరస. ముందు మాట యిచ్చాడు. తరవాత మారిపోయాడు. మళ్ళీ బుద్ధి మార్చుకున్నాడు. మాపెళ్ళి అయి పద్దెనిమిదేళ్ళు అయింది. అప్పటినుంచీ యిదే వరస. అతన్ని పోరు పెడతాననీ, తృప్తిలేదనీ, అతనిలోవున్న వుత్సాహాన్నంతా చంపేస్తున్నాననీ, నాచెప్పుచేతల్లో నడవమంటున్నాననీ అందరూ అనుకుంటూంటారు. నువ్వూ అందరిలాగే అను కుంటున్నావుగదూ?

(జోష్ లేచి నిలబడి ఆమె దగ్గిరిగా వెళ్ళి)

జోష్ — (నెమ్మదిగా) మేరీ! ఏబీసంగతి నేనెరగను గనకనా నిన్ను గురించి అలా అనుకోడానికి.

మేరీ — ఇలాటివ్యక్తి ప్రపంచంలో మరొకరుండరని యెరుగు దును. ప్రపంచంలో గొప్పవారైన వాళ్ళంతా తమజీవి

తాన్ని నిర్దుష్టం చేసుకోడానికై, శత్రువుల్ని జయిస్తూ మిత్రులు తమ నపార్థం చేసుకున్నా లక్ష్యపెట్టక, తమ ఏకైక కార్యసాధనకై పాటుపడతారని చదివాను. కాని అటువంటి లక్షణాలేవీ యితనిలో కనబడవు. ఈజీవితంలో యితనికి శత్రువులంటూ వున్నట్టు లేరు. మిత్రులందరికీ యితనిమీద అచంచలమైన విశ్వాసం వుంది. "చక్కని భవిష్యత్తున్న వాడ" ని అందరూ అనుకోడం, నేనీతన్ని యెరక్కముందే విన్నాను. నేను విన్నది సత్యమేనని నాకు పరిచయమైన తరువాతకూడా విశ్వసించాను. కాని యీ మాటల్లో అతనికెన్నడూ నమ్మకం లేదు. ఒకవేళ నమ్మినా రాబోయే వుజ్వలభవిష్యత్తును తలచుకునే భయపడిపోతాడు. అందుకనే, ఆ మంచేదో రాకుండా వుండాలనే తన శాయశక్తులా యత్నం చేస్తాడు. విచారమయమై, కష్టాలతో నిండిన జీవితబాటని మననంచేస్తూ, భయంకర పరిస్థితుల్లో తన జీవితనాటకం ముగుస్తుందని వూహించుకోడం అతనికొక మామూలై పోయింది. మిన్ను ముట్టే అలలతో, విసుగూవిరామం లేకుండా అచంచలమైన పర్వతాన్ని తాకి, చుట్టుముట్టి, లొంగదీయాలనుకుని విఫలయత్నమైనట్టు, నేనూ అపజయం పొందాను. తొలిసారిగా అతనిజీవితంలో గొప్ప సదవకాశంవచ్చింది కాని నేనేమీ చేయలేను. ఈ అవకాశా న్నతడు చేజేతులా జారవిడవకూడదు, దాన్ని సద్వినియోగం చేసుకోవాలి. అతన్ని వొప్పించలేక నాకు విసుగుకూడా వస్తూంది. (ప్రాణం విసిగిపోయింది. (కళ్ళనీళ్ళు పెట్టుకుంది.) అతడు మెరుగుపెట్ట

దగినవాడనీ, అతన్ని తీర్చిదిద్దాలనీ అనుకున్నాను. నాశక్తి అంతా పోయిందిగాని అతన్ని కొంచెం కూడా మార్చ లేకపోయాను......(నిస్పృహగా ఏడుస్తుంది.)

(జోష్ ఆమెపక్క-గాచూచుని తలనిమురుతాడు.)

జోష్ — (జాలిగా) మేరీ! నాకన్నీ తెలుసునమ్మా. ఈవిషయంలో నీది కించిత్తూ తప్పులేదు. నువ్వుచేయవల్సిన వన్నీ చేశావు. విధియెలావుంటే అలాఅవుతుంది. పిచ్చి వాళ్లూ, బిక్షులదగ్గిరనించి సన్యాసులవరకూ అందరినీ కాపాడుతూ, అందరిజీవితాల్ని తీర్చిదిద్దే దైవమే లింకను భావినికూడా నిర్ణయిస్తాడు.

(ఏబీ తిరిగి వస్తాడు.)

ఏ బీ — (జోష్లవంక చూసుకొని.) మేరీ! ఈసారిబాగానే వున్నాయను కుంటాను. (ఏడుపు నాపుకుంటున్న మేరీవంక చూస్తూంటాడు.)

మే రీ — ఆవచ్చే పెద్దమనుష్యుల్ని యీగదిలోనే కూచో పెట్టండి. నేను లోపలికిపోయి వాళ్లకోసం యేదైనాయింత ఫలహారం చేస్తాను.

(వెళ్ళిపోతుంది. ఏబీ ఆమెను జాలిగా చూస్తాడు. కొన్ని క్షణాలు నిశ్శబ్దం.)

ఏ బీ — (ఏమీపట్టనట్టుగా మాట్లాడుతాడు.) ఆ వచ్చేవాళ్లు చాలాపలుకుబడి వున్నవాళ్లనుకుంటాను.

జోష్ — సీవార్డుని వుల్టాసీదాచేసే మూడురాష్ట్రాల్లోనూ వాళ్లదే పైమాట.

ఏ బీ — ఏదైనా అదృష్టంవల్ల వాళ్లుగాని నాపేరు ప్రతిపాదిస్తే నేను యెన్నికల్లో నెగ్గుతానంటావా ?

జో ష్ — నెగ్గేఅవకాశాలు చాలావున్నాయని నావుద్దేశ్యం. ఇప్పటికే వాళ్లునలుగురు అభ్యర్థులున్నారు. వాళ్లల్లో వాళ్లు నాలుగుతేగల్లా కుమ్ముకుంటే ఎక్కడో వెనకనున్న గుఱ్ఱపుపిల్లలా నీకుమంచి అవకాశంవుంటుంది.

ఏ బీ — కాని ఈగుఱ్ఱం సరిగ్గావుంటుందనే నమ్మకమేముంది ?

జో ష్ — అవునవును, నువ్వు స్థిరంగావుంటావని నాకూ నమ్మకం లేదు. అందుకని వాకచిల్లిగవ్వకూడా నీమీద పందెం వొడ్డలేను.

ఏ బీ — (నవ్వుతూ) నాబోటి ముసలాణ్ణి వుత్సాహంతో వురకలూ పరుగులూ వేసే గుఱ్ఱపుపిల్లతో పోలుస్తూంటే నవ్వు వస్తుంది. నన్ను కదం తొక్కించి, పరుగెత్తించి, లగాము వేయించే రౌతులు నలుగురున్నారు. ఎవరో తెలుసా ? ఒకరు - మెంటరు; రెండు - గ్రహామ్; మూడు - బౌలింగు గ్రీన్; నాలుగు - బిల్లీహెర్నెడన్. అందర్నీ మించిపోయే మేరీ వెనకాలేవుంది.

జో ష్ — నీకిప్పుడెవరి లెక్కాలేదు. (ఏబీవంకచూస్తూ) అందర్నీ కాలతన్నేశావు. డగ్లస్‌కు వ్యతిరేకంగా నువ్వుదాడు తీసినప్పుడు మెరుపుతీగలా మెరిసిపోతూ పనిచేశావు. నువ్వు మళ్ళీ ఆపనికి పూనుకుంటే మళ్ళీ అలాగే జయంపొందగలవని నాకు ధైర్యంవుంది. కాని, నీకు అలా నిలబడాలని తోచదుగా అసలు.

( తలుపుశబ్దం. జోష్ లేచి నిలబడతాడు. )

ఏ బీ — వస్తున్నట్టున్నారు.

జో ష్ — నేను లోపలికి వెళ్ళి మేరీకి సాయంచేస్తాను. (తలుపు దగ్గిరకు వెళుతూ ఏబీవంకచూసి మెల్లిగా) ఈదేశంలో

షుమారు 30 మిలియన్లమంది జనం వున్నారు. అంతా నీలాంటి సామాన్య ప్రజలే. వాళ్ళంతా గొప్ప ఆపదలో చిక్కుకున్నారు. "మమ్మల్నీ, మాకష్టాల్నీ యెవరైనా అవగాహన చేసుకుంటారా?" అని యెదురుచూస్తూ న్నారు. వచ్చే ఆపెద్దమనుషులతో కొంచెం మర్యాదగా మాట్లాడు. (ఏబీ నవ్వుతాడు. జోష్ పక్కగా చూస్తాడు.) కాని నీకు నాసలహా పనికిరాదని తెలుసు.

(జోష్ వెళ్ళిపోతాడు. తలుపుతీసుకుని పనిమనిషి, స్టర్విసన్ బారిక్ క్రిమ్మిన్, ప్రవేశిస్తారు. స్టర్విసన్ ధనవంతుడూ, వయసు మళ్ళినవాడు; బారిక్ శాంతంగా, శివిగావుంటాడు; క్రిమ్మిన్ సునిశిత హాస్యం, మంచి తెలివి కలవాడుగా కనబడతాడు.)

ఏబీ — రండి! లోపలికి దయచేయండి. క్రిమ్మిన్! మిమ్మల్ని మళ్ళీ కలుసుకున్నందుకు చాలా సంతోషంగావుంది.

( కరస్పర్శ చేసుకుంటారు )

క్రిమ్మి — లింకన్! కులాసాయేనా? వీరు డాక్టర్ బారిక్, వీరిది బోస్టన్; వీరు స్టర్విసన్‌గారు, వీరిది ఫిలడల్ఫియా.

బారిక్ — లింకన్‌గారా?

స్టర్వి — మిమ్మల్ని కలుసుకున్నందుకు చాలా ఆనందంగావుంది.

ఏబీ — చాలా సంతోషం మీరాకవల్ల. దయచేసికూచోండి.

స్టర్వి — కృతజ్ఞులం ( కూచుంటారు. )

క్రిమ్మి — నేను చుట్ట యిక్కడ కాల్చుకుంటే మీ ఆడవాళ్ళకి అభ్యంతరం లేదుకదా?

ఏబీ — ఫరవాలేదు. కాల్చుకోండి. మీరు వచ్చేప్పటికి ఆవిడ యిక్కడవుండి మీకు స్వాగతం చెప్పలేకపోయి నందుకేమీ అనుకోకండి. ఇప్పుడే వస్తుంది. (కూచుంటాడు)

బారి — (చాలా మర్యాదగా) మీ శ్రీమతిని ముఖ్యంగా పరిచయం కలగజేసుకోవాలని వుంది. "వింటికినారీ, పురుషునికి స్త్రీ" అన్నాడు లాంగ్‌మన్‌కవి.

స్ట్రర్వ్ — (ఠీవిగా) మంచి దృఢమైన వింటినే మనం యెక్కుపెడుతున్నాం! (ఏబీ ఈఅభినందనను తలవంచి, నమ్రుడై అంగీకరిస్తాడు.) సూటిగా దూసుకు పోతుందని ప్రతిష్ట పొందిన విల్లిది. క్షమించి, మేమీఅనుకోకపో తేవచ్చిన విషయాన్ని గురించి మాట్లాడుతాను.

ఏబీ — అలాగే! ప్రయరీమైదానాల్లో అసలు రంగుల్లో వుంటున్న ఈరాజకీయప్రవాణ్ణి చూద్దామని వచ్చారు కాబోలు. వాడిక్కడే హాజరుగా వున్నాడు.

స్ట్రర్వ్ — అడుగువేస్తే దిగబడిపోయే కయ్యా రేపురాబోయే యెన్నిక. అడుసుతొక్కకుండా, కాలుకడగకుండా, సునాయాసంగా, తెలివితేటలతో విజయాన్నిచూరగొనే అభ్యర్థిని వెతుక్కుంటూ యిలావచ్చాం. దేశంలో నాలుగు మూలలావున్న మిత్రులంతా "నీకన్నా సరియైన అభ్యర్థి యింకోడు దొరకడని" చెప్పారు.

ఏబీ — స్టర్వ్‌సన్‌గారూ! న్యూసేలంలో పాతికేళ్లక్రితం నన్ను అభ్యర్థిగా నిలబెట్టిన వారికికూడా మీకులానే నేను మితవాదిగానే వుంటానని మాటయిచ్చాను. అప్పటినుంచీ యెదుగూ బొదుగూ లేకుండా, గొర్రెతోక బెత్తెడు అన్నట్టే వుండిపోయాను.

బారి — (చిరునవ్వుతో) అయితే మాకు కావల్సినవాడివి నువ్వేనని ఒప్పుకున్నావన్నమాట?

ఏ బీ — నీవార్టువంటివారు, మంచి పేరూప్రఖ్యాతీగల్గి, మీారడి గిందే తడవుగా అంగీకారం తెల్పడానికి సంసిద్ధంగా వున్న ప్పుడు నాబోటిసామాన్యునికా గౌరవం దొరుకుతుందను కొనేటంత అహంభావం నాకు లేదండీ, డాక్టర్ బాటిక్ గారూ!

స్ట ర్వీ — ఆమాట కేంగాని, మీారేమీా అనుకోకుండా వుంటే మిమ్మల్ని కొన్ని ప్రశ్నలు వేద్దామనివుంది. ముఖ్యంగా మీా కెటువంటిరాజకీయ, ఆర్థిక, జాతీయ, మతవిషయక భావాలున్నాయో తెల్సుకోవాలని కుతూహలంగావుంది. ఉత్తరాదిలోవున్న పారిశ్రామిక పరిస్థితుల్ని చిలవలు పలవలు పెట్టి, భయంకరంగా సెనేటరు డగ్లసు నీతోటివాద నలో చెప్పినప్పుడు, నువ్వు అతిచాకచక్యంతో దక్షిణాది లోని బానిసవ్యాపారాన్ని గురించి ... ...

ఏ బీ — అవును. ఆవిషయం నాకు గుర్తుంది, స్టర్వీసన్ గారూ! స్వతంత్రరాష్ట్రాల్లోవున్న వుత్తరాదిలోని పారిశ్రామికు లందరికీ సమ్మె చేసే హక్కు వుందని చెప్పడం నిజం గాని, తెలివిగల సమాధానం గాదని మనవి చేస్తున్నాను.

స్ట ర్వీ — దీనివల్ల నీకు పారిశ్రామికుల్లో మంచి పలుకుబడి హెచ్చినందువల్ల చాలా మంచిదే అయింది చివరకి. కాని నాబోటి వ్యాపారస్థుల్లో మాత్రం నీమాటలు కొంత ఆందోళన కలిగించాయి.

ఏ బీ — దీన్ని గురించి నేను అధికంగా చెప్పడాని కేమీా లేదు. అన్యాయాన్ని, అక్రమాన్ని ఎదిరించి, అవసరమైతే దానితో కలపడి జయించే అధికారం వుండాలనే ధర్మ సూత్రంపైనే మనరాజ్యాంగం ఏర్పాటు చేయబడింది.

( బారిక్ వైపు తిరిగి ) బోస్టను 'టీపార్టీ' యెలాటి సత్యాగ్రహమో, మన జాతీయస్వాతంత్ర్యయుద్ధం కూడా అలాటిదే
( స్ట్రీసన్‌తో ) నికోలస్ బిడిల్ బ్యాంకుల నన్నిటినీ పురికొల్పింది జాక్సను ప్రభుత్వాన్ని వ్యతిరేకించడానికే కదా?

స్ట్రీ — ఒకప్పుడివన్నీ నిజం కావచ్చును. కాని ఈనాడటువంటి అరాచకీయమైన పరిస్థితులులేవు. ధనవంతులైన పెట్టుబడిదారుల ధైర్యసాహసాలవల్ల ఎప్పుడూ వూహించనంతగా పరిశ్రమలూ, రైలురోడ్లూ, టెలిగ్రాఫ్‌మార్గాలూ అభివృద్ధిచెందాయి. ఇటువంటి పరిస్థితుల్లో, స్వేచ్ఛాబుజుత్వంవున్న వాళ్ళపాలన కావాలి మనకి, లింకన్! మోటుగా అంటున్నాననుకోకపోతే, నిన్నే ఎన్నికల్లో నిలబెట్టి నెగ్గిస్తే, ధనికవర్గం అభివృద్ధికన్నా, పారిశ్రామికుల మేలే హెచ్చని భావిస్తావా?

ఏబీ — మీరడిగినట్టు నేను దీనికి సూటిగా గాని, మోటుగా గాని సమాధానం చెప్పలేను. నేను ఎన్నికల్లో నెగ్గాలి గదా? నెగ్గిం తరువాత పరిస్థితు లెలావుంటాయో, ఆపరిస్థితుల్లో యేవిధంగా ప్రవర్తిస్తానో యిప్పుడు వూహించి చెప్పడం కష్టం.

స్ట్రీ — ఏదో వొకపక్షాన్నే వుంటావుగాని......

ఏబీ — బానిసత్వాన్ని నిర్మూలించాలనేవాళ్ళలో నేనొకణ్ణని మీకు తెలుసునుగదా?

బారి — ఉత్తరాది న్యూ యింగ్లాండు వాళ్ళమంతా యీవిషయంలో నీతో యేకీభవిస్తున్నాము. దక్షిణాదివారి అక్రమాన్ని నిరసించకుండా వుండలేం......

ఏబీ — (బారిక్ తో) దక్షిణాదిలో నీగ్రోబానిసలమీద చేసే జుల్మ్ కన్నా అధికమైనకష్టాలు మనవాళ్ళు పెడుతున్నారు కొందర్ని. ఇటువంటి వాటిని నేను సహించలేను. (స్టర్విసన్ వైపు తిరిగి) న్యాయమైన ప్రజాప్రభుత్వంలో వీరు వారనే వివక్షత లేకుండా పనిచేసేవాడికీ, చేయించుకునేవాడికీ, అందరికీ సమానంగా జీవించే హక్కు వుంది.

బారి — లింకన్! అన్యాయాన్ని అరికట్టడానికీ, మానవుల ప్రాథమికహక్కుల్ని కాపాడడానికీ మాకేవిధమైన అభ్యంతరం లేదనీ, అందులో నీకు తప్పక సాయం చేయగలమనీ మాట యిస్తున్నాము. కాని ఆ ప్రభువు ప్రమోల అందరం తల లొగ్గాలనే ధర్మాన్ని నీ వంగీకరిస్తావో లేదో తెలుసుకోవాలని కోరుతున్నాం.

ఏబీ — అంటే సర్వాధికారైన ఆ సర్వేశ్వరుని ప్రమోలననేనా మీ అభిప్రాయం?

బారి — అవును.

ఏబీ — ఆతడి అధికారా న్నంగీకరించడంలో నాకెప్పుడూ సందేహంలేదు.

బారి — కాని, అతని నెలవులైన దేవాలయాల అధికారాన్ని నీ వంగీకరించవనే అనుమానం వుంది.

ఏబీ — డాక్టరుగారూ! మీరు చెప్పిందాన్ని నేను శిరసావహిస్తాను. నేనెప్పుడూ దేవాలయానికి వెళ్ళకపోవడంచేత చాలామంది నన్ను నాస్తికు డనుకుంటారు.

బారి — మీరు వెళ్ళకపోవడాని కేదైనా కారణం వుందా!

ఏబీ — నాకు నచ్చినవిధంగా దైవాన్ని ఆరాధించి, ప్రార్థించే

దేవాలయాలేవీ యింతవరకూ నాకంటికి కనపడలేదు. క్రైస్తవమతసిద్ధాంతాల్లో, దైవభక్తితోపాటు, పశ్చాత్తాపాన్ని మిలాయించే యీ ధర్మసూత్రాల్ని నేను మన స్ఫూర్తిగా అంగీకరించలేను. "నీప్రభువైన దేవుని, నీహృదయంతో, మనసుతో, ఆత్మతో సమానంగా ప్రేమించుతూ నీ పొరుగు వానిని నీవుగానే భావించుము" అని శాసించే దైవవాక్యాల్ని విశ్వసించి, ఆచరణలో పెట్టే దేవాలయం యేదైనా వుంటే దాని కనుయాయుడుగా వుండడానికి నాకేవిధమైన అభ్యంతరమూ లేదు. ఇంట్లో మీకోసం మావాళ్ళు యేదో కొద్దిఫలహారం చేస్తున్నట్టున్నారు, వెళ్ళి తీసుకు చక్కావస్తాను...

క్రిమ్మి — అలాగే, లింకన్.

(తలుపు దగ్గిరిగా వేసి వెళ్ళిపోతాడు, క్రిమ్మిన్ తలుపువంక చూసి తరువాత మిగిలిన వాళ్ళకేసి చూస్తూ ఏమంటావు?)

బారి — శుద్ధనాస్తికుడు. ఆదికాలంనాటి సనాతనధర్మాల్ని అనుసరిస్తాననే వితండవాద - పైగా నాస్తికత్వం!

ట్రర్వి — మీదుమిక్కిలి, అభ్యుదయవాది కూడా!

క్రిమ్మి — అభ్యుదయవాదా? బలే బాగాఅన్నారు. మీ మాటలకి నవ్వుకూడా వస్తుంది.

ట్రర్వి — నవ్వువస్తే నవ్వు క్రిమ్మిన్ - కాని నేనుచెప్పేది విను. నువ్వు అడిగి ప్రశ్నలకి సరిగ్గా సూటైన సమాధానమిచ్చాడా? ఏదో యింకోసమాధానం చెప్పాడు గాని! డగ్లసులా ఇతనూ దయాదాక్షిణ్యంలేని ప్రజానాయకుడు. పేచీలు తెచ్చేరకం!

క్రిమ్మి — నిజమే! గాలిని పోగుచేసి గోల లేవదీసే విషయంలో మాత్రం "బారనమ్" న్నికూడా ఓడించేస్తాడు.

స్ట్రర్వో — తప్పకుండా - కాని యితణ్ణి పెట్టడం హితంకాదు?
క్రిమ్సి — క్షేమంకాదూ? క్షేమమంటే నీవుద్దేశ్యమేమిటోయ్!
స్ట్రర్వో — గుంపుల్ని మెప్పించాలని చూసే వాళ్ళెప్పుడూ, గుంపులమనస్తత్వాన్నే అవలంబిస్తారు. ప్రజల్లో అసంతృప్తీ, అల్లకల్లోలం, అశాంతీ రెకెత్తిస్తాడు ......

క్రిమ్సి — నీవాడ్లు నెగ్గితే మాత్రం చేసేదేముంది? బానిసల కందరికీ స్వతంత్రం యిస్తానంటాడు. దీంతో, మళ్ళీ అశాంతీ, అల్లరీ ఆరంభమౌతాయి. మతవిషయికమైన విషయా ల్లోనూ, ఆర్థికవిషయాల్లోనూకూడా లింకనే నమ్మదగిన వాడుఅని అనుకుంటున్నాను. ఎక్కువగోడవలేకుండా నెగ్గా లనేగదా మనం కోరేది! అలా జరగాలంటే యింత మంచివాడు మనకు దొరకడు! నామాట నమ్మండి. (ఏబీ వెళ్ళినవేపు వేలితో చూపుతాడు)

స్ట్రర్వో — (నవ్వుతూ) నువ్వు చెప్పేవన్నీ నిజమైతే బాగుండును.
బారి — మేమూ అదే అనుకుంటున్నాం!

క్రిమ్సి — ఓటు వేసేవాళ్ళంతా ఆలోచనలేకుండా అమాయ కంగా గొర్రెదాటువాళ్ళలా వుంటారని మనం నమ్మితే, వాళ్ళలోవున్న ఆ బుద్ధినే యేబీ తనస్వయానికి వుపయో గించుకోగల సమర్థుడు. రైలురోడ్డుగొడవ యెరుగుదురు గదా? తప్పకుండా నెగ్గి తీరుతాడనుకున్న వాడికి దెబ్బ తినిపించా రీమూక. మీ రడిగిన ప్రశ్నలకి సరియైన సమా ధానం చెప్పలేదని మీ రనుకుంటున్నారు గాని నావుద్దే శ్యంలో చక్కగా చెప్పాడని అనుకుంటున్నాను. కార్మిక సమస్యల్ని గురించి ప్రశ్నించు, తక్షణమే తడుముకో

కుండా "ప్రజాప్రభుత్వాన్ని నమ్మేవాణ్ణి నేనం" టాడు. మతాన్ని గురించి నీ అభిప్రాయమేమిటను, "నీపొరుగు వాణ్ణి నీతో సమానంగా చూడు" అని సమాధానం చెప్తా తాడు. దీనికి మీరెవరూ తగిన జవాబు చెప్పలేరు. అందు కని యిలాటివాళ్ళే ఎన్నికల్లో ఓట్లు సంపాయించగల్గిన వాళ్ళని నమ్మండి. ఇప్పుడు మనదగ్గిర యెలా నటిస్తున్నాడో అలాగే రేపు "వైట్‌హౌస్" కి వెళ్ళినా నటించగల సమర్థుడు. మనమెలాచెపితే అలావింటాడు...

బారి — (నెమ్మదిగా, జాగ్రత్తగా మాట్లాడు అన్నట్టు చూస్తాడు.) క్రిమ్మిన్! జాగ్రత్త.

(ఏబీ తిరిగి ప్రవేశిస్తాడు)

ఏబీ — అందరూ దయచేసి భోజనశాల్లోకి రండి, కొద్దిగా మావాళ్ళు యిచ్చే టీ తీసుకుందురుగాని.

బారి — సంతోషంగా వస్తాం.

స్టర్వి — అలాగే వస్తున్నాం. (అతడూ, బారిక్ కలిసి గుమ్మం వైపు వెళతారు.)

ఏబీ — టీయే తాగాలని నిర్బంధంలేదు. ఇంకా కొంచెం చురుగ్గా పనిచేసే దేదైనా తీసుకోవచ్చు మీరు.

(స్టర్విసన్, బారిక్ లోపలికి వెళ్తారు. క్రిమ్మిన్ కాల్చే చుట్ట ఎక్కడ పారేయాలనిచూస్తూంటాడు.)

ఏబీ — (సరదాగా) మరేంఫరవాలేదండీ, కాలుస్తూ రావచ్చు లోపలికి.

క్రిమ్మి — అలాగే మంచిది! (ఏబీనిచూసి నవ్వి భుజంతడతాడు.)

తెరపడుతుంది

పదవ రంగం సమాప్తం.

---

# ప దు నొ కం డ వ రం గం

(ఇలినాయస్ రాష్ట్రభవనంలో లింకన్ ఎన్నికల 'హెడ్ క్వార్టర్సు' పెట్టుకుంటాడు. 1860 నవంబరు 6 వ తేదీ సాయంకాలం ఎన్నికల రోజు.

గది బాగా పెద్దది. కిటికీతలుపులు బయటికి వరండాలోకి తెరచుకుని వుంటాయి. గోడ పైభాగంలో గాలి కిటికీలు గుమ్మానికి కుడిఎడమవైపుల వుంటాయి. ఎడంవైపు బల్లమీద, కాగితాలూ, వార్తాపత్రికలూ చిందర వందరగా పడివుంటాయి. గది నిండా కుర్చీలూ, పీకిదానాలు వుంటాయి.

వెనకపక్క, 33 రాష్ట్రాల ఓట్లజాబితాలతో పెద్ద బోర్డు వేలాడుతూంటుంది. దాని పక్కగా 'పోస్టర్లు' అంటించడానికి కాళీస్థలం వదిలివేయబడి వుంటుంది. చాలా ఎత్తులో వున్న 'అర్కన్ సాస్, అలబామా' రాష్ట్రాలు అందుబాటులో వుండడానికి గోడకి చిన్ననిచ్చెన వేసివుంటుంది. ఎడంవైపు గోడకి అమెరికా జెండా వేలాడుతూంటుంది. కుడివైపుగోడకి యునైటెడ్ స్టేట్సుపటం, ఎరుపూ, నీలంరేక తెలుపూ, తెలుపూ నలుపూ రంగుల జెండాలతో ప్రతీ రాష్ట్రం గుర్తించబడి వుంటుంది.

పత్రికల్లోని కత్తిరింపు కాగితాల్ని చదువుకుంటూ ఏబీ ప్రేక్షకులవైపు వీపుపెట్టి బల్లదగ్గిర చదువుతూ వుంటాడు. తలమీద టోపీ, కళ్ళకి జోడూవున్నాయి. ఏబీభార్య మేరీ బల్లకి కుడివైపు కూచుని మాటిమాటికీ ఏబీ వంకా దేశపటం వంకా ఆత్రంగా చూస్తూంటుంది.

ఆవిడప్రక్కనే రాబర్టు లింకనూ కూడా నిలబడి దేశపటంవంకే చూస్తూంటాడు. బల్లకి ఎడంప్రక్కగా 'నినియన్ ఎడ్వర్డ్సు' కూచుంటాడు. చార్టుదగ్గిరే జోష్‌స్పీడు నిలబడతాడు.

ఎడంవైపు తలుపు తీసివుంటుంది. టెలిగ్రాఫ్ మిషను టకటకా శబ్దం వినబడుతూ వుంటుంది. కిటికీతలుపు కొద్దిగా తీసివుంటుంది. దీంట్లోంచి, నెమ్మదిగా బేండ్ సంగీతం, ప్రజలు కింద చేస్తున్న

కుండా "ప్రజాప్రభుత్వాన్ని నమ్మేవాణ్ణి నేనం" టాడు. మతాన్ని గురించి నీ అభిప్రాయమేమిటను, "నీపొరుగు వాణ్ణి నీతో సమానంగా చూడు" అని సమాధానం చెప్తాడు. దీనికి మీారెవరూ తగిన జవాబు చెప్పలేరు. అందు కని యిలాటివాళ్ళే ఎన్నికల్లో ఓట్లు సంపాయించగల్గిన వాళ్ళని నమ్మండి. ఇప్పుడు మనదగ్గిర యెలా నటిస్తున్నాడో అలాగే రేపు "వైట్ హౌస్" కి వెళ్ళినా నటించగల సమర్థుడు. మనమెలా చెపితే అలావింటాడు...

బారి – (నెమ్మదిగా, జాగ్రత్తగా మాట్లాడు అన్నట్టు చూస్తాడు.) క్రిమ్మిన్! జాగ్రత్త.

(ఏబీ తిరిగి ప్రవేశిస్తాడు)

ఏబీ – అందరూ దయచేసి భోజనశాల్లోకి రండి, కొద్దిగా మావాళ్ళు యిచ్చే టీ తీసుకుందురుగాని.

బారి – సంతోషంగా వస్తాం.

స్టర్వి – అలాగే వస్తున్నాం. (అతడూ, బారిక్ కలిసి గుమ్మం వైపు వెళతారు.)

ఏబీ – టీయే తాగాలని నిర్బంధంలేదు. ఇంకా కొంచెం చురుగ్గా పనిచేసే దేదైనా తీసుకోవచ్చు మీారు.

(స్టర్విసన్, బారిక్ లోపలికి వెళ్తారు. క్రిమ్మిన్ కాల్చే చుట్ట ఎక్కడ పారేయాలనిచూస్తూంటాడు.)

ఏబీ – (సరదాగా) మరేంఫరవాలేదండీ, కాలుస్తూ రావచ్చు లోపలికి.

క్రిమ్మి – అలాగే మంచిది! (ఏబీనిచూసి నవ్వి భుజంతడతాడు.)

తెరపడుతుంది

పదవ రంగం సమాప్తం.

# ప దు నొ కం డ వ రం గం

(ఇలినాయస్ రాష్ట్రభవనంలో లింకన్ ఎన్నికల 'హెడ్ క్వార్టర్సు' పెట్టుకుంటాడు. 1860 నవంబరు 6 వ తేదీ సాయం కాలం ఎన్నికల రోజు.

గది బాగా పెద్దది. కిటికీతలుపులు బయటికి వరండాలోకి తెరచుకుని వుంటాయి. గోడ పైభాగంలో గాలి కిటికీలు గుమ్మానికి కుడిఎడమవైపుల వుంటాయి. ఎడంవైపు బల్లమీద, కాగితాలూ, వార్తాపత్రికలూ చిందర వందరగా పడివుంటాయి. గది నిండా కుర్చీలూ, పీకిదానాలు వుంటాయి.

వెనకపక్క, 33 రాష్ట్రాల ఓట్లజాబితాలతో పెద్ద బోర్డు వేలాడుతూంటుంది. దాని పక్కగా 'పోస్టర్లు' అంటించడానికి కాళీస్థలం వదిలివేయబడి వుంటుంది. చాలా ఎత్తులో వున్న 'ఆర్కాన్ సాస్, అలబామా' రాష్ట్రాలు అందుబాటులో వుండడానికి గోడకి చిన్న నిచ్చెన వేసివుంటుంది. ఎడంవైపు గోడకి అమెరికా జెండా వేలాడుతూంటుంది. కుడివైపుగోడకి యునైటెడ్ స్టేట్సు పటం, ఎరుపూ, నీలం లేక తెలుపూ, తెలుపూ నలుపూ రంగుల జెండాలతో ప్రతీ రాష్ట్రం గుర్తించబడి వుంటుంది.

పత్రికల్లోని కత్తిరింపు కాగితాల్ని చదువుకుంటూ ఏబీ ప్రేక్షకులవైపు వీపుపెట్టి బల్లదగ్గిర చదువుతూ వుంటాడు. తలమీద టోపీ, కళ్ళకి జోడూవున్నాయి. ఏబీభార్య మేరీ బల్లకి కుడివైపు కూచుని మాటిమాటికీ ఏబీ వంకా దేశపటం వంకా ఆత్రంగా చూస్తూంటుంది.

ఆవిడప్రక్కనే రాబర్టు లింకనూ కూడా నిలబడి దేశపటంవంకే చూస్తూంటాడు. బల్లకి ఎడంప్రక్కగా 'నినియన్ యొడ్వర్డ్సు' కూచుంటాడు. చార్టుదగ్గిరే జోష్‌స్పీడు నిలబడతాడు.

ఎడంవైపు తలుపు తీసివుంటుంది. టెలిగ్రాఫ్ మిషను టకటకా శబ్దం వినబడుతూ వుంటుంది. కిటికీతలుపు కొద్దిగా తీసివుంటుంది. దీంట్లోంచి, నెమ్మదిగా బేండ్ సంగీతం, ప్రజలు కింద చేస్తున్న

గోలా, అనుక్షణం భవనంమీద 'మేజిక్ లాంతరు' వేస్తున్న ఎన్నికల ఫలితాలు కనబడుతూంటాయి. టెలిగ్రాఫ్ ఆపరేటర్ జడ్ ఎడంవైపునించి మధ్యమధ్యలోవచ్చి క్రొత్తవార్తల్ని చార్టులో అంటిస్తుంటాడు. జడ్ అందించే వార్తల్ని ఫిల్ బయట వరండాలో నిలబడి అందుకుంటూంటాడు.)

రాబర్టు — ఈ పటంలో అంటించిన రంగురంగుజండాల అర్థమేమిటో?

జోష్ — ఎర్రరంగుజండాలున్న స్థలం నిస్సందేహంగా మనది. తెలుపూ నీలం సందేహమైన స్థలాన్ని సూచిస్తుంది. ఇక పోతే అపజయాన్ని పొందేచోట్లలో నలుపురంగు పెట్టారు.

(ఏబి చదువుతున్న కాగితాన్ని బల్లమీద పడేసి వేరే కాగితాన్ని తీసుకుంటాడు. జడ్ లోపలికివచ్చి ఇలినాయిస్, మేరీలాండ్, న్యూయార్కు రాష్ట్రాలపైన కొత్తవార్తల్ని అంటిస్తాడు. నినియన్ లేచిచూస్తాడు.)

నిని — లింకన్, డగ్లసుల మధ్య 'ఇలినాయిస్' లో పోటీ చూపువాసిగావుంది. (జోష్, రోబర్టు చార్టుదగ్గిరికి మూగుతారు.)

జోష్ — మేరీలాండ్‌రాష్ట్రం బెర్కెన్‌రిడ్జి బెల్‌ల పక్షంలోవుంది. ఏబీ! మేరీలాండ్‌లో నీపేరు వుప్పాపత్రికలోకూడా లేదు.

మేరీ — (చాలా ఆత్రంగా) న్యూయార్కు సంగతేమిటి?

జడ్ — (కిటికీదగ్గిరిగా వెళ్లి) చూడు ఫిల్! నీకు తాజావార్తలు రాకపోతే ఆ కిటికీ కొంచెం మూసేయి. వాళ్ళ గోలవల్ల యేమీ బుర్రకి తట్టడంలేదు.

ఫిల్ — సరే! మళ్ళీ వెంటనే తియ్యాలిగా? (కిటికీ వేసేస్తాడు.)

మేరీ — న్యూయార్కువిషయ మేమిటని కబురు?

(జడ్ వెళతాడు.)

నిని — డగ్లసుకు 117 వేలూ, ఏబీకి 106 వేలూ ...

మేరీ — ( విచారంగా, ఏబీనిచూసి ) ఏబీ ! న్యూయార్కులో అతడు నీమీద విజయంసాధించాడు.

జోన్స్ — అప్పుడే అయి పోలా, మేరీ! ఈలెక్కలన్నీ డగ్లసుకు మంచి బలం వున్న ప్రాంతాల్లోంచి వచ్చింది మాత్రమేను.

ఏబీ — ( పత్రిక కత్తిరింపుల్ని వుత్సాహంగా చూస్తూ ) న్యూయార్కు హెరాల్డు నన్నుగురించేమి వ్రాసిందో విన్నారా ? "కోతిఆకారపు దేవత" నట నేను. ( అది చదవడం పూర్తిచేసి వేరే కత్తిరింపు కాగితం తీసుకు చదువుతాడు. )

నిని — ( తనకుర్చీలో తిరిగికూచుని ) రోడ్ద్వీపంలోని ఎరుపు జండాతీసి తెలుపుగా మార్చేయి; బాబ్ ! నాకు దాన్ని చూస్తే సందేహాంగా వుంది. ( రాబర్టు యేదో వొకపని చేద్దామనే వుద్దేశ్యంతో దాన్ని మార్చేస్తాడు. )

మేరీ — నినియన్ ! పెన్సిల్ వేనియాలో మన పరిస్థితు లెలా వున్నాయి ?

నిని — ఏబీ కక్కడ యేమీ ఫరవాలేదు. మేరీ ! మన కప జయం కలుగుతుందని విచారించవల్సిన పనిలేదు.

మేరీ — ( కోపంగా ) ఇదేమాట సాయంకాలంనుంచీ పాడు తున్నావు. 'విచారించక' ని తేలిగ్గా అంటావు. తాజా వార్త ప్రతిదాంట్లోనూ డగ్లస్సే నెగ్గుతున్నట్టు వస్తుంటే, విచారించకుండా యెలావుండను ?

జోన్స్ — అలాగే ప్రతీకబురూ ఏబీ నెగ్గుతున్నాడని చెప్పు తుందిగా.

నిని — (శాంతంగా) న్యూయార్కు మొత్తం ఓట్లన్నీ లెక్క పెట్టనియ్యి, వైట్ హౌసుకు రాజమార్గం అదే చూపెడు తుంది.

మేరీ — త్వరగా యెందుకు చేయరు. లెక్కలు పెట్టడాని కింత ఆలస్యమా?

ఏబీ — (పరధ్యానంగా) వస్తాయి త్వరలోనే!

(బిల్లీ హేండర్సన్ కుడివైపునించి ప్రవేశిస్తాడు. బాగా తాగి వున్నా మాట బాగానే వస్తూంటుంది.)

బిల్లీ — అబ్బా! ఆ జనం అల్లరి కర్థంలేదు. మంచీ చెడూ లేకుండా, గోడమీద కొత్తకబురు పడేసరికల్లా కేకలు వేసేస్తున్నారు. జార్జి వాషింగ్టన్ బొమ్మని చూసినా అల్లరే, యింకే అనామధేయుణ్ణి చూసినా ఒకటే గోల.

జోష్ — వాళ్లకి మంచీచెడూలేదు. విచక్షణ వుంటేనా?

బిల్లీ — (ఏబీతో) కింద యెందరో పత్రికావిలేఖర్లు నీకోసం పడికాపులుపడి కూచుని వున్నారు. నువ్వు నెగ్గింతరువాత ముందేపని చేస్తావో తెలుసుకోవాలని కుతూహల పడు తున్నారు.

నిని — ఏబీ! వాళ్లకేమి జవాబుచెప్పమంటావు?

ఏబీ — (చదువుకుంటూ) గడ్డం పెంచుకోవా లనుకుంటున్నా నని చెప్పండి.

జోష్ — గడ్డమా?

నిని — (వెటకారంగా) బలే చక్కని భావం తట్టింది బుర్రకి!

ఏబీ — (కత్తిరించిన వార్త తీసుకుంటూ) "మీసాలూ, గెడ్డం పెంచుకోండి. అలాచేస్తే మీకు పెద్దమనిషి తరహా వస్తుంద"ని వొక చిన్నఅమ్మాయి ఈమధ్య నా కొక

ప్రత్యుత్తరం రాస్తూ సలహా యిచ్చింది. అందుకని ఎన్నికల్లో నెగ్గితే తప్పకుండా ఆపిల్ల చెప్పినట్టే చేస్తాను.

( జడ్ తాజా వార్తలతో ప్రవేశిస్తాడు. బిల్లీ, నినియన్, జోష్, రాబర్ట్ జడ్‌ను చుట్టుముట్టి అతను అందిస్తున్న వార్తల్ని చూస్తూంటారు. )

మేరీ — ఇప్పుడెలా వున్నాయి పరిస్థితులు ?

( జడ్ కిటికీ దగ్గిరకి వెళ్ళి ఫిల్‌కి కొన్ని వార్తలు అందిస్తాడు. )

మేరీ — న్యూయార్కు నుంచి యింకేమైనా కొత్తవార్త వచ్చిందా ?

నినియన్ — కేన్నెక్టికట్‌లో ఏబీదే జయం. దీంతో పదకొండు చోట్ల నెగ్గాడన్నమాట. మిస్సోరీలో డగ్లసుకు 35 వేలూ, బిల్లీకి 33 వేలూ, బెర్కెన్‌రిడ్జికి 16 వేలూ, లింకనుకు ఎనిమిది వేలూ ...

( బయటిజనం గోలతో ఫిల్ కిటికీ మూసేస్తాడు. జడ్ ఎడంవైపు నున్న ఆఫీసులోకి వెళ్ళిపోతాడు. )

మేరీ — వాళ్ళెందుకంత అల్లరి చేస్తున్నారు ?

బిల్లీ — వాళ్ళకే తెలియదు !

ఏబీ — ( ఇంకొక కత్తిరించిన కాగితం చదువుతూ ) చికాగో టైమ్సు పత్రికలో "లింకన్ అపజయం - అతని గుండె బద్దలైపోయింది - మాటపెగల్లేదు - కాళ్ళు తడబడ్డాయి - కింద పడిపోయాడు. అక్కడి ప్రజ లతనితో సహకరించడానికే నిరాకరించారు. అతన్ని ఎగతాళి చేశారు. ప్రజానాయకుడు డగ్లసేనని రుజువైంది. ప్రత్యర్థిని చిత్తు చేశాడు డగ్లసు." ( కాగితం విసిరేస్తాడు. మేరీ లేచి నిలబడుతుంది. )

మేరీ — (వణుకుతున్న కంఠంతో) నేనింక దాన్ని యే మాత్రం భరించలేను.

ఏబీ — అవును. నువ్వు యింటికి వెళ్లు. నేనుకూడా కొంచెం సేపట్లో వచ్చేస్తాను.

మేరీ — (మతిచలించిన దానిలా) నే నింటికి వెళ్ళను. ఎలా అయినా నేను వదిలిపోతే చాలనిచూస్తున్నావుగదూ? నన్ను పెళ్ళిచేసుకు నేముందూ, తరువాతాకూడా నాపీడ యెప్పుడు వదలుతుందా అనే చూస్తున్నావు నువ్వు. నీ కంటికి నేను కనబడకుండా పోవాలని యేదైనాచేస్తావు. (జోష్, నినియన్, బిల్లీల వైపు తిరిగి) మీరంతా అతని స్నేహితులేగా - అతనితోపాటు మీరు కూడా నేను యిక్కడనించి పోతేబాగుండునని చూస్తున్నారు. నేనంటే అందరికీ అసహ్యం.

జోష్ — అలాఅనకు మేరీ!

(రాబోయేఉపద్రవాన్ని గ్రహించి ఏబీ లేచినిలబడతాడు. అప్పటికే ఆతను అలిసిపోయివున్నాడు. మేరీ పిచ్చిచేష్టల్ని వోపికగా భరించ గల శక్తిలేదని దగ్గిర నినియన్ వంకా మిగిలినవారివంకా చిరాగ్గా చూస్తాడు.)

ఏబీ — మీరంతా కొంచెం అవతలికి వెళతారా?

నిని — అలాగే, ఏబీ!

(ఆతనూ, మిగిలినవాళ్ళూ టెలిగ్రాఫ్ ఆఫీసులోకి వెళ్లిపోతారు. జోష్ రాబర్టునుకూడా రమ్మనమని సౌంజ్ఞచేస్తాడు. రాబర్టు తల్లిని కోపంగాచూసి వెళ్ళిపోతాడు. ఏబీ మేరీమీద వుగ్రుడైపోతాడు)

ఏబీ — నాశనమై పో! నలుగురిలో నన్ను నవ్వులపాలుచేసి నువ్వు నవ్వులపాలై పోతున్నావు. ఇంటి నాలుగుగోడల మధ్యా నువ్వుచేసే గొడవ యెలా భరించగల్గుతున్నానో

ఆ దేముడికే యెరుక, అదిచాలక యిక్కడ యీజనంలో కూడానా ? మళ్ళీ యెప్పుడైనా యిలాచేసావంటే చూడు. వినపడుతూందా ? మతిలేనిదానిలా యిలా మళ్ళీ చెయ్యాలి !

( ఈ మాటలకు మేరీ కొయ్యబారిపోతుంది. )

మేరీ — ( నెమ్మదిగా ) ఏబీ ! నన్ను శపించావా ? నన్నేమి చేశావో నీకు తెలుసా ఏబీ ! శపించావుగదూ ?

( మళ్ళీ కోపంముంచుకువచ్చి తిట్టాలనివున్నా యేబీ ఎంతో ప్రయత్నంతో దాన్ని అణచుకుంటాడు. )

ఏబీ — ( విసుగ్గా ) మేరీ ! కోపం ఆపుకోలేకపోయాను. ఏమీ అనుకోక. నువ్వు యిక్కడవుండి యీ యమయాతన అనుభవించేదానికన్నా యింటికి వెళ్ళిపోవడం మంచిది.

( మేరీ అతనివైపు ఓచ్చిచూపుచూసి గుమ్మంవైపు వెళ్ళుతుంది. )

మేరీ — ( గుమ్మం దగ్గిర ) నేను చిన్నప్పుడు స్ప్రింగుఫీల్డులో వుండగా కన్న కలయిది. ఎందరో వయసూ, ధనం వున్నవాళ్ళు నన్ను ప్రేమించి, అర్థిస్తే కాలతన్ని నిన్ను కోరాను. నాభర్త యునైటెడ్ స్టేట్సు అధ్యక్షుడౌతాడనే యిన్నాళ్ళూ బతికున్నాను. ఆరోజురానేవచ్చింది. అతను అధ్యక్షుడైనా లాభంలేదు — నాకిక ముక్తిలేదు. ఆలస్యమైపోయింది... (తలుపు తీసుకుని వెళ్ళిపోతుంది. ఏబీ ఆమె వంక బాధగాచూస్తూ ఆమె వెళ్ళిపోతూంటే చటుక్కున లేచి ఎడంవైపు తలుపు తీస్తాడు.)

ఏబీ — ( కేకవేస్తూ ) బాబ్ ! ( బాబ్ వస్తాడు. ) మీ అమ్మ వెంటవెళ్ళు.

రాబ — వెళ్ళాలాండీ ?

ఏబీ — అవును! త్వరగా! నేనింటికి వచ్చేదాకా వెంటవుండు.

( రాబర్టు వెళ్ళిపోతాడు. ఏబె కిటికీవైపు వెళతాడు. ఫిల్ కిటికీ తెరుస్తాడు. )

ఫిల్ — మీరు నెగ్గుతారని నమ్మకమేనా, లింకన్‌గారూ?

ఏబీ — తప్పకుండా. బాధపడాల్సిన పనేమీ లేదు.

( బయట ప్రజలు పాడతారు. )

వచ్చాడు లింకనూ వచ్చాడూ పంకమూనుంచీవచ్చాడు
పంకమ్మూనుంచీ వచ్చాడూ
పంకమూనుంచీ వచ్చాడూ
వచ్చాడు లింకనూ వచ్చాడూ పంకమునుంచీ వచ్చాడూ
జలజమూ మాడ్కి వచ్చాడూ
తళతళమంటూ మెరిసాడూ ॥ వ ॥

( నినియన్, జోష్, బిల్లీ, జడ్ వస్తారు. జడ్ తాజావార్తలు తెచ్చాడు. ఆవార్తలన్నీ విన్నాక కిటికీమూసేస్తాడు. జడ్ మళ్లీ వెళ్లిపోతాడు. )

నినీ — నీకు దక్షిణాలుగు 'ఎలక్టరల్' వోట్లురావడం తథ్యం. ఇంకా ఇరవై యేడుకూడా రావచ్చు. న్యూయార్కు నీజయ భేరీ మోగించి తీరుతుంది.

( ఏబీ గదిలో అటూ యిటూ పచారు చేస్తాడు. జోష్ ఏబీ వంకే చూస్తూంటాడు. )

జోష్ — ఏబీ! ఒక్క గుక్కెడు కాఫీ తేనా?

ఏబీ — అక్కరలేదు, జోష్.

నినీ — ఏబీ! భయపడుతున్నావా?

ఏబీ — లేదు. నాకోసం ఆలోచించడంలేదు, కాని నేనేగాని ఓడిపోతే ఆవిడ కెటువంటి దెబ్బో! ఆలోచిస్తున్నాను.

నిని — నాసంగతేమిటి! నీమీద 10వేల డాలర్లు పందెం కట్టాను.

బిల్లీ — (చిరాగ్గా) ప్రజలకు కలిగేహాని వీటన్నిటి కన్నా యెన్నో రెట్లధికంగా వుంటుంది.

జోష్ — నీ కెలావుంది ఏబీ ?

ఏబీ — (కిటికీదగ్గరవున్న కుర్చీమీదకూర్చుని) యెంతో బరువుతగ్గి యెప్పుడూపొందని శాంతిని పొందుతాను.

(జడ్ క్రొత్తవార్తతో ప్రవేశిస్తాడు.)

జడ్ — క్రొత్తటపావచ్చింది. యిదిగోనండి. (అందించి వెళ్ళి పోతాడు.)

నిని — (చదువుతాడు) "షుమారు 9 గం॥లకుసాయంకాలము దగ్గను, యాభై వేల మెజారిటీతో న్యూయార్కులో లింకన్ని ఓడించారని, స్టేట్ వారి వశమైపోయిందనీ శ్రీ అగస్ట్ బెల్మాంటుగారు వెల్లడించారు."

బిల్లీ — ఏడిసాడు, వెధవ బెల్మాంట్!

(క్రిమ్మిన్ చుట్ట కాల్చుకుంటూ తృప్తిగా నడుస్తూవస్తాడు.)

క్రిమ్మి — సుప్రభాతం, అందరికి. అంతా యెలావున్నారు ప్రస్తుతం ?

(అందరూ తిరిగి నమస్కారం చేస్తారు)

నిని — క్రిమ్మిన్! దీన్ని చూడు. (టపా అందిస్తాడు.)

క్రిమ్మి — (నవ్వి) బెల్మాంట్ చివరిదాకా యుద్ధంచేయదలచుకొన్నాడు. దాంట్లోయిదొకరకమైన యెత్తుగడ. నేను చికాగోనుంచే వస్తున్నాను. అక్కడ భయపడవలసిన వాతావరణం యేమీ కనుపించలే. లింకన్! ఈరాత్రికి నిన్ను వుద్యోగంకోసం పీక్కుతినేవాళ్ళు చాలామందే

తయారవుతాను. నిన్ను వాళ్ళనుండి రక్షించడానికే నే నిక్కడికి యిప్పుడువచ్చాను. మెట్లదగ్గర అప్పుడే యెంత మంది తయారయ్యారో చూడు. మంత్రిపదవికి నలుగురు, సెక్రెటరీలుగా పదకొండుమంది తయారవడానికి దారిలో సిద్ధంగా నుంచునున్నారు. (జడ్ మళ్ళీకొన్ని తాజావార్తలు తెస్తాడు. వాటిని చార్టుమీద అంటించి ఫిల్ కి కొన్ని అందివ్వడానికి కిటికీదగ్గరకువెళ్తాడు.)

బిల్లీ — (చార్టుదగ్గరకువెళ్ళి) న్యూయార్కునుంచి తాజా వార్త! డగ్లసుకు నూటయనభై మూడు వేలఓట్లు, లింకన్ కు నూటయనభై యొక్క వేలు! (జడ్ వెళ్ళిపోతాడు.)

జోష్ — బయటకుచూడు, ఏబీ! నువ్వు బాగా అందుకుంటున్నావు.

క్రిమ్మి — న్యూయార్కునుండివచ్చేవార్త తప్పకుండా నీవు నెగ్గినట్టేవచ్చితీరుతుంది. లింకన్, నామాటనమ్ము. ఈ రాత్రికే విజయలక్ష్మి నిన్ను వరిస్తుంది. చక్కగా యుద్ధం చేసాము, జయాన్ని చూరగొన్నాము!

ఏబీ — (అటుయిటు పచారుచేస్తూ.) అవును, అక్రమాలతో నిండిన రాజకీయ చరిత్రతో ఒక మహాయుద్ధాన్ని చేసాము; నెగ్గింది నేను. రాజకీయంగా ఋణం తీర్చవలసింది నేనే. నేను నెగ్గడానికి యెవరెవరు కారకులో వారందరి ఋణం నేనుముందు తీర్చాలి. నన్ను పందెములో ఒడ్డేరు. నన్ను కొందరు కొన్నారు. కొన్నివందలసార్లు అమ్మేరు. నాపేరుమీద యెన్నో అన్యాయపు, అసత్యపుబాసలను చేసారు. వాటికన్నిటికి బాధ్యుణ్ణి నేను.

నిని — ఏబీ! ఇవన్నీ మాకు తెలియనవనుకోకు - కాని నువ్వు నెగ్గడంమాత్రం నిజమైనది. చివరికి రోడ్ద్వీపం లోని కూటమిని కూడా విడగొట్టేవు!

ఏబీ — ఒక్క నిమిషం అవతలకివెళ్ళి వస్తాను. (కుడివైపుకు వెళ్తాడు.)

నిని — (సరదాగా) పాపం, యాబీ!

క్రిమ్స్ — మీరంతా పూర్వంనుంచే అతని స్నేహితులుకదూ, నాకొక సందేహముంది తీరుస్తారా? ఈ యెన్నికల్లో నెగ్గడం అతని కయిష్టం అంటారా?

జోష్ — అవుననే, నేను సమాధానం చెప్తున్నా.

క్రిమ్స్ — (కుడివైపుచూచి అయితే మంచిదే... ఇది నాకొక క్రొత్త అనుభవం అనిమాత్రం చెప్పగలను.

బిల్లీ — (అసూయగా) యునైటెడ్ స్టేట్సు అధ్యక్షపదవి నీకిప్పుడు కావలసివచ్చిందా? ఈమధ్య వచ్చే పత్రికల్ని చూడ్డం లేదా?

క్రిమ్స్ — చదువుతూనే వున్నాను. ... జరుగుతున్న వన్నీ చూస్తూనే వుంటినే!

బిల్లీ — (కోపంతో మండిపోతూ) దక్షిణకెరలినాలో పదివేల మంది వాలంటీర్లదళం తయారైందని గుర్తించలేదా? వాళ్ళందర్నీ సాయుధుల్ని చేస్తున్నారు తెలుసా? లింకనే అధ్యక్షుడైతే, డిక్సన్‌కు దక్షిణాన్నివున్న రాష్ట్రాలన్నీ యునైటెడ్‌స్టేట్సునుంచి విడిపోడానికి నిర్ణయించుకున్నాయని గవర్నరు ఒకప్రకటన చేశాడు. దీని అర్థమేమిటో గ్రహించారా? యుద్ధం! అంతర్యుద్ధం! మొదలైతే తన

జీవితాన్నంతా శాంతికోసం అర్పించాడో, రక్తపాతం జరగకుండా అడ్డుకున్నాడో అతని నెత్తిపైనే ఈభయంకరమైన బాధ్యత, అపవాదు వేస్తారు.

నిని — బిల్లీ! శాంతించు. ఇంకో గ్లాసు పుచ్చుకో.

(జడ్ పరిగెత్తుకొస్తాడు)

జడ్ — యడ్వర్డ్సుగారూ యిదిగోండి! (నినియన్‌కు తాజాటపా అందిస్తాడు. కిటికీ దగ్గరకు పరిగెత్తి క్రొత్తగావచ్చిన వార్తని ఫిల్‌కి అందిస్తాడు.)

నిని — (పైకి చదువుతాడు) "రాత్రి పదిన్నర గంటలకు లింకన్ యిరవై అయిదువేల మెజారిటీతో యెలక్షన్ నెగ్గాడని న్యూయార్కు పత్రిక హెరాల్డు అంగీకరించింది!" (వార్త గాలిలోకి యెగరవేస్తాడు.) నెగ్గాడు! ఏబీ నెగ్గాడు!

(స్టేజిమీద వాళ్ళంతా ఆనందంతో ఒకర్నొకరు కౌగలించుకొని కరస్పర్శ చేసుకుంటారు.)

బిల్లీ — అంతా భగవంతుడి దయ! అంతా వాడు చేసిందే!

క్రిమ్మిన్ — నాకు యిలా అవుతుందని ముందే తెలుసు! అసలు సందేహంకూడా కలుగలేదు.

(జడ్ వరండాలో నిలబడి మైక్‌లో అరుస్తుంటాడు.)

జడ్ — లింకన్ నెగ్గాడు! నిజాయితీగల లింకనే మనకాబోయే అధ్యక్షుడు!

(క్రిందనున్న జనం పెద్దపెట్టున జయజయధ్వానాలు చేస్తారు. బిల్లీ, ఏబీతో కరస్పర్శ చేస్తాడు. కాని ఆనందంతో నోట మాట రాదు.)

నిని — ఏబీ, న్యూయార్క్ నీదై పోయింది! నెగ్గావు! చాలా సంతోషం!

క్రిమ్స్ — అధ్యక్షా! నా అభివందనా లందుకో. ఈ జయం నీదికాదు, మాఅందరిదీను.

( జడ్ వచ్చి ఏబీ దగ్గరకు వెళ్తాడు. )

జడ్ — లింకన్ మహాశయా! నా ధన్యవాదా లందుకోండి.

ఏబీ — ( ప్రశాంతంగా ) కృతజ్ఞుణ్ని — మీ అందరికి సదా కృతజ్ఞుణ్ణి.

( ఎడమవైపుకి వస్తాడు. అందరికన్నా చివర జోష్ కరస్పర్శ చేస్తాడు. )

జోష్ — ఏబీ! చాల సంతోషంగా వుంది.

ఏబీ — ధన్యుణ్ని, జోష్!

నిని — ఏబీ! క్రింద జనం యెంతగోడవ చేస్తున్నారో విను.

క్రిమ్స్ — లింకన్! ఆ గోలంతా నీకోసమే.

ఏబీ — నే నిప్పు డక్కడకు వెళ్ళను. ముందు యింటికి వెళ్ళి, మేరీ కీవార్త చెప్పాలి. (గుమ్మంవైపు వెళ్తాడు. )

( కేవనేగ్ అనే మిలిటరీ ఆఫీసరు వెంట యిద్దరు సైనికులతో లోపల ప్రవేశిస్తాడు. ) పొట్టిగా, దృఢంగా వుంటాడు.

క్రిమ్స్ — అధ్యక్షులుగారూ, కేప్టెన్ కేవనేగ్ యితడు.

కేవ — ( సెల్యూట్ చేసి ) మీరు నెగ్గిన క్షణంనించే మీ కాపలాగా వెంట వుండాలని ఆజ్ఞాపించారు.

ఏబీ — చాలా కృతజ్ఞుణ్ణి, కాని నా వెంట యెవరూ వుండ నవసరం లేదు.

కేవ — లింకనుగారూ! మేము మీవెంట వుండకతప్పదు. మీకు అనవసరభయం కలిగించడం యిష్టంలేదు, కాని మీకూ తెలిసివున్న విషయమే, మీప్రాణాలకోసం యెలా కాచుకు వున్నారో!

ఏబీ — (నీరసంగా) సరే... జోష్, క్రిమ్మిన్, నినియన్, బిల్లీ! మీఅందరికీ నా నమస్కారాలు. మీఆశీర్వచనాలికి సదా కృతజ్ఞుణ్ణి. (గుమ్మందగ్గిరికి వెళతాడు. తిరిగి అందరూ అభినందిస్తారు.)

కేవ — ఒక్క నిముష ముండండి, నేను ముందు దారి తీస్తాను.

(ముందతడూ, తరువాత ఏబీ, అతని వెనకాల సైనికులూ వెళ్ళిపోతారు.)

పదునొకండవ రంగం సమాప్తం.

---

## పం డ్రెం డ వ రం గం

(1861 సంవత్సరం ఫిబ్రవరినెల, పదకొండవ తేదీ. స్ప్రింగ్ ఫీల్డు రైలురోడ్డు స్టేషను. కుడివైపు రైలుబండి ప్రేక్షకులకు కనబడుతూ వుంటుంది. ఎడంవైపు వెనకభాగంలో పడవలరేవు జండాలతో తోరణాలతో అలంకరించబడి కనబడుతూ వుంటుంది.

ప్రేక్షకులకు కనబడుతూ వరసగా సైనికులు భుజాలమీద సంచుల తోనూ తుపాకీలతోనూ సిద్ధంగా నిలబడి శాంతంగా చూస్తూంటారు. కుడిపక్కనించి జనంచేస్తున్న అల్లరి వినబడుతూంటుంది.

కేవనేగ్ ముందుగా నిలబడివుంటాడు. ఎడంపక్కగా వున్న రైలువేన్ సరిగావుందోలేదోఅని బ్రేక్‌మాన్ దీపంపెట్టి సరిచూసుకుంటూ వుంటాడు.

కుడిపక్క కూలీకారు తుడుస్తూ వుంటాడు. కేవనేగ్ తంబాకు (చుట్ట) నములుతూ అటూయిటూ పచారు చేస్తూంటాడు. ఎడంవైపు నున్న గట్టుమీదనుంచి క్రిందికి సైనికోద్యోగియైన మేజర్ వస్తాడు.)

మేజర్ — మీరంతా గట్టుమీదుగా రావాలి. (కావెనేగ్‌ను చూచి చులకనగా) కేవెనేగ్! ఏదో భయపడుతున్నట్టున్నావు?

కేవ — అవును! తనజీవితం తుచ్ఛమని గర్వపోచగా చూస్తూ నిర్లక్ష్యంగా తిరుగుతూన్న వొక మానవుడి అమూల్య జీవితాన్ని కాపాడ్డానికై మూడు నెలల నుంచి అనుక్షణం విడవకుండా కాపాడుతూ వస్తున్నాను. భయం కాదా మరి? రేపీపాటికి చంపి తీరుతామనీ, మార్చి నాల్గో తేదీన జరిగే అధ్యక్షపదవీ ప్రమాణం జరక్కుండా చేస్తామనీ రిచ్‌మండ్‌లో పందెం వేస్తూంటే విన్నాను.

మేజర్ — ఆ పందెం వాళ్ళెలా నెగ్గుతారో చూద్దాం. మన సైన్యాధిపతిని మనం రక్షించుకోలేకపోం.

కేవ — యునైటెడ్ స్టేట్సు సైన్యం సామర్థ్యంగలదే కావచ్చు కాని, దక్షిణాదివారి నేర్పరితనం మీకు తెలియదు. రైలు ఆగిన ప్రతీచోటా, ప్రతీ కిటికీ గుమ్మం పరీక్షగా చూస్తూ జాగ్రత్తగా వుండమని మీ సైనికులను హెచ్చరించండి. మార్గంలో ఏదైనా ప్రమాదాన్ని సూచించే యీల వినబడితే మాత్రం......

మేజర్ — (కొంచెం గర్వంగా) ప్రమాదపరిస్థితుల్లో ధైర్యంగా వుండమని మావాళ్ళని హెచ్చరించవలసిన అవసరం వుండదండీ?

కేవె — మేజరుగారూ! మిమ్మల్ని కించపరచడానికీ మాటలనడం లేదు నేను — కాని ముందు రాబోయే విపత్తుకు కాచుకుని వుండడం ధర్మం కదా?

(ఎడంపక్కనించి "వచ్చాడు, లింకనూ వచ్చాడు" అనే పాట చాలామంది జనం పాడుతూవుంటారు. రైలుకారులోంచి కండక్టరు దిగి "టైము అయిందన్నట్టు" చేతిగడియారంవైపు చూస్తాడు. ఎడంవైపునించే నినియన్, ఎలిజబెత్, ఎడ్వర్డ్సు, జోష్, బిల్లీ,

క్రిమ్మన్ ప్రవేశిస్తారు. వాళ్ళని సైనికులు ఆపుజేస్తారు. మేజరు గర్వంగా ముందుకువస్తాడు. )

మేజర్ — వెనక్కి వెళ్ళండి. ఈ జనాన్ని ముందుకు రాకుండా ఆపలేరేమిటోయ్ ?

నిని — నేను లింకను తోడబుట్టిన్ణి.

మేజర్ — మీపేరు.

కేవ — మేజర్ ! వార్ని నేనెరుగుదును. వీరు ఎడ్వర్డ్సుగారూ వారిసతీమణీ. వారు స్పీడుగారూ, హెర్న్డన్‌గారూను. వీరందర్నీ నాకు తెలుసు. రానివ్వండి వార్ని.

మేజర్ — అలా అయితేసరే ! వెళ్లండి.

( వాళ్ళందరూ కుడివైపుకు వస్తారు. మేజరు ఎడంవైపుకు వెళ్ళి పోతాడు )

క్రిమ్మ — ప్రెసిడెంటుగారీరోజు ఆనందంగా వున్నారా ?

నిని — ఎప్పటిలాగా విచారంగానే వున్నాడు.

బిల్లీ — (ఆవేశంగా) ఆఫీసుకు రాగానే 'లింకన్ అండ్ హెర్న్డన్' అనేబోర్డు మార్చమంటారా అని అడిగితే, "అలాగే వుండనియ్యి. మనక్లయింట్లకు ఈఎన్నికలవల్ల యేవిధమైన యిబ్బందీ కలగదని చెప్పు. నేనేబతికుండి తిరిగి యిక్కడికి వస్తే, ఎన్నికలనేవి జరగలేదనుకుని, మళ్ళీ ప్రాక్టీసు హాయిగా చేసుకుంటాను." అని అన్నాడు.

ఎలి — ఎప్పుడూ "నేను బతికుంటే" అంటాడు.

( ఎడంవైపు ప్రజల జయజయధ్వానాలు వినబడతాయి. మేజరు త్వరత్వరగా ప్రవేశిస్తాడు. )

మేజర్ — (కేవనాగ్‌తో) అధ్యక్షుడు వచ్చేశారు. (తన సైనికులతో) బహుపరాక్. ( మేజరు నడిచివెళ్ళి కారుపక్కనే నిలబడి ఎడంవైపు చూస్తూ నుంచుంటాడు.)

కేవ — (నినియన్ మిగిలిన వాళ్ళతో) దయచేసి, కొంచెం అవతలికి జరగండి. ప్రెసిడెంటుగారికీ, వచ్చేవాళ్ళకీ తావు చెయ్యాలి.

(వారంతా కుడివైపుకు జరుగుతారు. ప్రజల జయజయ ధ్వానాలు మరీ హెచ్చుగా చెలరేగుతాయి)

మేజర్ — బహు పరాక్! హారా హుషార్!

(మేజరు వస్తున్న సైనికులకు వందనం చేస్తాడు. సైనికులు కుడి ఎడమలకు చూస్తారు. ఏబీ ఎడంపక్కనుంచి స్టేజిమీదకు వస్తాడు. గడ్డం పెంచాడు. భుజంమీద శాలువావుంది. కుడిచేతిలో చక్కని అందమైన 'బేగ్'. ఎడంచేతిలో చిన్నకొడుకు టాడ్ ని నడిపిస్తూ వస్తాడు. వెనకాలే మేరి, రాబర్టూ, విల్లీ, పనిమనిషీ వస్తారు. మేరీ తప్ప అందరి చేతుల్లోనూ 'బేగ్సు' వున్నాయి. మేరీ చేతుల్లో పూలగుత్తులున్నాయి. కారు దగ్గిరకి రాగానే చేతిలోని బేగ్ ని కండక్టరుకు అందించి టేడ్ ని పైకి అందిస్తాడు. మేరీ, రాబర్టూ, విల్లీ, పనిపిల్లా పైకి ఎక్కుతారు. ఏబీ, నినియన్ మొదలైన మిగిలిన వాళ్ళందరితోనూ మాటాడుతూ వుంటాడు. ఎడం పక్కజనం ముందుకు తోసుకువస్తూంటారు.)

మేజ — (ముందుకువచ్చి) వాళ్ళని పక్కగా నెట్టేయండి. వెనక్కి పంపేయండి.

(సైనికులు జనాన్ని వెనక్కి పంపేయడానికి వరసగా ప్లాట్ ఫారంమీద దడిలాగా నిలబడతారు. ప్రతీవాళ్ళ చేతుల్లో రివాల్వరు పేల్చడానికి సిద్ధంగా వుంటుంది. అన్నిపక్కలా పరీక్షగా చూస్తూ వుంటారు.)

కేవ — అధ్యక్షా! పైకిరండి.

(ఏబీ కారువెనక ఎక్కుతాడు. అతన్ని చూసి జనం మరీ జయజయధ్వానాలు చేస్తారు. 'ఏబీ! మాట్లాడు.' 'ప్రెసిడెంట్! ఏదో వొక వుపన్యాసం చెప్పు.' 'ఏబీ సత్యవాది.' అని జనంలోంచి అరుస్తారు. ఏబీ టోపీతీసి గాలిలో వూపుతాడు. జనం నిశ్శబ్దం అయిపోతారు.)

ని ని — ఏబీ! నిన్ను మాట్లాడమని కోరుతున్నారు వాళ్ళు.

(ఒకక్షణంనిశ్శబ్దంగా నిలబడి ఎడంవైపుచూస్తాడు ఏబీ.)

ఏ బీ — ప్రియమిత్రులారా! మీఅందర్నీ శెలవీయమని కోరుతున్నాను. మీఅందరి అంగీకారంతో పెంచిన యీగడ్డాం, మీసంతో వాషింగ్టన్ వెళుతున్నాను. (జనం పకపకా నవ్వుతారు. 'బలేవాడివి. ఏబీ!' అన్నారు కొందరు. ఉత్సాహంతో జనం ముందుకు తోసుకురాబోతారు. సైనికులు వెనక్కి వెళ్ళండి, వెనక్కి జరగండి అని హెచ్చరిస్తారు.) (ఏబి మేజరుతో) వాళ్ళని రానివ్వండి. అందరూ నన్నెరిగిన వాళ్ళూ, నామిత్రులూను.

(మేజరు తనభటులతో కారుచుట్టూ వ్యూహం యేర్పాటు చేస్తాడు. కేవనేగ్ అతని మనుష్యులూ రైలుపెట్టె మెట్లమీద నిలబడి జనాన్ని పరిశీలిస్తూ వుంటారు. జనంలో నీగ్రోలు, పల్లీయులు, నాగరికులూ అందరూ వుంటారు.)

ఏ బీ — మిమ్మల్ని వదిలి, యింతటిబాధ్యతని నెత్తిన వేసుకోడానికెంతటి బాధపడుతున్నానో మీరు గ్రహించలేరు. మీ అందరి ప్రేమానురాగాలవల్లా నే నీ జయాన్ని యీ స్థలంలో పొందాను. పాతికేళ్ళనుంచీ యిక్కడే వుంటూ, నాయావనమంతా యిక్కడే గడిపాను. నా సంతానం కూడా యిక్కడే కళ్ళు తెరిచింది. నా బిడ్డ నొకణ్ణి యిక్కడే భూదేవికర్పించాను. ఎలాటిపరిస్థితుల్లో మళ్ళీతిరిగి మీ అందరిదగ్గిరికీ వస్తానో చెప్పలేనిస్థితిలో వెళ్ళిపోతున్నాను. మన యూనియన్నించి నేడు, పదకొండురాష్ట్రాలు విడిపోవడానికి సిద్ధంగావున్నాయి. అంతర్యుద్ధ మేఘాలావరించిన వాతావరణంలో నేను అధ్యక్షపదవి స్వీకరిస్తున్నాను. మోయ

లేనిభారం నామీాదమోపాను. ఆబాధ్యత చక్కగా నిర్వ
హించకముందే నేను మిమ్మల్ని వొకప్రశ్న అడుగుతాను.
"ఏధర్మసూత్రంమీాద ఆధారపడి మనయూనియన్ యిన్ని
సంవత్సరాలూ నడిచింది ?" మనం మనమాతృదేశా
న్నించి వూరికినే విడిపోలేదు. "మానవులకు స్వేచ్ఛ జన్మ
హక్కు. దాన్ని అందరుమానవులూ అనుభవించాలి" అని
సర్వప్రపంచానికీ చాటాము, మనం స్వతంత్ర ప్రకటనచేసి
నప్పుడు. శృంఖలాల్ని తెంచుకుని స్వేచ్ఛావాయువుల్ని
పీల్చాలనీ, మానవులంతా సోదరులేననీ నిరూపించ
డానికే మనం స్వతంత్రాన్ని కోరాం. అందుకే ప్రజా
ప్రభుత్వాన్ని రూపొందించాం. దీనికిప్పుడు అగ్నిపరీక్షా
సమయం వచ్చింది. ఈప్రజాప్రభుత్వం తన కాళ్ళమీాద
తను స్వతంత్రంగా నిలబడగలదా? లేదా? అనే ప్రశ్న
వచ్చింది. మనకలలన్నీ కరిగిపోయి, దుష్కరవాస్తవ
జగతిలో అడుగుపెట్టేరోజు వచ్చిందా ? అదే నిజమైతే
మన కేనాటికీ ముక్తి మోక్షం లేదు. మానవుడి కిటువంటి
సదవకాశం మరెన్నడూ దొరకదు. సమానత్వం, సౌభ్రా
తృత్వం తుప్పుపట్టిపోయి పనికి రాకుండా పోయిన భావా
లని మనం వొప్పుకోక తప్పదు. ప్రాక్ దేశీయుడైన
సన్యాసి వొకడు, వొకప్పుడు, తన శిష్యుల్ని పిలిచి "సర్వ
కాలాల్లోనూ సత్యమైన వాక్యమేదైనా వొకటిచెప్పండి"
అని అన్నాడట. వెంటనే వాళ్ళు "యిదికూడా నాశనమై
పోయేదే" అన్నారట. (ఆవేశంతో త్వరగా మాట్లాడు
తాడు.) కాని యిదంతా అసత్యమని నమ్ముదాం. మన
చుట్టూవున్న ప్రకృతినీ, మనలోవున్న నైతిక, మానసిక

ప్రకృతుల్నీ బలీయంగా ధృఢంగా పెంపొందించి, వ్యక్తిగతంగా, సాంఘికంగా, రాజకీయంగా, అభ్యున్నతి చెంది చిరకాలం వర్ధిల్లాలని ఆశిస్తున్నాను. దయామయుడైన దైవం మిమ్మల్ని రక్షించాలని ప్రార్థిస్తున్నాను. మీ హృదయాల్లో నాకెప్పుడూ తావుంటుందని ఆశిస్తున్నాను. మిత్రులారా! మీ అందరి దగ్గిరా మరొకసారి సెలవు తీసుకుంటున్నాను.

(రైలుబండి కిటికీలకు ఆనుకొని నినియన్, ఎలిజబెత్, జోష్, బిల్లీ, క్రిమ్మినల దగ్గిర సెలవు పుచ్చుకుంటూ కరస్పర్శ చేస్తాడు. బేండ్ వాయిద్యం మొదలు పెడతారు. ప్రజల జయజయధ్వానాలు మిన్నుముట్టుతాయి. కండక్టరు గడియారంకేసి చూస్తాడు. మేజరు కూడా బండి ఎక్కుతాడు. రంగంమీద కనబడేజనం 'శెలవు! శెలవు!' అంటూంటారు. బేండ్ వాయిద్యంతోపాటు జనంకూడా "అలలూయా నిన్నురక్షించుగాక" అని పాడతారు. ఏబీతో మాట్లాడాలని కేవనేగ్ ప్రయత్నించి అతను మాట్లాడక పోయేటప్పటికి భుజంమీద చెయ్యివేస్తాడు. అతను వెనక్కి చూస్తాడు.)

**కేవ** — ప్రెసిడెంట్‌గారూ! టైమైంది. రైలు కదులుతుంది.

(జనంగోలలో యీమాటలు వినబడవు. నినియన్, ఎలిజబెత్, బిల్లీ, జోష్ అందరూ ఫ్లాట్‌ఫారంమీద నిలబడి వుంటారు. సైనికులుకూడా రైలు యెక్కుతారు. ఏబీ టోపీతీసి జనంవైపు వూపుతాడు. కేవనేగ్ తోడుగా పెట్టెలోకి వెళ్ళిపోతాడు. మేజరూ, సైనికులుకూడా లోపలికి వెళ్ళిపోతారు. బేండ్ నాస్ఫ్యపాట చివరి చరణాలు వాయిస్తూంటే జనంకూడా పాడుతూంటారు.

(బ్రేక్‌మేన్ లైట్ వూపుతాడు. జనం వుత్సాహంగా టోపీలూ, చేతిగుడ్డలూ వూపుతూంటే రైలు కూలవేస్తుంది.)

తెరపడుతుంది.

పన్నెండవ రంగం సమాప్తం.

---

# ఏ బీ లింకన్

ఇలినాయిస్‌లో నివసిస్తూ వున్నప్పటి చరిత్ర సంగ్రహం.

ఈనాటకం వ్రాయడాని కేయే పుస్తకాలూ, జీవితచరిత్రలూ వుపకరించాయో, వాటిని నాకల్పనవల్లా అవసరాన్ని బట్టీ యెలామార్చానో చెప్పడానికీ, ఏబీలింకను ఇలినాయిస్‌లో నివసించేకాలంలో యింకా పూర్తిగా వ్యక్తిత్వాన్ని పొందలేదనీ, యెన్నో సంఘటనల ఫలితంగా అతనిలో అణిగి మణిగివున్న భావసంపద కొకరూపు యేర్పడిందనీ రుజువు చేయడానికే యీ సంగ్రహచరిత్ర వ్రాస్తున్నాను.

లింకను జీవిత చరిత్రలో యే ఘట్టానికీ వ్యతిరేకంగా యీ నాటకం వ్రాయకపోయినా, కొన్ని కొన్ని సందర్భాల్లో రచయితగా కొన్నిమార్పులు చేయడం తప్పలేదనీ, వాటిని పాత్రౌచిత్యతకోసమే చేయవల్సి వచ్చిందనీ మనవిచేస్తున్నాను. చారిత్రకుడిపని జరిగిన సంఘటనలను కాలానుసారంగా చిత్రించడమే తప్ప వ్యక్తుల భావావేశాలకు తగినప్రాధాన్యత నీయడం కాదు. రచయితపని కొన్ని సంఘటనలను ఆధారంగా తీసుకుని వ్యక్తుల హృదయాల్ని చదువరులకు చిత్రించి చూపడం. దీనికై అత డొకొక్కప్పుడు విధిలేక కాలానుగతంగా జరిగిన సంఘటనల్ని పేర్కోలేడు.

ప్రస్తుత నాటకంలో, ఏదో చిన్న చిన్న విషయాల్లో మార్పు కూర్పు జరిగినా, జీవితచరిత్ర మాత్రం యదార్థానికి విరుద్ధంగా వ్రాయలేదు. ముఖ్యంగా లింకను, అతని వుపన్యాసాల

వల్లే చిరఖ్యాతిపొంది అమరజీవయ్యాడు. లింకను జీవితమే ఒాక అపూర్వ ఆఖ్యానం. ప్రజాస్వామ్యచరిత్ర కొక వుజ్జ్వల వుదాహరణం. "సుఖంగా బతుకుతూ, అందర్నీ సుఖంగా బతకనియ్యి" అనేభావం, దానివల్ల కలిగే మానసిక దౌర్బల్యాం, జీవితంలో వచ్చే వడిదుడుకులవల్ల "జోలిమాలిపనికి పోక నీపనిలో నువ్వు నిమగ్నుడవవు" అనే సూత్రంవల్ల కలిగిన చిక్కులతో ప్రజాస్వామ్యవాదులు కళ్ళు తెరవక తప్పలేదు. దీనివల్ల అన్యాయాలూ అక్రమాలూ దురాక్రమణలతోనూ ప్రజాస్వామ్యవాదులు పోరాడక తప్పలేదు. దానికేవిధంగా లింకను గురైయ్యాడో అందరికీ తెలుసు.

లింకను మనోవ్యథ, అతడు బాధ్యతానిర్వహణ అంగీక రించక పూర్వం పడిన యాతనా, దానిఫలితంగా అతడు పలికిన ప్రతీమాట అమెరికా హృదయతంత్రులు మోగి నప్పు డుద్భవించిన బాధారవళే! అందుకనే అతని పలుకులు, అమరవాక్కులై పోయాయి. అవి చెరగని వేదవాక్కులు.

'థ్రిప్రెయిరీ యియర్సు' వ్రాసిన సేనడ్‌బర్గుగారికి రచయిత నైన నేనెంతో ఋణపడి వున్నాను. అలాగే హెర్నెన్‌డన్ గారు వ్రాసిన లింకను చరిత్రా, లేఖావళులవల్ల ప్రపంచానికి మరుగైపోవల్సిన మెన్నోవిషయాలు మనందరికీ తెలిసాయి. ఇరవైఏళ్లుపైనే అతడూ లింకనూ కలిసి ప్రాక్టీసు చేశారు. ముందు గుమాస్తాగా, తరువాత సహచారిగా హెర్నెడన్‌తో పనిచేశాడు లింకను - 1839 నుండి 1861 వరకూ - దురదృష్ట వంతురాలైన మేరీటాడ్‌ని వివాహం చేసుకున్న దగ్గిరనుంచీ, కాంగ్రెసులో కొన్నాళ్లు అనామధేయంగా లింకను పని చేయ

డం, తరువాత అధ్యక్షుడవడం దగ్గరనుంచీ హత్య చేయబడే వరకూ హెర్న్డన్ అన్నీ యెరుగును. లింకను పోయిన తరు వాత హెర్న్డన్ తనశేష జీవితమంతా లింకను జీవితానికి సంబంధించిన ప్రతీ చిన్న విషయాన్నీ, వివరాన్నీ, సేకరించి గ్రంథరూపంలో వెలువరించాడు. అంతేగాదు, లింకను గొప్ప దనాన్ని, ఆగొప్పదనానికి వెనకనున్న వ్యధాహృదయాన్ని, ఒంటరితనాన్నీ, కర్మవాదిత్వాన్నీ, వేదాంతాన్నీ వివరించి చూపించడానికి హెర్న్డన్ ఎంతో కష్టపడ్డాడు. బిల్లీతో "నాకు చాలా చెడ్డచావు వస్తుంది" అంటూ తరుచు అనే వాడనీ, తన్నెప్పుడూ మృత్యువు వెంటాడుతున్నట్టే చెప్పే వాడనీ రుజువు చేశాడు. అలాగే వాక్ జోష్స్పీడుకు తప్ప యెవరికీ తెలియని ఏవీ జీవితరహస్యాని హెర్న్డన్ తనపట్టు దలవల్ల బయటపెట్టాడు. "మామూలుగా చూస్తే లింకనంత అప్రయోజకుడు యెవరూ లేనట్టుగా కనబడతాడు. ఏదీ పట్టించుకోనట్టు తిరుగుతాడు. కాని అన్యాయం జరుగుతుందని గాని పసికట్టాడా భల్లూకంలా న్యాయంకోసం పెనుగులాడి ప్రాణాల్నికూడా సరకుచేయడు" అని జోష్ ఉత్తరంలో వ్రాసాడని హెర్న్డన్ రాశారు.

ప్రస్తుత నాటకంలో లింకనేగాక మిగిలిన పాత్రలను కూడా యదార్ధదృష్టితోనే చిత్రించాను, కాని స్టీవెన్ డగ్లసు పాత్రకుమాత్రం న్యాయం చేయలేకపోయాను. లింకన్నూ, అతన్నీ పోల్చేప్పుడు, వారి సంభాషణలు చిత్రించేప్పుడూ కొంత డగ్లసుకు చేయవల్సిన దానికన్నా అన్యాయం జరిగింది. చరిత్రలో డగ్లస్ అంత చెడ్డవాడుకాడు.

మేరీటాడ్ చరిత్ర చిత్రంలోకూడా ఆమెను భర్త నీడగా, ఛాయగా గాక యింకోలా చూడలేకపోయాను. ప్రపంచంలో యెవరూ గ్రహించనప్పుడే భర్త గొప్పతనం ఆమె చురుకు బుద్ధి వల్ల గ్రహించింది. సూక్ష్మగ్రాహి, చక్కనిదికూడ అవడం వల్ల యెందరో వయసుగాళ్ళు ఆమెయింటిచుట్టూ పారా యిచ్చినా లాభంలేకపోయింది. ఆమె అచంచల విశ్వాసంవల్ల భర్తతో 18 ఏళ్లు కష్టనిష్ఠురాలుపడి భరించి, హృదయాన్ని మొరటు బారించుకుంది. తుదకు ఆనందం అనుభవించే కాలానికి మతిభ్రమింప జేసుకుంది. లింకన్ని హత్యచేశారని వినగానే "దైవమా! నాభర్తని హంతకులకు వొప్పజెప్పాన"ని వాపోయింది. భర్త గొప్పదనాన్ని విశ్వసించి, అతనిలో అత నికి నమ్మకం కలిగించి, చివరకు బిడ్డల్ని కోల్పోయినా చలించ కుండా అతణ్ణి ఆమె ధ్యేయమైన అధ్యక్షపదవి పొందేలా ముందుకు నడిపించింది. ఆమె తన లక్ష్యసిద్ధే చివరకు హత్యా కారణమైందని వాపోయిందేమో !

## మొదటి రంగం ( 1833 సం॥)

కర్రలతో కట్టిన పదిహేను కొంపల గ్రామం న్యూసేలమ్. అక్కడికి ఇరవై రెండేళ్ల లింకను 1833 వేసవిలో వచ్చాడు. అప్పుడు ఎలక్షనురోజులు. అక్కడ వుంటూవున్న తూర్పు దేశవాసి జాన్ మెక్ నెమర్ అనే గుమాస్తా ఎన్నికల లెక్కలు పెడతానని ఒప్పుకున్నాడు. ఊళ్లోవున్న పానశాల యజమాని కూతురు ఏన్ రట్లెడ్జిని పెళ్ళిచేయడానికి నిశ్చయమైంది. కాని ఎందుకనో మెక్ నెమర్ వూరువదిలి వెళ్ళిపోయాడు. ఇక ఆ వూళ్లోవుందల్లా వొక్కస్కూలుమేష్టరు మెంటరు గ్రహామే.

అతనుకూడా ఎన్నికల్లో పనిచేస్తూవున్నాడు. ఊళ్ళోకి కొత్తగా వచ్చిన లింకన్‌ను "ఎన్నికల లెక్కల్లో సాయంచేస్తావా? రాయనూ చదువనూ వచ్చా?" అని అడిగాడు. "చేతనౌన"ని సమాధానం రాగానే అతణ్ణి సహాయానికి పెట్టుకున్నాడు. రాత్రుళ్ళు అతనికి చదువునేర్పేవాడు. "ఏబీఅంత కష్టపడి చదివేవ్యక్తినీ, ఋజువాదినీ నేను ఎక్కడా చూడలేద"ని ఒకప్పుడు ఏన్‌రట్లెడ్జి అన్న వుత్తరం రాశాడు. ఏబీ సాహిత్యప్రియత్వానికి చాలావరకూ పునాదివేసింది మెంటరు గ్రహామే! ఏబీ'కీట్సు'కవి రాసిన"మృత్యువు" చదివినట్టు రుజువులేకపోయినా రచయితగా దీన్ని మొదటి అంకంలో ప్రవేశపెట్టాను. దానికి కారణం లింకను తరుచు మృత్యువును గురించిన పద్యంచెపుతూ వుండడమే.

## రెండవరంగం (1834 సం॥)

ఈ రంగంలో ప్రవేశపెట్టిన బెన్ మేట్‌లింగ్, ట్రం కాగ్డెల్, క్లారీ గ్రోవ్ కాడీలందరూ కేవలం కల్పితమానవులు. సేత్ గేల్ ముందురాబోయేరంగంలో ముఖ్యపాత్రగనక యీ రంగంలోనే ప్రవేశపెట్టవల్సివచ్చింది. జోష్ స్పీడును ఈసన్నివేశంఅయిన రెండుమూడుసంవత్సరాలికి లింకను నిజంగా కలుసుకున్నా, కథాసరళికోసం యీరంగంలో ప్రవేశపెట్టాను. జోష్ స్పీడు నిజానికి లింకనుకు, స్ప్రింగుఫీల్డులో పరిచయమయ్యాడు గౌరవకుటుంబానికిచెందిన వ్యాపారి అతను. జోష్ స్పీడుకూ, లింకనుకూ పరిచయంకావడం చాలాచక్కని సన్నివేశం.

స్పీడుకొట్టులోకి లింకనువచ్చి కొన్నిసామానులు ఖరీదు చేశాడు. వాటిఖరీదు కాగితంమీదలెక్కలుకట్టి సిట్టూరాచ్చి,

“ఇన్నైతే చవగ్గావున్నా వీటినిప్పుడేకొనేసాము. నాదగ్గిర లేదు. క్రిస్టమస్ వరకూ మీరాగితే అప్పటికి పూర్తిగాసొమ్ము యివ్వగలను. అప్పుడుగాని యివ్వలేకపోతే మీ ఋణం తీర్చలేనన్నమాటే!” అనేప్పటికి ఆతనికంఠంలోవున్న విచారం, ఋజుత్వం జోష్ని ఆకర్షించాయి. వెంటనే అతను “నువ్వు అప్పుచేయకుండా మార్గంవుందొకటి, దానికంగీకరిస్తావా? నేను కాపరముంటున్న గది పెద్దది. రెండుమంచాలున్నాయి. మనయిద్దరికీ సరిపోతాయి. అభ్యంతరంలేకపోతే నాతో వుండవచ్చు” నని అన్నాడు. మారుమాటాడకుండా లింకను మేడమీదకువెళ్ళి గదిచూచుకువచ్చాడు. “జోష్! నీదయకు కృతజ్ఞుణ్ణి” అన్నాడు ఆనందం వెల్లివిరుస్తున్న ముఖంతో. ఆనాటినుంచీ వారిస్నేహం ఏబీ మృత్యుపర్యంతం వర్ధిల్లింది.

ప్రతివాళ్ళనీ ఆకర్షించి, హృదయమిచ్చి, సన్నిహితుల్ని చేసుకునేశక్తి లింకను చిన్ననాటినుంచీవుంది. న్యూసేలమ్‌లో అడుగుపెట్టేప్పటికి ఇరవైమూడేళ్ళవాడు, అప్పటికే ప్రజల తల్లో నాలుకలావుంటే రాష్ట్రశాసనసభాఎన్నికలకు నిలబడి జయంపొందాడు. మొదటి ఉపన్యాసం ఆరంభించినప్పుడే “మిత్రులారా! మీరందరూ యెరుగుదురు. ఈ అమాయకుడు, ఊరూపేరూలేని ఏబీ లింకన్‌ను” అంటూ వారి మనసుల్ని యిట్టే ఆకర్షించాడు.

లింకనూ, యింకోఅతడూకలిసి కిరాణాకొట్టు పెట్టారు. స్నేహితుడి దురలవాట్లవల్ల కొట్టు దివాలాతీసింది. లింకను అప్పులన్నీ తీర్చేబాధ్యత యెవరూ అడగకుండానే తనమీద పెట్టుకున్నాడు. అందుకని ఆచుట్టుపక్కలవాళ్ళందరికీ ఇత

నంటే వొకవిధమైన అనురాగం యేర్పడింది. స్ప్రింగుఫీల్డులో తరువాత లాయరుగా ప్రాక్టీసుచేస్తూ ఈ అప్పులన్నీ తీర్చాడు.

ఏన్ రట్లెడ్జిని లింకను హృదయపూర్తిగా ప్రేమించాడు. ఆమె ప్రభావం అతనిమీద చాలాపడింది. ఏన్ మెక్ నెమర్‌ను ప్రేమించి మోసపోయింది. ఏమైనా ఏబీకి యేవిధమైన అనుబంధం వర్థిల్లినట్లు రుజువులేదు. బహుశా ఏబీ హృదయం మాత్రం ఆమెకోసం ఆక్రోశించింది. అందువల్ల ఆమె మృత్యువతనికి గొడ్డలిపెట్టుఅయింది.

## మూడవరంగం (1835 సం॥)

డికెన్సు రాసిన 'పిక్ విక్ పేపర్లు' చదువుతున్నట్టు రాశాను. కాని నిజానికిది కొంచెం దూరమే. 1836 కు గాని యీపుస్తకం ప్రచురించబడలేదు.

లింకను తరుచూ షేక్స్పియరుమహాకవిరాసిన 'హేమ్లెట్' చదువుతూండేవాడు. ఏన్ చనిపోయినప్పుడామె సమాధి దగ్గిర ఎంతోకాలంగడిపేవాడని అక్కడి పల్లీయులు చెప్పేవారు. అందుచేతనే అతడు ఆమెపోయినప్పుడు "ఒంటరిగా ఆమె అక్కడవుండడం నేను సహించలేను," "భగవాన్ నీవే ఆమెను మాకు ప్రసాదించావు. మళ్ళీ నీవే ఆమెను నీదరికి చేర్చుకున్నావు," అని ఏన్ తలిదండ్రులు ప్రార్థించినా నేను వాళ్ళతోకలిసి ప్రార్థించలేకపోయాను, అన్నాడు ఏబీ! ఏబీ నమ్మేదైవంవేరు. అతనిదృష్టిలో దైవం దయామయుడు మాత్రమే! మతవిషయంలో అతడు మతావేశాపరులతోగాని, యేదోవొక ప్రత్యేకచర్చితోగాని యేకీభవించడు.

ఏన్ పోయింతరువాత సరదాగా, హుషారుగావుండే ఏబీ ముసలివాడైపోయాడు. స్ప్రింగుఫీల్డు వచ్చింతరువాత మేరీ

టాడ్‌తో పరిచయమైంది. కానియిద్దరూ ప్రేమికుల్లా ప్రవర్తించలేదు. ఈకాలంలోనే డగ్లసుతో ఏబీకి రాజకీయస్పర్ధ యేర్పడింది. కాని, బయటవారు విరోధంగావున్నట్లు సాక్ష్యం లేదు. వారివాదాల్లో బానిసత్వనిరోధంపై నచర్చలు చెలరేగ లేదు. కేవలం ఆర్థికమైనవిషయాల్లోనే వాదనలుజరిగేవి. ప్రభుత్వఆదాయమంతా వేన్‌డాలియాలో ఖర్చుగాకుండా స్ప్రింగుఫీల్డులోకూడా కొంతఖర్చుపెట్టేట్టుచేయగలిగాడు ఏబీ. దీనితో అతనిప్రతిపత్తి హెచ్చింది.

## నాల్గవ రంగం ( 1840 సం )

గొలుసులతోకట్టిన బానిసల్నిచూసి హృదయం తరుక్కుపోయిందని జోష్ స్పీడు చెల్లెలికి లింకను వుత్తరంరాశాడు. కాని, యిక్కడ ఈమాటల్ని అతనిచేత అనిపించవల్సి వచ్చింది. లింకను డగ్లసుతో మళ్లీ మెక్సికనుయుద్ధంగురించి తలపడవల్సి వచ్చింది. అతనికి యుద్ధమన్నా, దెబ్బలాటలన్నా అయిష్టమని తెలుతుంది. ఈసందర్భంలోనే, న్యూసేలమ్‌లోని కొందరి వాలంటీర్లతో ఏబినాయకత్వంకింద బేక్‌హాక్ యుద్ధం సాగింది. యుద్ధంలో ఈవొక్కసందర్భంలోతప్ప యేబీకి మరే విధమైన అనుభవంలేదు. తిరిగిఅతడు స్టేట్సుకు అధ్యక్షుడైనప్పుడే సైనిక సంబంధం కలిగింది.

## అయిదవ రంగం (1840సం॥)

హెర్నెడన్ మేరీ, ఏబీల వివాహంగురించీ, ప్రయాను చందాల్నిగురించీ నినియన్‌యడ్వర్డు భార్య ఎలిజబెత్ టాడ్‌ను ప్రశ్నించినపుడు ఆమె "వాళ్ళిద్దరూ మా హాల్లో కూర్చుని కబుర్లు చెప్పుకునేప్పుడు చాలాసార్లే చూచాను. ఎప్పుడూ

చూచినా మాచెల్లి మేరీ ఏదో మాట్లాడుతూనే వుండేది. ఏబీ నోరు మెదల్చకుండా, ఆమెనంక చూస్తూ కూచుండే వాడు. మేరీ చాలాచురుకైనది, సుశిక్షణ వున్న స్త్రీ. విద్యలో గాని, సుశిక్షణలోగాని, మర్యాదల్లోగాని ఇద్దరికీ పోలిక లేదు. అసలు ఏబేకి అందమైన ఆడవాళ్ళతో యెట్లామాట్లా డాలోకూడా తెలియదు. కాని ఏదో మాటలకందని ఆకర్షణ అతన్ని ఆమెవైపుకు లాగేది. వాళ్ళిద్దరికీ కుదరదని నేను అన్నాను. కాని మేరీ వింటేనా! చిన్నప్పటినుంచీ గొప్ప లక్ష్యాలుండేవి. ఎప్పుడూ కోటీశ్వరుణ్ణో తనభర్తని అమెరికా అధ్యక్షుణ్ణి చేస్తానంటూ వుండేది. ఆమె కార్య దీక్షతే అతన్ని చాలావరకూ ముందుకు నడిపింది" అని చెప్పింది.

ఎలిజబెత్ అన్నట్టు ఇద్దరికీ పొత్తుకుదరలేదనమాట మామూలు పరిస్థితుల్లో నిజమే అయినా, ఒకరికోసం ఒకరు పుట్టారనక తప్పదు.

## ఆరవ రంగం (1841సం॥)

చాలామంది వూహించినట్టు మేరీటాడ్‌కి లింకను వుత్తరం రాయడం, దాన్ని స్వయంగా ఈయలేక జోష్‌స్పీడు నియ్య మనడం చారిత్రాత్మకంగా అసత్యం కాదు. లింకను మేరీ ప్రేమనుంచి విముక్తుడు కావాలని కోరగానే అతన్నెలా అయినా తనవాణ్ణి చేసుకోవాలని మేరీ యోచన చేసింది. దాని ఫలితంగా అతనిలోని అసూయ రేకెత్తాలని, కావాలని మిగిలిన యువకులతో సరస సల్లాపాలాడడం మొదలుపెట్టింది. మేరీఅనుకొన్న దానికి వ్యతిరేకంగా జరిగింది. లింకను ఆమెను మరీ చేరువకావడానికి బదులు, దూరమైపోవడానికే నిశ్చయించు

కున్నాడు. స్వయంగా ఆమె దగ్గిరికి వెళ్ళి చెప్పేధైర్యంలేక వుత్తరం రాశాడు. దాన్ని జోష్ చదివి నిప్పులోకి విసి రేశాడు.

ఈ రోజుల్లోనే లింకను ఆత్మహత్యకూడా చేసుకుంటాడేమోనని జోష్ చుట్టుపక్కల కత్తీ, చాకూ మొదలైనవేమీ లేకుండా కాపాడేవారు. లింకనే తన హృదయవ్యథ తెలియజేస్తూ జడ్జీ స్టూయార్టు కొక వుత్తరం రాస్తూ "కొద్ది రోజుల్నించి నాకు మతిపోతూవుంది. నాదారుణమైన వ్యథతో ఆట్టేకాలం బతకలేను. ఈ వ్యథనుంచైనా తప్పించుకోవాలి, చచ్చైనాపోవాలి" అని వ్రాశాడు.

ఈరోజుల్లోనే స్నేహితుల బలవంతంవల్ల డాక్టరు డేనియల్ డ్రేక్ కు తన బాధలన్నిటినీ వివరిస్తూ వొకవుత్తరం రాశాడు. ఆవుత్తరాన్నంతా స్పీడుకు చదివి వినిపిస్తూనే, అందులో కొంతభాగాన్ని చదవనన్నాడు. బహుశా ఏన్ రట్లెడ్జికి సంబంధించిన విషయమేమైనా అయివుండవచ్చునని స్పీడువూహించుకున్నాడు. ఏదిఏలా అయినా డ్రేక్ లింకను వుత్తరం చూచుకుని "స్వయంగా పరిశీలిస్తేగాని యేదీచేయలేనని" వ్రాశాడు. ఆవుత్తరం యెంత చారిత్రాత్మకమైనదో గుర్తించకుండానే లింకను కోర్కెప్రకారం డాక్టరు డ్రేక్ దాన్ని నాశనం చేసేశాడు. ఒకగంభీరహృదయ గతరహస్యం కాలగర్భంలో కలిసిపోయింది.

## ఏడవ రంగం (1842సం॥)

కేవలం కల్పితమవడంచేత యీరంగం రాయడం చాలా కష్టమైన పనైంది. లింకను వుండుండి వొక్కసారిగా గొప్పవాడై పోలేదనీ, అతనికి హృదయపరివర్తన నెమ్మదినెమ్మదిగా, అతనికే తెలియకుండా వచ్చిందనీ చెప్పడానికే యీరంగం

కల్పించబడింది. మేరీటాడ్ మొదలుకుని అతని స్నేహితు లెందరు ప్రోత్సాహపరిచి దేశసేవాసక్తునుగా చేయబోయినా అంగీకరించలేదు. బానిసవ్యాపారాన్ని మనస్ఫూర్తిగా యెంత నిరోధించినా క్రియాత్మకంగా దాన్ని అమలు జరిపితే దక్షి ణాది వారితో యుద్ధంవచ్చి, రక్తపాతం జరుగుతుందని ఏబీకి తెలుసు. అందుకనే దక్షిణాదివారితో తలపడడానికి అంగీక రించలేదు. కాని దక్షిణాదివారి నిరంకుశత్వం యింకాయింకా పాకిపోయి కొత్త వలసరాష్ట్రాల్లోకూడా వ్యాపించే సమయం వచ్చేటప్పటికి అతనిలో అణిగివున్న ధర్మపిపాస పడివుండలేక పోయింది. న్యాయపిపాస అతణ్ణి చైతన్యవంతుణ్ణిచేసింది. తనకు తను రాజకీయాల్లో ప్రవేశించాడు. విజయం సాధించాడు.

ధర్మంకోసం, స్వాతంత్ర్యంకోసం నెదికేరక్తం ఏబీలో ప్రవ హిస్తూంది. పడమటితీరానికి వలసపోయేవాళ్ళంటే ఎప్పుడూ అభిమానమే. అందుకనే సెత్ గేల్ కొడుకునిగూర్చి ప్రార్థన చేసేప్పుడు అతనితో ఈసందర్భాన్ని పురస్కరించి కొన్ని మాటలు పలికించవల్సివచ్చింది.

## ఎనిమిదవ రంగం (1842 సం॥)

మేరీని వివాహంచేసుకోడానికి ముందే లింకన్ తనజీవిత ధ్యేయాన్ని గుర్తించాడనడం చారిత్రాత్మకంగా నిజంకాదు. అతని జీవితంలో పెళ్ళిఅయిన తరువాత యించుమించు 12 సంవత్సరాలు పట్టింది, తన ధ్యేయమేమిటో తెలుసుకో డానికి. కాని కథారచనకు పరిపుష్టికోసం యీరంగంలో అలా రాయక తప్పలేదు.

లింకను ఎసంబ్లీకి 1846 లో నిలబడి నెగ్గాడు. కాని యీ విజయంలో వుత్సాహం లేనట్టుగా స్పీడుకు వుత్తరం రాశాడు.

1848 సం॥లో ప్రెసిడెంట్ పోక్‌సి, అతని 'మెక్సికన్' యుద్ధాన్ని విమర్శించేప్పటికి అందరూ ఏబీని విమర్శించారు. దీంతో కొంతకాలంవరకూ లింకను రాజకీయజీవితం ముగిసిం దనుకున్నారు.

కాని 1854 సం॥లో 'పియోరియా' లో యిచ్చిన వుప న్యాసంతో అతని కీర్తి దేశం నలుమూలలా వ్యాపించింది. 'లిబరల్' పార్టీ నన్నెముకగా పేరు కెక్కారు. సందేహ నివృత్తి అయిన, ధైర్యశాలి లింకను ప్రపంచంలో పునర్జన్మ మెత్తాడు.

## తొమ్మిదవ రంగం (1858 సం॥)

డగ్లసు సెనేటుకు నిలబడ్డాడు. అతణ్ణి యెదిరించడానికి లింకను నిలబడ్డాడు. లింకన్ వుపన్యాసాలు చాలా ఘాటుగా వుండేవి. వాటినిముందే చదువుతూవుండే అతని పార్టీ మిత్రులు కూడా అతణ్ణి కొంచెం నెమ్మదిగా వాదించమని సలహా యిచ్చారు. కాని లింకనుది యమపట్టుదల. అంతర్యుద్ధాన్ని రేకెత్తిస్తున్నాడనే అపవాదుకుకూడా భయపడలేదు.

వీరిద్దరి వాదోపవాదాలూ వినడానికి జనం తండోపతండా లుగా వచ్చేవారు. డగ్లసుకు లింకన్‌తో వాదించడం యిష్టం వుండేదికాదు. కాని ప్రజలు వూరుకుంటారా? సినిమాలూ, రేడియోలూ లేని ఆకాలంలో రాజకీయ వుపన్యాసాలుకూడా జనానికి వినోదకారణంగానే వుండేవి.

లింకను బానిసత్వాన్ని నిరోధించడానికి చాలా కారణాలు చెప్పాడు. అందులోవొకటి: 'ఈనాడు బానిసలకన్నా మనం అధికులం' అనేవారే రేపు, జ్యూస్ పనికిరారనీ, పరదేశీయు

లంతకన్నా తక్కువవారని ఇలా తరతమ బేధాలు పెట్టు కుంటారని చెప్పినమాట తరువాత వాస్తవమైంది.

ఈ రంగంలో చూపినంతగా డగ్లసు సామాన్యుడు కాదు. లింకను డగ్లస్‌లు పాతికేళ్ళు రాజకీయ మిత్రులుగా వున్నారు. అభిప్రాయ బేధాలున్నా చివరిరోజుల్లో లింకను అమెరికా అధ్యక్షుడు కాగానే డగ్లసువచ్చి అతని స్నేహాన్ని అర్థించాడు. మళ్ళీ అంతర్యుద్ధం వచ్చినప్పుడు లింకనుతోపాటు బానిస త్వాన్ని నిరోధించాడానికి సంసిద్ధుడవడమేగాకుండా, దేశ మంతా తిరిగి వుపన్యాసాలుకూడా ఈయడానికి పూనుకున్న దేశభక్తుడు.

## పదవ రంగం (1860 సం॥)

ఈరంగంలో వచ్చిన స్ట్రివ్‌సన్, బేరిక్, క్రిమ్మిన్ ముగ్గురూ సృష్టించబడిన పాత్రలే! ఆనాటి రాజకీయ వేత్తలెలా వుండే వారో తెలియజేయడానికే వీరిని ప్రవేశపెట్టవల్సి వచ్చింది.

"లింకన్ ఎప్పుడూ చర్చికివెళ్ళకపోయినా, అతడసలైన క్రైస్తవుడనడానికేమీ సందేహంలేదు" అని మేరీటాడ్ భర్తనిగురించి చెప్పింది. చివరిరోజుల్లో లింకను యేచర్చిలోనూ చేరకపోయినా ప్రెస్బిటోరియన్ చర్చికి మాత్రం వెళుతూ వుండేవాడు.

లింకను ఎవరూవూహించకముందే అధ్యక్షుడు కావాలనే నిర్ణయానికివచ్చాడు. అందుకనే చాలామంది పెద్దపెద్దవ్యాపారులకూ, రాజకీయవేత్తలకూ తనవుద్దేశం తెలుపుతూ వుత్తరాలురాశాడు. అందుకనుగుణంగా అతనిస్నేహితుల్ని కొందర్ని డబ్బిచ్చికూడా నామినేషనుప్రయత్నాలు చేయమనిపంపాడు. అనుకున్నట్టుగానే అధ్యక్షపదవికి నామినేషను

చేయబడ్డాడు. కాని, యెవరూ లింకను నెగ్గుతాడనుకోలేదు. లింకను స్నేహితుల తెలివితేటలవల్లా, లంచగొండితనంవల్లా నెగ్గాడు. కొందరికి వుద్యోగాలిస్తామనీ, పదవులిస్తామనీ మాటలిచ్చారు.

కాని లింకను, మనసుబాధపడిందో, భయపడ్డాడో తెలియదుగాని చివరిరోజుల్లోమాత్రం స్నేహితులకు "నాపేరుమీద యేవిధమైన ప్రమాణాలు చేయకండి. మీరుచేసే ప్రమాణాలకి నేను బాధ్యుణ్ణికాద"ని వ్రాశాడు. యత్నమంతా అయిపోయింది, ఎన్నికలు సమీపించాక యిలా వ్రాయగానే స్నేహితులతనిమాటలు మన్నించలేదు. "మనదగ్గిరలేడు లింకను. మనంయిచ్చినమాటల్ని అతనుతప్పకుండా నిలబెట్టితీరాలి. తప్పదు" అన్నారు. అల్లాగే ఎంతోవ్యథతో అధ్యక్షుడుగా యేబీ వాళ్ళ కోర్కెల్ని తీర్చకతప్పలేదు.

అధ్యక్షుడిగామాత్రం లింకను అధికారాన్ని యెవరూ కాదనలేకపోయారు. "మనచెప్పుచేతల్లో వుండకేమిచేస్తాడ"నే వాళ్ళందరికీ పాఠంచెప్పాడు. ఎవరుయేమిచెప్పినా చెవినిపెట్టుకునేవాడుకాదు. ఎలా అయినా యుద్ధంజరగకుండా "శాంతి సౌహార్దతలు" నెలకొల్పాలనుకున్నాడు. ఈలోగా అతని బతుకు తెల్లవారిపోయింది. ఒకద్రోహితలపెట్టిన హత్యలో వుజ్జ్వలమైనజీవితం అంతమైపోయింది.

## పదకొండవరంగం (1860 సం॥)

1860 నవంబరు 6వ తేదీన ఎలక్షను జరిగింది. లింకనుజయం తథ్యమని అందరికీ తెలుసు. లింకను నెగ్గకూడదని నిశ్చయించుకున్నారు దక్షిణాత్యులు. నెగ్గినా, అతని ఆధిపత్యాన్ని అంగీక

రించ దల్చుకోలేదు. అందుకనే ప్రతియువకుడూ సైనికుడు కావడానికి సంసిద్ధుడుగా వుండాలనీ, ఆయుధ ధారుడై వుండాలనీ గవర్నరు ప్రకటించాడు.

అందుకనే లింకను "నేనుమోయలేని బాధ్యతను నాతలపై వుంచా" రన్నాడు. నిజానికి లింకనులా యేవిధమైన రాజకీయ అనుభవం లేకుండానే అధ్యక్షపదవి నలంకరించినవాళ్ళు నాటికీ నేటికీకూడా అమెరికా దేశచరిత్రలో యెవరూలేరు.

మేరీ ఎన్ని పిచ్చిచేష్టలు చేసినా లింకను వోపికగా వుండేవాడని నిరూపించడానికెన్నో వుదాహరణలున్నాయి. కాని మేరీ చేష్టలు మరీ మితిమీరిపోయినప్పుడుమాత్రం లింకను కోపం హద్దుమీరిందని చెప్పకతప్పదు. నిజానికి మేరీని లింకను యింత క్రూరంగా చూశాడా అని చాలామందికి సందేహం కలగవచ్చు కాని, యిది మాత్రం సత్యం. ఎన్నికల సమయంలో యిద్దరి వోపికలూ నశించాయి. అందువల్ల లింకను భార్యమీద విసుక్కోవడం సహజంగా వుంటుందని ఈసందర్భంలోనే లింకను కోపం చూపించాను. నిజానికి మేరీ లింకన్ని రోజూ సతాయిస్తూ వుండేది. కొన్నిసార్లు నవ్వి, కొన్నిసార్లు ఇంట్లోంచి వెళ్ళిపోయీ రోజులు వెళ్ళబుచ్చేవాడు. ఒకసారి మేరీ లింకన్ని దులిపిపోస్తూ వీధిని పడింది. దాంతో లింకను వెనక్కి తిరిగి మేరీని పట్టుకుని ఇంట్లోకి ఈడ్చుకుపోయాడని అతని జీవితచరిత్ర వ్రాసినవారు రాసారు. దీన్ని ఆధారంగా చేసుకునే నేను లింకను విసుగు చూపించాను.

## పంద్రెండవ రంగం (1961)

ఎన్నికలైన తరువాత లింకను జీవితం అనుక్షణం ఆపదలతో చుట్టుముట్టబడింది. కాని లింకన్ను జాగ్రత్తగా వుండ

మని యెవరెన్ని చెప్పినా నిర్లక్ష్యంగానే వుంటూవుండేవాడు. అందుకని సైన్యాధికారులు వేయికళ్ళతో అతన్ని కనిపెట్టుకుని వుండక తప్పలేదు.

రైలు ప్లాటుఫారమువద్ద ప్రజలదగ్గిర సెలవు తీసుకుంటూ "మళ్ళీ మీఅందరి దగ్గిరికీ యెప్పుడు యేపరిస్థితుల్లో వస్తానో చెప్పలేను" అన్న మాటలు హృదయవిదారకంగా వున్నాయి. రాబోయే విషమపరిస్థితి లింకను హృదయగతమయ్యే యీ మాటలు పలికాడా అనిపిస్తుంది.

లింకను అమరజీవిగా వెలిసింది, చెరిగిపోని అతని పలుకుల వల్లనే! అందుకనే అతడు పరలోకగతుడైనా అతని వుపన్యాసాలు మాత్రం ఆచంద్రార్కం వుండిపోతాయి అనడానికి సాక్ష్యం సువర్ణాక్షరాలతో వ్రాయవలసిన అతని మాటలే! ఆనాడే లింకను వొక దేశానికీ, వొక మతానికీ చెందినవాడు కాదు, స్వాతంత్ర్యసమరాన్ని జరిపేవారంతా తనసోదరులన్నాడు. ప్రపంచమంతా తనదేశమన్నాడు. అందుకనే "నాదేశం వొక్క తనవాళ్ళకేగాదు వ్యక్తిస్వాతంత్ర్యాన్ని యిచ్చింది, సర్వప్రపంచంలో యెక్కడ పీడితప్రజలున్నా వారందరికీ అండగా నిలుస్తుంది. ఈ సూత్రాన్ని నా దేశ అమలుపరచలేకపోతే, దానికోసం నా ప్రాణత్యాగమైనా చేస్తా" నన్నాడు. అలాగే లింకను తన నమ్మిన ధర్మాన్ని అనుసరించడంలో అతని ప్రాణాన్ని బలిదానంచేసి అమరుడైనాడు.



**ABE LINCOLN IN ILLINOIS (Telugu)** **Rs. 2-00**

# ఏబీలింకన్

భారతీయ స్వాతంత్ర్య సముపార్జనకోసం బాపూజీ యెంత కష్ట పడ్డారో, అమెరికా స్వాతంత్ర్య రక్షణకై అబ్రహాము లింకన్ అంతే కష్టపడ్డారు. పేరు కొకరు భారతీయులూ, యింకొకరు అమెరికనూ అయినా, యిరువురూ మానవ స్వాతంత్ర్య సముపార్జనా వీరులే! ఒకరు హరిజనోద్ధరణకై కంకణం కడితే రెండవవారు నీగ్రో సముద్ధరణకై బద్ధకంకణులయ్యారు. అహింసా వాదులైకూడా హింసా కాండకు, దుస్పృహానానికీ బలయ్యారు. ఇద్దరూ సామాన్య పరిస్థితుల్లోంచి పైకి వచ్చినవారే! ఇరువురూ అమర జీవులే!! ఇరువురి పలుకులూ బంగారుశకలాలే!!!



రచనలు : వంటింటి సౌభాగ్యం, వెలుగు నీడలు, అగ్నిగుండాలు, నాలుగు నాటికలు భారత జనాభా భిన్న స్వరాలు, ఇంకా చాలా అముద్రితాలు వున్నాయి. సాహిత్య సేవకుతోడు సంఘసేవ. చిన్న ఇటి వృత్తాన్ని తీసుకుని సున్నితమైన సన్నివేశంలో హృదయం కదిలింప చేసేచాకచక్యం వీరిలోవుంది.



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కొ
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము